ప్రచురణ : 25 డిసెంబరు, 1990.

వెల : రూ. 25/-.

ముఖచిత్రం :

పి. హెచ్. రావ్

ముద్రణ :

స్నేహలత ప్రింటర్స్,
పాటిగడ్డ కాలనీ, సికింద్రాబాదు-3.
ఫోన్ : 847946.

ప్రతులకు :

రచయిత్రి,
I. C. 232, ఎర్రమంజిల్ కాలనీ,
హైదరాబాదు.

---

ఈ పుస్తక ముద్రణకి తెలుగు విశ్వ విద్యాలయంవారు
ఆర్థిక సహాయం చేసినారు.

# కథా శాకుంతలం

శ్రీమతి వేదుల శకుంతలగారి కథలకి నేను చాలా కాలంనుంచీ అంటే కాలేజీ రోజుల్నుంచో, ఛార్టెర్డ్ అకౌంటెన్సీ చదివేకాలంనుంచో పాఠకుడిని. ఆమె సీరియల్స్‌గాని నవలలుగానీ, వ్రాసినట్టు నాకు గుర్తులేదు. కానీ ఆమె పేరు సుపరిచితమే. కేవలం కథలు వ్రాసి రచయిత్రిగా పేరు సంపాదించుకునేలా చేసినారంటే, దాన్నిబట్టే ఆ కథల విశిష్టత తెలుస్తుంది

కథానికలు అనగానే కొసమెరుపు గుర్తొస్తుంది. కొసమెరుపు మంచిదే. కానీ కేవలం కొసమెరుపుని దృష్టిలో పెట్టుకుని, ముందంతా "ఏదో" నింపటం మంచి పద్ధతి కాదు. చాలామంది కథా రచయితల్లో ఈ పద్ధతిని చూస్తూ వుంటాం. శకుంతల గారి కథల్లో ఇదిలేదు. మొదటి వాక్యంనుంచీ పాత్ర పోషణ కథలో లేక చెప్పదల్చుకున్న విషయంపట్ల మూడ్‌లోకి పాఠకుల్ని తీసుకువెళ్ళాలన్న తపన కనపడతాయి. చివరికి రచయిత్రి చెప్పదల్చుకున్న విషయం స్పష్టంగా అర్థమై, కథ చదువుతున్న పాఠకుడి మనసు ఆర్ద్రమవుతుంది. బహుశ అందువల్లనే ఏమో, శకుంతల గారి చాలా కథలకు బహుమతులు వచ్చినవి.

'మనసెప్పుడూ గుప్పెడే' కథలో గొప్ప మానసిక విశ్లేషణ కనపడుతుంది. మనం ప్రతిరోజూ ధర్మం చేసే బిచ్చగాడు, చిన్న కిళ్ళీ కొట్టు పెట్టుకుని అంచెలంచెలుగా పెద్దవాడై మన ఇంటిముందే మనకన్న పెద్ద ఇల్లు కట్టుకుంటే మనం ఆనందించే గలిగే గొప్ప మనసుతో ఉండగలమా? ఇదొక పాయింటు....అవతలి వాళ్ళు ఎలా

ఉండాలో, ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో, మన వాదనలకి కన్వీనెంట్‌గా మనం నిర్దేశిస్తాం. అలా వాళ్ళుంటే సంతోషిస్తాం. లేకపోతే విచారిస్తాం. ఉక్రోష పడతాం. ఇది రెండో పాయింటు. ఈ రెండూ ఈ కథలో చాలా బాగా విశ్లేషించటం జరిగింది. ఈ కథ ఆమె 1982 లో వ్రాసారు.

రెండో కథ దాదాపు పాతిక సంవత్సరాలక్రితం వ్రాసారు. ఆ శైలి తెలుస్తూంది. చాలా సాధారణమైన కథ 'అనమృత్యువు'.

వేదుల శకుంతలగారి చాలా కథల్లో జనాల్ని 'కాకులు'గా చిత్రీకరించే ప్రయత్నం జరిగిందని నేను భావిస్తున్నాను. సునీతిని రాజీనామా చేయించింది జనం (సునీతి-అనే కథలో) వరలక్ష్మిని తప్పుగా అర్థం చేసుకున్న జనం (వరలక్ష్మి) సావిత్రిని తప్పర్థం చేసుకున్న కుటుంబ సభ్యులు (కాకులు) విష్ణుమూర్తిని అనుమానించిన జనం (దుమారం)- ఈ రకంగా చాలా కథలో జనం (సమూహం) ఉంటుందో రకరకాలుగా చెప్పటానికి ప్రయత్నించారు. ఇవి వేర్వేరు కాలాల్లో, వేర్వేరు పత్రికల్లో ప్రచురితమైనప్పుడు ఫర్వాలేదుగానీ. అన్నిటినీ ఒకేచోట పేర్చి చదువుతే మాత్రం, ఇదేమిటి - అన్నీ ఒకే పాయింటుమీద వున్నాయి అనిపిస్తుంది.

ఈ సంపుటిలో అన్నిటికన్నా నాకు బాగా నచ్చిన కథలు 'ఉషోదయాన తుషార బిందువులు', అలాగే-'సునీతి'? రెండు కథల్లోనూ చక్కటి కారెక్టరైజేషన్ కనపడుతుంది. ఒకటి మనసుని ఆహ్లాదపరిచేది, మరొకటి ద్రవింపజేసేది.

శకుంతలగారి కథలో మధ్య తరగతి చిత్రీకరణ అద్భుతంగా, గొప్పగా వుంటుంది. పాత్రలు-స్వభావానికి తగ్గట్టు ఆలోచిస్తాయి. రచయిత్రి కథ మధ్యలో కల్పించుకొని తమ అభిప్రాయాలు చెప్పరు. చాలామంది రచయితలు (నాతో సహా) తెలుసుకోవలసిన అంశమిది.

—యండమూరి వీరేంద్రనాథ్

Phone : Resi. 552178
College : 47266

**Dr. Vasa Prabhavathi**
M A. Phd.
WRITER & POETESS
Regional Film Censor
Board Member

Vasanilayam, 11/2RT,
Municipal Colony,
Malakpet,
HYDERABAD-500036.

# మధ్య తరగతి మందార మాల

ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియంలో కథానిక విశిష్ట స్థానాన్ని అందుకుంది. గురజాడ వారి దిద్దుబాటు కథతో ప్రారంభమైన తెలుగు కథ, పాలగుమ్మి పద్మరాజు గారి గాలివాన కథతో అంతర్జాతీయ స్థాయికి ఎదిగి ఉన్నత స్థానంలో నిలిచింది. కథ, కథానిక రూపాంతరాలుగ కనబడుతున్న కథకంటే భిన్నమైనది కథానిక. అగ్ని పురాణంలో కథానికా లక్షణాలు స్పష్టంగా కనబడుతున్నప్పటికి ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే తెలుగు సాహిత్యంలో ఆధునిక కథానిక యేర్పడినదనుట సుస్పష్టము.

కథానికకు 1. ఎత్తుగడ (ప్రారంభము) 2. గమనము 3. పతాక స్థానము 4 అంతము ప్రధాన లక్షణాలుగా చెప్పవచ్చు. అద్భుతంగా అంతమవుట కథానిక ప్రత్యేకత. దీనినే కొస మెరుపు అనవచ్చు. పాఠకులు ఊహించలేని విధంగా కథను ముగించుటే దీనికొక విశేషం.

వస్తువునిబట్టి ప్రధాన కథను 1) కుటుంబ 2) సామాజిక 3) రాజకీయ 4) ఆర్థిక సమస్యలకు సంబంధించిన కథలుగా పేర్కొన

వచ్చు. ఇవిగాక రసమునుబట్టి శృంగార, హాస్య. అద్భుత కథలని పేర్కొనవచ్చు ఈ కథలను ఇంకా అనేక రకాలుగా విభజించి చెప్పవచ్చు.

ఒక్క స్వరూపాన్నిబట్టి కథను 1) ఒక రోజులో లేక గంట కూడా కావచ్చు 2) అనేక రోజులలో 3) కథ ప్రారంభింపబడి Flash back చెప్పి తిరిగి ముగించే కథలని మూడు రకాలుగా చెప్పవచ్చు.

పై మూడు రకాల కథలు వేదుల శకుంతలగారి ఈ కథానికల సంపుటిలో వున్నాయి.

చేయి తిరిగిన రచయితలు కథానికకు ముగింపును కూడా రకరకాలుగా చేస్తారు.-కథానిక ముగింపు కూడా ఒక ప్రత్యేక కళ. కథానికా ఉద్దేశాన్ని స్పష్టంగా చెప్పేవారు, పాఠక లోకానికి వదిలే వారు, అస్పష్టంగా ముగించేవారు ఉన్నారు. కథానిక ఉద్దేశ్యాన్ని స్పష్టంగా చెప్పడం ఈమె కథల్లో ఎక్కువగా కనబడుతుంది.

శ్రీమతి వేదుల శకుంతలగారు చేయి తిరిగిన రచయిత్రి. ఇరువది నవలకు పైగా రాసి అనేక కథానికలను రాసి ఎన్నో బహుమతులు సంపాదించారు. 1960 నుండి కలంపట్టి నేటివరకు అవిరామంగా రచనలు చేస్తున్న రచయిత్రి ఈమె. ఈమె తెలుగు పాఠక లోకానికి సుపరిచితురాలు. ఆమె 'అర్తి' 'ఆఫ్టరాల్ ఆడది' నవలలు నన్ను ఎంతగానో ఆకర్షించాయి. కన్నడ భాషలోకి ఈవిడ నవలలు, కథలు అనువదింపబడ్డాయి కూడా. ఈమె గొప్ప రచయిత్రి అనడానికి బండెడు నవలలు దేనికి? గంగి గోవుపాలు గరిటెడు చాలు అన్నట్లుగా ఒక్క 'అర్తి' నవల చాలు. ఇన్నాల్టికి ఈవిడ కథానికలు ఒక సంపుటిగా వస్తున్నందుకు సంతోషంగా వుంది.

శ్రీమతి వేదుల శకుంతలగారు ఒక ఆదర్శ గృహిణి. అందుకే ఆమె కథలన్నీ కుటుంబ గాథా చిత్రాలే. కుటుంబానికి సంబంధించిన

కథలు ఎన్ని ఉంటాయంటే ఈవిడ కథలు చదివితే తెలుస్తుంది. పాఠకలోకానికి చదివించే భాష, ఆకట్టుకునే కథా చిత్రణ, ఈ రచయిత్రిలో వున్నాయి. ఆర్భాటమైన శైలిగాని, అనవసరమైన వర్ణనగాని, అసందర్భమైన కథనం కాని ఈమె కథల్లో కనబడవు

ఈ సంపుటికి 'మనసెప్పుడూ గుప్పెడే' అని పేరు పెట్టారు. 1982 లో వనిత మాస పత్రికలో బహుమతి పొందిన కథ యిది. ప్రతివారు స్త్రీ అభ్యుదయాన్ని కోరుకునే ఈ రోజుల్లో ఈ సంపుటికి ఈ పేరేమిటని ఆశ్చర్యపోవచ్చును కాని అభ్యుదయ మార్గాలను చేపట్టాలనుకున్న స్త్రీ హృదయం యింకా మారలేదు అని చెప్పడమే ఇందలి ప్రత్యేకత. మహిళా సంఘానికి ప్రెసిడెంటు అయిన దమయంతి స్త్రీ అభ్యుదయంకోసం కృషిచేస్తూ ఉపన్యాసాలు ఇస్తూ ఉంటుంది. హేమ అనే యువతి భర్తపోయిన నాడు విలవిల్లాడిన దమయంతి హేమ భర్తపోయిన దుఃఖం మరచి ఆమె భర్త ఆఫీసులో ఉద్యోగంలో చేరి కాస్త ఉత్సాహంగా తిరుగుతున్న సమయంలో ఆమె హేమను చూసి ఈర్ష్యపడడం కథలోని ప్రధానాంశం. ఇందులో దమయంతి ఆశయాలు ప్రమాదకరమైనవి అని చూపడానికి ఆమె కూతురు కిచ్చిన స్వేచ్ఛ కూడా దుర్వినియోగం చేయడం కనబడుతుంది. ఇందులో దమయంతి ఆశయం వేరుగా ఆచరణ వేరుగా చూపించి 'మనసెప్పుడూ గుప్పెడే' అని నిరూపింపబడడం 'గమనార్హం' ఇందలి చమత్కారమైన శైలి కూడా పాఠకుల్ని ఆకట్టుకుంది. దమయంతిని గురించి చెబుతూ 'ఉద్రేకంతో ఊగిపోతూ ఆమె చెప్పే మాటలు ఉక్రోషంలో స్త్రీ జాతిని వెనకేసుకొస్తూ మగ జాతి మీద విసిరే విసుర్లూ-శాంతంగా సానునయంగా వింటాడు."

''వరద వెల్లువని చూసినట్లు చూస్తాడు' ఆమె భర్త. ఇందులో దమయంతి స్వభావం ఎటువంటిదో స్పష్టంగా తెలిసిపోవడమే కాకుండా అతని ఓర్పు కూడా నిరూపింపబడింది. అలాగే అంతంలో ''ఈడు వచ్చిన ఆడపిల్లని కట్టుబాట్లు లేకుండా స్వేచ్ఛ పేరిట హద్దులు

చెరిపేస్తే ఎలాంటి అనర్థం వాటిల్లుతుందో అదే జరిగింది. ఇప్పుడు నువ్వు పాపని కొట్టినా తిట్టినా ప్రయోజనం లేదు. చేతులు కాలాక ఆకులు, పట్టుకున్నట్టే'' అంటూ భర్త దమయంతి తప్పులు ఆమెకు తెలియ చెప్పడమే కాకుండా బాధ పడుతున్న కూతుర్ని ఓదారుస్తాడు.

''పాపా ఏడ్వకమ్మా! తప్పు నీదికాదు. నాది. మీ అమ్మని మొదట్లో కంట్రోల్ చేయని నా సహనం ఈనాడు నాచేత తప్పుదారి తొక్కడానికీ ఓ దారిన బ్రతుకుతున్న హేమ జీవితం ముళ్ళ ముళ్ళలో పడడానికి పనికి వచ్చింది" అంటాడు. దమయంతి అభ్యుదయమంటూ చేసే ఆర్భాటంలోని స్త్రీ నీడను వెలికి తీయడం కనబడుతుంది.

ఇక్కడ భార్యని ఇంకా ఈ కాలంలో కూడా భర్త కంట్రోల్ చెయ్యడమేమిటి? స్త్రీ అభ్యుదయానికి గొడ్డలిపెట్టు కదా అని అని పించక మానదు. కాని స్త్రీ అయినా పురుషుడైన ఎవరైన తప్పుదారి పట్టినప్పుడు వారిని సన్మార్గంలో పెట్టవలసిన బాధ్యత మరొకరిమీద వుంది. కనక భర్త చేత ఆ మాటలు అనిపించింది రచయిత్రి అని మనం భావించాలి. 'అసమర్థుడు' కథలో రచయిత్రి భార్యచేత భర్తకు చెప్పిస్తుంది. అలాగే కథలో ప్రధాన పాత్ర దమయంతి. సాధారణంగా ప్రధాన పాత్రను ఆదర్శంగా తీర్చిదిద్ది ఆమెకు విజయం చేకూర్చడం జరుగుతుంది. లేదా ఆమె మీద పాఠకలోకానికి సాను భూతి కలిగేటట్టు కథను నడిపించడం జరుగుతుంది. కాని ఇందులో దమయంతిలోని లోపాలు ఎత్తి చూపించడమే కాకుండా వాటివల్ల గలిగిన నష్టాలు చూపించడం జరిగింది. ఇది నేటి సమాజంలో సహజంగా కనబడుతున్న విషయం. దమయంతి పాత్ర అందు కుదాహరణ. రెండవ కథ 'అసమర్థుడు'.

ఇందులో భాస్కర తన భార్య కమల పెళ్ళి అన్నివిధాల తన కంటె గొప్పవాడైన బావతో జరగాలి తనతో జరగడాన్ని పరి పరి విధాల ఆలోచిస్తాడు- పెళ్ళి ఎప్పుడో జరిగి ఇద్దరు పిల్లలు పుట్టిన సుఖంగా కాపురం చేస్తున్న సమయంలో ఆ బావ కనులను చూడ్డానికి

వచ్చినపుడు భాస్కర్ తన స్థితిని తానే కించపరచుకొని పడిన బాధ ఈ కథలో చిత్రించబడింది. ఇది కూడా ఒక కుటుంబ గాథాచిత్రమే. ఇందులో పురుషునిలోని దీనత్వాన్ని వెల్లడిచేసి భార్య విశాల హృదయాన్ని చిత్రించడం జరిగింది. సదుపాయాలవల్ల కాని, ధనంవల్ల కాని మనిషికి కేవలం సుఖంరాదని, గుట్టుగా సంసారం చేసుకునే వాళ్ళు కూడా ఎంతో సుఖంగా జీవించగలరని చెప్పడమే యిందులోని ప్రధానాంశం. ఇందులో కమల పాత్రను తీర్చిదిద్దిన తీరు ఆలోచింప చేసేదిగా వుంది.

మూడవ కథ వరలక్ష్మి.

ఒక పెళ్ళి కాని మధ్యతరగతి అందమైన అమ్మాయిని చూసినప్పుడు ముగ్గురిలో కలిగిన స్వార్థ భావాలను చిత్రించిన అందమైన కథ యిది. చాలా తక్కువ సమయంలో అద్భుతమైన ముగింపుతో కూడిన చక్కని కథ యిది. ఇందలి వర్ణనలు, పాత్ర చిత్రణలు, ఎంతో సహజంగా రమణీయంగా ఉన్నాయి. కథలన్నిటిలో ఉత్తమ కథ అని చెప్పవచ్చు. అలాగే మరో కథ సునీత.

ఒంటరిగా ఉండి ఉద్యోగం చేస్తున్న ఆడవాళ్ళ ఆఫీసులోని పురుషులు, ఇంటిదగ్గర ఆడవారితో సమానంగా, నీచంగా ఆలోచించి సునీతను ఉద్యోగం వదలిపెట్టి వెళ్ళిపోయేటట్టు చేసిన కథ యిది. ఇది కూడా చాలా చక్కటి కథ.

మనసెప్పుడూ గుప్పెడు కథలో దమయంతికి భయపడి జీవితం మీద విరక్తి పుట్టి ఉద్యోగం రిజైన్ చేసిన హైమ లాగే ఇందులో కూడా సునీత చుట్టుపక్కల వారివల్ల కలిగిన అవమానం పడలేక ఉద్యోగం వదిలి సంసార సుఖానికి పనికిరాని భర్తతో కాపురం చెయ్యడానికి వెళ్ళిపోతుంది.

ఈ మాత్రందానికి ఉద్యోగాలు వదలి వెళ్ళిపోవాలా, అనే ప్రశ్న కలగవచ్చు. కాని సమాజంలో ముందుకు వస్తున్న అటువారిని బాధించడానికి ఇటువంటి వారింకా వున్నారు ఇది యదార్థము అని నిరూపించే కథానిక యిది. ఈవిధంగా స్త్రీలు ఎన్నో బాధలు పడుతున్నారని ఒక సత్యాన్ని మన కళ్ళముందు నిలిపిన కథలు ఇవి.

ఇందులో ఇంకా 'అందమైన సాయంత్రాలు, కాకులు, మంచు కరిగిన వేళ, మమత నవ్వింది' గ్రీన్ టామ్ నవ్వింది, మమకారం, దేవుడు కనిపించడు, ముత్యాపు చిప్పలు, రంగులు-రంగులు, తడి ఆరని కళ్ళు, తరం మారింది, నూటికో తల్లి, మొదలగు ఉత్తమ కథలు వున్నాయి. ప్రతి కథను గూర్చి నేను వివరించవలసిన అవసరంలేదు. పాఠకలోకానికే సుపరిచితం.

ఈ కథల్లో వైవిధ్యముంది. పాఠకలోకం స్వాగతం చేసుకునే భాష వుంది. చదివించే కథా కథనముంది. అందించే సందేశముంది. స్పష్టమైన అభిప్రాయింతో రచనలు చేస్తున్న రచయిత్రి ఈమె.

ప్రస్తుతం కృష్ణాపత్రికలో పనిచేస్తున్న ఈమె కలం నుండి త్వరలో వెలువడుతున్న 'స్పందన' చదివి స్పందించని వారుండరు. రచయిత్రి భావాశక్తికి, ఆధ్యాత్మిక సంపదకు, లోకానుభవానికి అద్దంపట్టిన రచనలు, 'స్పందన'లో కనిపిస్తాయి.

ఈ సంకలనంలో కథలు అన్నీ మధ్యతరగతి కుటుంబ కథా చిత్రాలే. ఈ కుటుంబాలలో ఇన్నిరకాల కథలు ఉంటాయా అంటే రచయిత్రి కథానికలు చదివితేనే తెలుస్తుంది. రచయిత్రి తన అనుభవంలో కాని సమాజాన్ని చిత్రించకుండా తన పరిధిలోని వాటినే చిత్రించడం రచయిత్రిలోని నిజాయితీని నిరూపిస్తున్నాయి. ఈ కథలు అన్నీ ఏనాడో జరిగిపోయిన సమాజంలోనివి కావు. ఊహాకందని రేపటి సమాజంలోనివి కావు. ప్రస్తుతం మన కళ్ళముందున్న సంఘటనలు. ఈ కథల్లో యిదే ప్రత్యేకత.

రచయిత్రి నాకు సుపరిచితురాలే కాదు. నాకు మంచి మిత్రురాలు. నాకంటే రచనల్లో సీనియరేకాదు. ప్రసిద్ధ రచయిత్రి కూడా. కాని మా మధ్య స్నేహానికి ఆ సీనియారిటీ అడ్డు రాలేదు. అందుకే ఈనాడు ఈ నాలుగు మాటలు ఈమె కథలమీద రాయగలిగాను.

పాఠకలోకం ఈ కథానికలు చదివి ఆలోచిస్తారని, ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

రచయిత్రి మరిన్ని మంచి కథలు రాసి పాఠకలోకానికి అందించాలని కోరుకుంటున్నాను.

సం॥ వాసా ప్రభావతి

# ఇది నా మాటగా

కథ చెప్పటంలోనూ, వ్రాయటంలోనూ, తేడా వుంది. చెప్పి ఒప్పించటం కన్నా, వ్రాసి ఒప్పించటం కష్టం! భాష, భావం, శైలి...సన్నివేశం, ఇతివృత్తం ఇవన్నీ-వ్రాయటంలో స్పష్టమై-పాఠకుల్ని ఆకట్టుకోగల్గితేనే-కథ రక్తి కట్టుంది। కథ వ్రాయాలనే తపనకన్నా-ఎన్నుకున్న ఇతివృత్తం మిన్నగావుంటే--ఆ రచయిత (రచయిత్రి) ప్రజలమధ్య నిలవగల్గుతుందని-నా నమ్మకం!

ఆ నమ్మకం వమ్ముపోలేదని అనుకుంటూ ఉంటాం--ఎన్నడో వ్రాసిన కథలు ఇవి! వార, మాస పత్రికలలో సందర్భాన్నిబట్టి-వ్రాసినవి। కొన్ని బహుమతులు అందుకున్నా-అవన్నీ ఒకచోట చేర్చాలనే ఉద్దేశ్యం-నాకు చాలా కాలందాకా కలగలేదు!-

నాల్గు సంవత్సరాలక్రితం-మా వారు-ఈ కథలన్నీ పుస్తకం రూపంలోకి వెలువడాలనే ప్రయత్నం చేస్తూ విధి పిలుపుకి, నన్ను ఒదిలివెళ్తూ-ఈ ప్రయత్నం నువ్వు పూర్తి చేయి అన్నట్టుగా అసంపూర్తిగా వదిలేసేరు! అనివార్య కారణాలవల్ల నాల్గు సంవత్సరాల కాలయాపన తరువాత ఈనాటికి ఈ కథలు ఒకచోట చేరి పుస్తక రూపానికి వచ్చాయి!

ప్రముఖ రచయిత-సౌమ్యుడు - సహృదయుడు, సోదరసమానుడు-శ్రీ యండమూరి వీరేంద్రనాథ్-అడగగానే-తన అమూల్య అభిప్రాయాలని 'కథా శాకుంతలంగా' మలచి అందించారు-వారికి నా కృతజ్ఞతలు.

ప్రఖ్యాత కవయిత్రి-కథా-నవల, వ్యాసాల రచయిత్రి అయిన డాక్టర్ వాసా ప్రభావతి-వనితా మహా విద్యాలయ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా వున్న నా మిత్రురాలు! ఆమె బహుముఖ ప్రజ్ఞావంతురాలే కాక-బహు వ్యాపకురాలు! క్షణం తీరికలేని పరిస్థితిలో కూడా-నా కథలకి పీఠిక వ్రాస్తారా అని నేను కోరగానే-'తప్పకుండా' అని సమ్మతించి వెంటనే తన 'మందార మాలని' అందించిన స్నేహశీలికి సదా ధన్యవాదాలు।

సాహిత్య విలువలు పరిరక్షించే నిమిత్తం ఉత్తమ రచనలకి ప్రోత్సాహాన్నిచ్చి-ఆర్థిక సహాయం అందిస్తున్న తెలుగు విశ్వవిద్యాలయంవారు-ఈ పుస్తక ముద్రణకి రూ. 2000/- ఆర్థిక సహాయం అందించినందుకు హృదయపూర్వకమైన కృతజ్ఞతలు అందిస్తున్నాను.

యువకుడు-కళా రాధకుడు అయిన మిత్రుడు -పి. హెచ్. రావు ఈ కథ సంపుటికి తగినవిధంగా చిత్రం వేసి ఇచ్చారు. ఉజ్వల భవిష్యత్తు కలగాలని మనసారా ఆశీర్వదిస్తూ-ఈ కథా సంపుటి వెలుగు చూస్తున్న శుభ సమయంలో-సహాయ సహకారాలు అందించిన ప్రతి వారికి మరొక్క మారు నా కృతజ్ఞతలు తెలియచేస్తూ—పాఠకులకి అందిస్తున్నాను—

—రచయిత్రి

# అంకితం



మీరు లేక నేను లేను_
నిర్జీవమై మిగిలేను
మీ స్మృతులే ఇకపైన_
నా ఊపిరి అయి నిలిపేను_

అడుగడుగునా, అణువణువునా
నాలో కల్గించిన మీ ప్రేరణే,
నా జీవితంలోని సాహిత్య శోధన।
చివరి క్షణం వరకు ఇదే నా తపన

మరుజన్మ నే కోరను
తప్పదని దైవం అంటే?
మీ తోడే కావాలని నా ప్రార్థన!
అందుకే గుప్పెళ్లతో మనస్సు అందిస్తున్నా!



మీ

శకుంతల

# విషయ సూచిక

పేజీ నం.

# మనసెప్పుడూ గుప్పెడే!

### 1982 సం॥ వనిత మాసపత్రికలో మొదటి బహుమతి గెలుచుకున్న కథ ?

దమయంతి చాలా హడావిడిగా తయారవుతోంది !
బ్యాగ్‌లో కాయితాలన్నీ సర్దుకున్నది. పర్సులో డబ్బు చూసుకుంది.

వాచీలో టైము చూసి, వాల్‌క్లాక్‌లో ఓ నిముషం ముందు ఉన్నట్టు గమనించి వెంటనే వాచీలో సరిచేసుకుంది మరొక్కమారు డ్రస్సింగ్ టేబుల్ దగ్గరకి నడిచి, కట్టుకున్న చీర, చేసుకున్న మేకప్ సరియచూసుకుని తృప్తిగా నిట్టూర్చింది.

డ్రాయింగ్ రూమ్‌లో శంకర్రావు పేపర్ చూస్తున్నాడు అతను ఆఫీసు నుంచి వచ్చి అరగంటైంది. టిఫిన్, కాఫీ ముగించి తీరికగా పేపర్ చదువుకుంటున్నాడు. బాబూ, పాప బయట ఆటలాడుకుంటున్నారు.

''చూడండీ! నేను వచ్చేసరికి బాగా ఆలస్యమైపోతుంది. ఒకవేళ పిల్లలు ఆగలేకపోతే...'' అర్థోక్తిలో ఆగిపోయింది, దమయంతి. పేపర్‌లో నుంచే తల ఊపుతూ ''అలాగేలే! వాళ్ళకి భోజనాలు పెట్టేస్తాను,'' అన్నాడు.

"అప్పడాలు వేయిస్తే చల్లారి పోతాయని..." వాక్యం పూర్తి చేయలేకపోయింది.

"సరే!సరే! నేను తర్వాత వేయిస్తాలే!" పేపర్‌లో నుంచే చెప్పాడు. "మీరు కూడా తినేయిండి నా కోసం ఆగవద్దు!" రవ్వంత అభిమానం తొంగిచూసింది.

మెల్లగా పేపర్ పక్కకి జరిపి చూసేడు.

వనితా మండలివాళ్ళు ఏర్పాటు చేసిన సమావేశంలో ఉపన్యసించడానికి వెళుతోంది దమయంతి! అభ్యుదయ పథంలోకి పయనిస్తూ, ఆదర్శవంతులై అనేక కార్యక్రమాలు చేపట్టి విజయవంతంగా నడిపిస్తున్న సమాజం, అది!! దమయంతి దానికి ప్రెసిడెంట్ !

వరద బాధితులకి, చందాలు వసూలు చేసి పంపడం పోసుకెళ్ళేసి, బియ్యం సేకరించి, స్వయంగా అందచేసేరు! అనాథ బాలికలకి ఉచితంగా విద్య నేర్పించే పథకం చేపట్టేరు. వరకట్నదురాచారాన్ని రూపుమాపాలని ఎన్నోసార్లు నినాదాలు చేసేరు. కులం, మతం అనే అడ్డుగోడలను పడగొట్టి తీరాలని ఆదర్శ కళ్యాణమండపం స్థాపించి, ఒకరిద్దరికి వివాహాలు కూడా జరిపించేరు; ఆడవాళ్ళపై జరుగుతున్న అన్యాయాలకి, అక్రమాలకీ నిరసనగా (ప్రభుత్వ కార్యాలయాల ముందు) నిరవధిక నిరాహారదీక్ష సాగించి సాటి ఆడజాతి మీద తమ సానుభూతి ప్రకటించుకున్నారు. (పేపర్లో గానీ న్యూస్‌లో గానీ ఏ వార్తవున్నా-అందులో స్త్రీజాతిపట్ల అగౌరవంగాని అమానుషంగాని కనబడినా, వినబడినా-వెంటనే ఆ సమాజం విరుచుకు పడుతుంది! ఆ దురన్యాయాన్ని ఖండించి తీరాలని సమావేశాలు, ఊరేగింపులు జరిపిస్తుంది!

అటువంటి సమాజానికి ఏకగ్రీవంగా ఎన్నికైన ప్రెసిడెంట్ దమయంతి ఎన్ని ఉపన్యాసాలు ఇచ్చిందో? స్త్రీకి సమానహక్కులు ఒకరిచ్చేదేమిటి? తనకి జన్మతః వ్యక్తిగత స్వాతంత్ర్యం వుండి తీరుతుంది! తీరాలి! మగపిల్లవాడైనా, ఆడపిల్లైనా, హక్కులు సమానమే!

న్యాయం, నీతి సమమే! పురుషుడు స్వార్థపరుడై స్త్రీని అణగదొక్కుతున్నాడు!! ఈ అన్యాయం స్త్రీ సహించరాదు! ఎదుర్కోవాలి!! స్వేచ్ఛా వాయువుల్ని పీల్చాలి! ఆడ, మగ తేడాలు బేధభావాలు, రూపుమాపాలి! అంతా సమానమే!

ఈ రకమైన ఉపన్యాసధోరణి బయటేకాదు... ఇంట్లో కూడా తరచూ సాగిపోతూనే వుంటుంది.

ఆ ఇంటి గోడలు, ద్వారబంధాలకీ, అంగుళం, అంగుళం మేరకు ఈ మాటలు అతుక్కుపోయేయి! పెరిగి పెద్దవుతున్న పిల్లల్లో ముఖ్యంగా పాపలో ఈ భావాలు జీర్ణించుకొని పోతున్నాయి!!

సెవెన్త్‌క్లాసు చదువుతున్న పాప - బాబుతో షెటిల్‌కాక్ ఆడుతుంది. సైకిల్ తొక్కుతుంది! ఎక్కువగా సల్వార్, కమీజు, లేదా స్కర్ట్, ఒక్కొక్కప్పుడు బాబు లాగే ప్యాంటు, బుష్‌షర్టు వేసుకుంటుంది! అవన్నీ దమయంతే కుట్టిస్తుంది. స్వేచ్ఛగా, హాయిగా అన్నగారితోపాటు పెరుగుతున్న పాపని తన భావాలకి ప్రతిబింబంగా, ముందుతరాలకి ఆదర్శవనితగా ఊహించుకుంటూ ఎంతో గర్వంగా ఫీలవుతూ వుంటుంది దమయంతి!!

ఆ దమయంతి ఈ రోజు మండలిలో సుదీర్ఘమైన ఉపన్యాసం ఇవ్వడానికి బయల్దేరింది! దానికి సంబంధించిన కాయితాల బొత్తుని భద్రంగా బ్యాగ్‌లో దాచుకుంది. ప్రతి నిముషానికీ ఎంతో విలువనిస్తుంది. పంక్చువాలిటీ పాటిస్తుంది. అయితే తన కోసం భర్త ఇంటి దగ్గర ఎదురుచూస్తూ కూర్చోడం కొంత చికాకు కల్గించినా... అంతరాంతరాలలో ఒకింత తృప్తి, గర్వం, కల్గుతూనే వుంటాయి. ఒక్కొక్కప్పుడు తన మండలికోసం బయటికి వెళ్ళి పగలంతా ఇంటికి రావడానికే వీలుకాకపోతే, ఆ రోజు ఆఫీసుకి సెలవైతే శంకర్రావు ఇంట్లోనే వుండి దమయంతి చేయాల్సిన పనులు తను చేసేస్తూ వుంటాడు. మీటింగ్‌లకి వెళ్ళి రాత్రి చాలా పొద్దుపోయినా, విసుక్కోడు! కసురుకోడు! నిర్లిప్తంగా ఊరుకుంటాడు.

దమయంతిపట్ల అతనికి అపారకమైన సానుభూతి!జాలి! పాపం కష్టపడిపోతోందనే బాధ! ఉద్రేకంతో ఊగిపోతూ ఆమె చెప్పే మాటలూ, ఉక్రోషంతో స్త్రీ జాతిని వెనకేసుకొస్తూ, మగజాతి మీద విసిరే విసుర్లూ, శాంతంగా సానునయంగా వింటాడు.

వరద వెల్లువని చూసినట్టు చూస్తాడు!

దమయంతి మాటలకి పేపర్ చాటు తీసి చూసిన శంకర్రావు చిన్నగా నవ్వి "ఫర్వాలేదులే! నువ్వు పాపం అక్కడ అలసిపోయి వస్తావు! నేను ఇక్కడ రేడియో వింటూ కాలక్షేపం చేయడమే గదా! నాకేం కష్టం? నువ్వు వచ్చేదాకా అగుతాలే!" అన్నాడు.

దమయంతి మరింక మాట్లాడలేదు.

కానీ మనసులో మటుకు అనుకుంది!

'పాపం! అలసిపోయి వస్తావు' అనకుండా ప్రోత్సహిస్తున్నట్టో, ఉత్సాహపరుస్తూనో... చెప్పరాదా? అదేదో డ్యూటీకి వెళ్తున్నట్టు భావించకపోతే-సహజప్రేరణతో హృదయాంతరాళంలో నుండి ఉబికివస్తున్న ఆవేశంతో, చేస్తున్నవి ఈ కార్యక్రమాలని, ఎందుకనుకోరూ? ఇదే! ఇదే! మగవాడికి ఆడదాని ఎడల వుండే చులకన భావం! అందుకే ఆడజాతి ఇలా తిరగబడవలసి వస్తోంది!

టైము చూసుకుంది. ఇంకా మండలి నుంచి కారు రాలేదు. ఈ లోపులో మళ్ళీ ఒకసారి తను ఇవ్వబోతున్న ఉపన్యాస సారాంశమైన కాగితాల కట్ట బయటికి లాగి చూసుకుంటూ కూర్చుంది.

శంకర్రావు పేపర్లో మునిగిపోయేడు!

సరిగ్గా ఐదు నిముషాలు గడిచేయి.

బయట నుంచి పాపా, బాబు రివ్వున ఇంట్లోకి పరిగెత్తుకొచ్చేరు "మమ్మీ మమ్మీ! అవతల వీధిలో మా ఫ్రెండ్ వాళ్ళింట్లో అప్పైకున్నారే?... ఆ అంకుల్ చచ్చిపోయాట్ట!" బాబు బాంబ్ పేల్చినట్టు అన్నాడు. "అబ్బ! మమ్మీ! ఆ అంటీ ఎలా ఏడుస్తుందో తెలుసా?

క్రిందపడి పొర్లి పొర్లి ఏడుస్తోంది! చూసేసరికి నాకూ ఏడుపొచ్చింది, పాప గుండెల మీద చేయి అన్చుకుని భరించలేనట్టు తల విదిలిస్తూ చెప్పేసరికి—దమయంతి, శంకర్రావు ఇద్దరూ ఒక్కసారే లేచి నిలబడిపోయేరు!

ఆ అంకుల్‌తోగానీ ఆంటీతోగాని ఈ దంపతులకు పరిచయం లేదు! బాబు ఫ్రెండ్ వాళ్ళింటో కొత్తగా అద్దెకు వచ్చారనీ, ఆమె చాలా బావుంటుందనీ, వాళ్ళిద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉంటారనీ ఆ నోటా ఆ నోటా విన్నారు తప్ప ఎప్పుడు చూడలేదు.

ఇప్పుడు యిలా హఠాత్తుగా ఈ దుర్వార్త విన్నారు.

"రాత్రి కొద్దిగా జ్వరం వచ్చిందట మమ్మీ! అంతే ఇప్పుడు చనిపోయేడు-" బాబు ఏదో చెప్తున్నాడు.

"మమ్మీ! మమ్మీ! భర్త పోతే భార్య అంతలా ఏడుస్తారా? మరీ అంతగా .." పాప మాటల్ని మధ్యలోనే తుంచేస్తూ, 'ఓహ్! పాపా ఊరుకో! అసలు మిమ్మల్ని అక్కడికి ఎవరు వెళ్ళమన్నారూ? వెళ్ళండి డాబా మీదకి వెళ్ళండి!" గదమాయించి వాళ్ళని అక్కడి నుంచి పంపించేసింది దమయంతి.

భార్యాభర్తలిద్దరు ముఖాలు చూసుకుని నిట్టూర్చుకున్నారు.

ఇద్దరూ ముందు వరండాలోకి వచ్చి నిలబడ్డారు.

తమకి ఏ విధమైన సంబంధంగానీ, ఫ్రెండ్‌షిప్‌గానీ లేనిచోటికి ఎలా వెళ్ళగలరు? అలా అని తేలిగ్గా తీసుకునే విషయం కాదు! చాలా సడన్ షాక్ తగిలి మనసంతా శూన్యంగా అనిపించింది దమయంతికి. రెండు మూడు నిముషాలు అలా నిశ్శబ్దంగా నిలబడ్డాక, ఆమెలో అక్కడి దృశ్యం ఊహలో మెదిలింది!! ఆమె కళ్ళు ఎర్రబడ్డాయి.

—"ఒక అందమైన చిన్న వయస్కురాలు...భర్త చచ్చిపోయి నిస్సహాయంగా క్రిందపడి దొర్లి ఏడుస్తుంటే...ఎంత హృదయవిదారకంగా వుంటుందీ? అదే భార్యపోతే భర్త నేలమీద పడి ఏడుస్తాడా?

హూ! ఎందుకేడుస్తాడు. అర్నెల్లు తిరగకుండా మళ్ళీ పెళ్ళికి సిద్ధపడతాడు! మరి ఆ అమ్మాయి గతి ఏమిటి? ఇక జీవితాంతం ఆ భర్తని తల్చుకుని, తల్చుకుని, కుళ్ళి కుళ్ళి ఏడుస్తుందా? ఆ అమ్మాయి కోరికలు, సరదాలు, అన్నీ ఇకనుంచీ భూస్థాపితమేనా? దాంపత్య సుఖం ఏం తీరిందీ? పాతికేళ్ళకే జీవితం ముగిసిపోయిందా? ఈ దుష్ట సమాజం ఆ పిల్లకి ఏమని ధైర్యం చెప్తుంది? ఉత్తి కన్నీళ్ళు! పనికిమాలిన ఓదార్పులు! ఎందుకవన్నీ? ఏం చేసుకుంటుంది! చెప్పండి!'' ఉద్రేకంతో-ఊపుగా అసహాసంగా ఊగిపోతూ భర్తని ప్రశ్నిస్తుంటే శంకర్రావు చప్పున దమయంతి జబ్బ పట్టుకుని లోపలికి తీసుకెళ్తూ, 'ప్లీజ్ దమయంతీ! ఆవేశపడిపోకు? నువ్వు ఇప్పుడు ప్రోగ్రామ్‌కి వెళ్ళాలి!మూడ్ చెడగొట్టుకోకు! మన చేతుల్లో ఏముంది? కనీసం మనకి తెల్సిన వాళ్ళైనా అయితే-మనకి తోచిన సహాయమైనా ఓదార్పో అందించేవాళ్ళం! కానీ ఇప్పుడు మనమేమి చేయగలం. ప్లీజ్ శాంతించు: లైఫ్ అంటే అంతే! '

'ఛట్! ఏమిటండీ మీరు చెప్పే వేదాంతం? పైగా అవతల ప్రోగ్రామ్ వుందంటరా? హూ, ఇవాళ మా సమావేశంలో ఉపన్యసించబోయేది. ఈ టాపిక్కే, అనాథ స్త్రీని ఎలా ఆదుకోవాలి, అన్న విషయమేనండీ, కళ్ళ ముందు నిదర్శనంలా ఈ ఉదంతం జరిగింది. ఇంక నేను ఆగలేనండి, వెళ్ళి ఆ అమ్మాయిని ఓదార్చి తీరాలి, భర్త పోయినంత మాత్రంలో బ్రతుకులేదనుకోకని నాక్కి చెప్పాలి," అంటూ దమయంతి భర్త చేతి నుంచి విడిపించుకుని విసురుగా చెప్పు లేసుకుని బయల్దేరబోయింది.

సరిగ్గా అప్పుడే ఇంటిముందు మండలివారి కారు వచ్చి ఆగింది! 'మేడమ్! త్వరగా బయల్దేరండి, ఇప్పటికే చాలా లేటైపోతుంది. వెధవ కారు మధ్యలో ట్రబుల్ ఇచ్చింది' అంటూ సుడిగాలిలా అందులో నుంచి వచ్చిన సెక్రట్రీ, తదితరులు తొందరపెట్టి దమయంతికి మరో మాట మాట్లాడానికి అవకాశం ఇవ్వకుండా...

బ్యాగ్ వాళ్ళే అందుకుని అవిణ్ణి తీసుకెళ్ళి కారులో కూలేసేరు. కారు కదిలి వెళ్ళిపోయింది.

'హమ్మయ్య' అనుకున్నాడు శంకర్రావు.

కుర్చీలో కూలబడి ఆలోచనలో మునిగిపోయేడు,

'నిజమే పాపం ఆ భార్య ఎంతో చిన్నది జీవితమంతా ముందే వుంది. బ్రతుకిలా అధ్వాన్నమైపోతే ఎలా నిలదొక్కుకుని జీవించ గలదు. భర్తృహీన ఐన స్త్రీ నిజంగా శాపగ్రస్థురాలే దమయంతి వేదన సరిఐనదే, కానీ కేవలం గొంతు చించుకుని ఆరాటం చూపిస్తే ఏం లాభం? ఇప్పుడు చూపవల్సింది శూరత్వం కాదు, కర్తవ్యం, అందుకు నిదానం అవసరం. ఆ అమ్మాయి బాధ ఆవేదన ఇప్పటిలో అరికట్టడం సాధ్యమా, గుండె భారం తీరేవరకూ కన్నీళ్ళు కారిపోవాలి మనసు తేలిక పడాలి, అప్పటివరకూ ఎవరూ ఏమీ చేయలేరు ఇంత చిన్న సత్యాన్ని విస్మరించి ఊరికే చిందులు తొక్కుతుంది వెర్రి దమయంతి' అని పేలవంగా నవ్వుకున్నాడు శంకర్రావు.

ఆ రాత్రి పిల్లలకి భోజనాలు పెట్టి-భార్య రాకకోసం ఓపిగ్గా కాచుకు కూర్చున్నాడు శంకర్రావు.

రాత్రి పదిన్నరకి చొప్పకట్టలా వేళ్ళాడిపోతూ కారుదిగి ఇంటి లోకి వచ్చింది దమయంతి.

వేదిక మీద ఆమె ఎంత వేగిపోయి వుంటుందో మానసికంగా ఎంత ఉద్రేకం పొందిందో గ్రహించుకోగలడు శంకర్రావు. అందుకే ఆమెను పల్కరించి డిస్టర్బ్ చేయకుండా మౌనంగా వూరుకున్నాడు.

తర్వాత చాలా రోజులవరకు దమయంతికి ఆ భర్తృహీనురాలి ధ్యాసే వుండేది. మాటల సందర్భంలో ఆ సంగతే ఎత్తేది.

కొన్నాళ్ళకి ఒక నెల తర్వాత-ఆ అమ్మాయిని పుట్టింటి వాళ్ళు తీసుకెళ్లి పోయారని తెల్సి క్రమంగా ఆ విషయం మరిచిపోయింది,



రెండు మూడు సంవత్సరాలు కాలమానంలో కరిగిపోయాయి.

ఆ రోజు శంకర్రావు ఆఫీసునుంచి టిఫిన్ కాఫీ కానిచ్చి తీరికగా కూర్చున్నాడు.

ఈ మధ్య కాలంలో దమయంతి అనేక బృహత్తర కార్యక్రమాలు చేపట్టింది. ఆ పనుల ఒత్తిడిలో మునిగిపోయుంది. వయోజనులకి విద్య నేర్పిస్తున్నారు మండలివారు. మురికి వాడలకు వెళ్ళి ఆరోగ్య సూత్రాలు బోధిస్తున్నారు. హరిజనోద్ధరణ కోసం అనేక రూపకాల్ని రేడియోద్వారా ప్రచారం చేయిస్తున్నారు. ఇంకా ఎన్నెన్ని చేయగలరో...చేయాలో నిరంతరం ఆలోచిస్తూనే ఉంటుంది దమయంతి.

దమయంతీ! ఇవాళ మా సెక్షన్‌లోకి కొత్త టైపిస్టు వచ్చింది అన్నాడు శంకర్రావు.

చదువుతున్న పుస్తకంలో నుంచి తలఎత్తి చూసి "ఓ. ఇంత వరకు లేడీ టైపిస్టు లేదనుకుంటాను. మీ సెక్షన్‌లో?" అని అడిగింది

"ఊహూ! ఈవిడే ఫస్టులేడీ టైపిస్టు."

"పోనీలెండి. ఎప్పుడూ మగవాళ్ళకే దోచి పెట్టకుండా కాస్త ఆడవాళ్ళని కూడా గుర్తిస్తున్నారు మీ కంపెనీ అధినేతలు" నవ్వింది.

"అన్యాయం మా కంపెనీ వాళ్ళకేమి ఆడవాళ్ళంటే పక్షపాతం లేదోయ్ ఇంతవరకు ఎవరూ రాలేదంతే! అది సరే టైప్ మాత్రం భలేగా కొట్టుందోయ్ యమ స్పీడ్‌లే"

"ఊ! మరేమిటనుకున్నారు? పేద్ద మీ మగవాళ్ళే ప్రజ్ఞావంతులు అనుకోకండి. ఏ రంగంలో చూసినా మా జాతి మిమ్మల్ని మించి పోతూనే వుంది. అయినా పౌరుషం చావక మీరంతా కుప్పిగంతులు వేసి, దర్పాలు ఒలకబోస్తున్నారు. చూస్తుండండి మా ఆడవాళ్ళు ఎంత ప్రగతి సాధిస్తారో" సవాల్ చేసింది గర్వంగా దమయంతి.

"అయ్యబాబోయ్! నేరకపోయి చెప్పేను. నా మీదకు దండెత్తకు!"

భయంగా చేతులడ్డం పెట్టుకుంటున్న భర్తని చూసి సుతారంగా నవ్వింది.

అప్పుడే అక్కడికి వచ్చిన పాపకూడా అమ్మతో పాటు నవ్వు' జోడించి, ''డాడి! నేను అన్నయ్యతో బెట్ కట్టేను తెలుసా? నేను తన కాలేజీలోనే చదివి-డిగ్రీలో (క్లాసులో) కల్సుకుని-తనకన్నా ఫస్టుగా ప్యాసవుతానని పందెం కాసేను.'' అంది మూతి గమ్మత్తుగా తిప్పి.

''ఆః ఆ; కాస్తావు! నీకు మా కాలేజీలో అసలు సీటు వస్తే గదా?'' బాబు ఉడికించేడు.

''ఏం? ఎందుకురాదు? మీ బోడి కాలేజీ అంత గొప్పదా? యుద్ధానికి దిగింది పాప.

'బో ः' అన్నాక ఇంకెందుకట నువ్వుదాంట్లో చదవడంః'

'నీతో సమంగా వుండాలనే!'

'ఎప్పటికీ కాలేవుః'

'ఎందుకు కాలేనూ? అయితీరుతానుః, పట్టుదలగా అరచేతిలో కొట్టూ మరీ చెప్పింది.

'ఏడ్చేవ్?'

'నువ్వే ఏడుస్తున్నావ్ నా గొప్ప భరించలేకః'

'ఏమిటే నీ గొప్ప' బాబు కోపంగా హూంకరించేడు.

'అబ్బబ్బ! ఏమిట్రా మీ కయ్యాలు? పెద్దవాళ్లైనా మీకింకా చిన్నతనం పోలేదు. ప్రతి మాటకి ముందు పోట్లాటేః' శంకర్రావు విసుక్కున్నాడు. 'చూడండి డాడీ! అదే అలా ఒంటి కాలుమీదలేస్తుంది! ఆడపిల్లనని ఓ నెమ్మదీ పాడూలేదు?'

బాబు మాట పూర్తి కాకముందే దమయంతి కల్పించుకుని బాబూః ఏమిటిరా నువ్వు చెప్పేదిః 'ఆడపిల్ల' అంటే అణిగి మణిగి

వుండాలా? ఈ పాత చింతకాయ భావం నీలో ప్రవేశించుకు పోయిం దన్నమాట? 'అది', 'ఇది' అని చెల్లాయిని అలాగే సంబోధించడం? ఆడవాళ్ళ పట్ల అంతతేలిక అభిప్రాయం పనికిరాదు. నేను ఇంత కాలంగా నూరిపోస్తున్నా నీకు వివేకం కలగలేదా? ఇప్పుడు పాప మాత్రం తప్పేమందీ? తను నీ కాలేజీలో చదువుతానంటే నీకెందు కంత ఉక్రోషం? పాపని ఎప్పుడూ ఎక్కువచేసి చూడకు! ఈ ఇంట్లో నువ్వూ, పాప సమానమే! నీలాగ పాప కూడా స్వేచ్ఛగా స్వతంత్రం గా తిరగాలి! బ్రతకాలి! 'ఆడపిల్ల' అంటూ హద్దు పెట్టకు! ఈ మాట ఇంకోసారి నేను వినడానికి వీలులేదు. తెల్సిందా?' అంటూ ప్రక్కకి తిరిగి భర్తవైపు చూసింది. శంకర్రావు పేపర్లో దూరిపోయాడు ఎప్పుడో!!

బాబు తల వొంచుకొని సన్నగా గొణుక్కుంటూ బయిటికి వెళ్ళిపోయేడు. మరి కొద్దిసేపటికే పాప కూనిరాగం పాడుతుంటూ సైకిల్ తీసుకుని హుషారుగా బయల్దేరింది!

'మీరు అసలు ఏదీ పట్టించుకోరు. అందుకే వాడి బుద్ధులు అలా సంకుచితంగా వున్నాయి!' దమయంతి వున్నట్టుండి భర్తకి చురక అంటించింది.

శంకర్రావు పేపర్లో నుంచే అన్నాడు.

'పాప మాత్రం ఏం తక్కువ తిందీ?'

'అదిగో! అదే వద్దనేది! ఎందుకు తక్కువ తినాలి? ఈ ఇంటిలో మనకి ఇద్దరు పిల్లలున్నారు: వాళ్ళు ఆడ, మగ అనే భేదం చూపించ కుండా, పెంచాలనే నా ధ్యేయం,' దమయంతి ముఖం క్రోధంగా, మారింది.

'సరే, సరే'

'ఎందుకు నోటి చివర మాటలు? మీ మనసులో ఈ తారతమ్యా లుండబట్టే బాబుని వెనకేసుకొస్తున్నారు.'

తక్కున పేపర్ తీసి చూసేడు

'దమయంతి, తేడాలు, బేధాలు కాదు. బాబుని ఒంటరిగా చేసి అందరం వాణ్ణి మందలించడం మంచిదికాదు. వాడి మనస్సు నొప్పించకుండా చూడాలన్నా సంగతి మర్చిపోతున్నావు,'

'లేదు, నేనేదీ మర్చిపోను,' ధీమాగా పలికింది.

'ఆల్ రైట్, మంచిదే, అంటూ పేపర్ అందుకున్నాడు మళ్ళీ

తర్కించుకోడం, ఘర్షణపడటం శంకర్రావు మనస్తత్వంకాదు సహనం ఓర్పు...సర్దుకు పోవడం- అతని నైజం,

దమయంతిని అణిచిపెట్టాలనీ తన వ్యక్తిత్వం చూపాలనీ శంకర్రావు ఎన్నడూ అనుకోలేదు, అందుకే ప్రతిసారి ఆమెకు తన ఆమోదం తెలిపి రాజీపడిపోతూ వుంటాడు.

కాని—దమయంతి, భర్తకున్న ఆ సహజ గుణాన్ని చాలా సామాన్యంగా, భావిస్తుంది, తను వేలెత్తి చూపిస్తే తప్పు-అతనిలోపం తెలుసుకోలేని అమాయకుడిలా తలపోస్తుంది,

శంకర్రావు 'సరే' నని ఒప్పుకోడం ఆమెకి గెలుపులా అనిపించింది. రోజులు గడిచిపోతున్నాయి.

పాప అన్నప్రకారం బాబు కాలేజీలోనే చేరింది.

బాబు కూడా ఏమంతగా ఫీలవలేదు. ఇంకా చాలామంది అమ్మాయిలు ఆ కాలేజీలో చదువుతున్నారు. నిజంగా పాప మంచి మార్కులు తెచ్చుకుంటోంది. మధ్య మధ్య శంకర్రావు ఆఫీసు సంగతులు చెప్తుండడం, వాటికీ—దమయంతి ఏవో చురకలు తగిలించడం—అతను నవ్వుకుని ఊరుకోడం...చాలా సహజంగా జరిగిపోతూ వున్నాయి.

ఒకరోజు—

'ఇదిగో దమయంతీ, నీకొక గుడ్ న్యూస్ చెప్పనా?' అన్నాడు.

శంకర్రావు ఆఫీసు నుంచి వస్తూనే—

'ఏమిటీ?'

'మా లేడీ టైపిస్టు ఎవరో తెలుసా? ఆ రోజు ఇక్కడ్నించి భర్త పోలేదూ, ఆవిడే:?'

ఆ'?!! ఎవరు చెప్పారు?' దమయంతి విభ్రమంగా అడిగింది.

'ఆవిడే,, ఇవాళ లంచ్ అవర్‌లో అంతా టీ తాగుతున్నాం, మాటల మధ్య తనకి జరిగిన అన్యాయం చెప్పుకుని...ఎన్నాళ్ళని పుట్టింటిలో కూర్చుని తినాలనీ, ఇంతకుముందు మెట్రిక్ ప్యాసై వుందిట, అందుకని టైపు షార్ట్‌హాండ్ పరీక్షలు ప్యాసై-ఈ ఉద్యోగానికి అప్లై చేసిందిట, వచ్చేసింది, నదే ఆవిడ వచ్చిచేరిపోయింది.

'ఇప్పుడు ఆవిడకి ఎంతో హాయిగా, తనకాళ్ళ మీద తను బ్రతుకుతున్నందుకు గర్వంగా ధైర్యంగా వుందిట. అదంతా వింటున్నప్పుడు నేను ఎంత ఆశ్చర్యపడ్డానో? తను ఇప్పుడు బాగా రికవర్ అయిపోయింది. అందుకే నేను చెప్పేను- ఆ రోజు మనం, ముఖ్యంగా నువ్వు చాలా ఫీలయ్యావనీ, ఈ వార్త వింటే నువ్వు చాలా ఆనందిస్తావని కూడా చెప్పేను.' తను నీకు చాలా కృతజ్ఞతలు చెప్పుకుంటూ మనింటికి ఓసారి వస్తానని కూడా చెప్పింది.

'ఆహా, అలాగా? ఓసారి తీసుకురండి,' అంది దమయంతి.

'తప్పకుండా,' అన్నాడు శంకర్రావు

అతనికి చాలా సంతోషంగా వుంది. ఆ రోజు భార్య ఎంతగా కదిలిపోయింది? కానీ ఇప్పుడు ఆ అమ్మాయి...అదే హేమ ఎంత హాయిగా ఉందో కళ్ళతో చూస్తే...దమయంతి మనస్సు ఊరట పొందుతుంది అనుకున్నాడు.

మర్నాడే తీసుకుని వచ్చాడు హేమని.

దమయంతి మర్యాదగా ఆహ్వానించింది.

'హేమ' నిజంగా చాలా బావుంది. సన్నగా. పచ్చగా, నవ్వు ముఖంతో వుంది. చేతులకి రెండు బంగారు గాజులు, వాచీ, మెళ్ళో సన్నని గొలుసు, చెవులకి చిన్న దుద్దులు...కనుబొమ్మల మధ్య కనీ కనిపించనంతగా నల్ల తిలకం బొట్టు-ఫుల్ వాయిల్ చీర, మేచింగ్ జాకెట్...అంతా సింపుల్ అండ్ స్వీట్‌గా కనిపించింది. తెలిసిన వాళ్ళకి తప్ప-లేకపోతే ఆమె 'విధవ' అని అసలే తెలియనట్టుంది.

పాప కూడా ఆ సమయంలో అక్కడే కూర్చుని వుంది.

నవ్వుతూ, చక్కగా కలుపుగోలుగా మాట్లాడుతున్న హేమని, ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ పాత స్మృతిని తవ్వి పలకరించడం భావ్యం కాదని, దమయంతి జాగ్రత్తగా మాట్లాడింది. హేమ కూడా భర్తని గురించి పెద్దగా చెప్పలేదు. తను ఆఫీసు వర్క్‌లో ఎలా నిలబడ గలిగిందో...కొలీగ్స్ ఎంత మంచివాళ్ళో, మగవాళ్ళ మధ్య పని చేస్తున్నట్టే లేదనీ...ఇలా ఆఫీసులో అంతా సభ్యతగా ఉంటారని తను ఊహించనే లేదనీ...చాలా చాలా చెప్పింది.

అవన్నీ ఆఫీసు విషయాలు.

కొలీగ్స్ సహృదయాలు.

అంతే తప్ప బాధలు, బెంగలు, విప్లవ భావాలు, పరాజయం, హేళన, అవమానాలు ఇలాంటి టాపిక్సే రాలేదు. టిఫెన్ కాఫీ లయ్యాయి. రెండు గంటల తర్వాత లేచి 'వస్తానండి' అని బయలు దేరింది

చెప్పులేసుకుని శంకర్రావు వెనకాలే వెళ్ళాడు.



''మమ్మీ, అబ్బ ఆరోజు హేమకీ ఈవిడకీ ఎంత తేడా ఉందో తెలుసా? అసలు నమ్మలేం. బావురే, నేలమీదపడి దొర్లి దొర్లి ఏడ్చింది. ఇప్పుడు అబ్బ! ఎంత సంతోషంగా ఉందో చూడూ? పర్వాలేదు భర్తపోతే హాయిగా బ్రతకగలరన్న మాట?''

పాప ఏదో అంటూనే వుంది...

దమయంతి 'ఊ' కొట్తోందిగానీ ఆమె మస్తిష్కంలో కొత్త రంగులు పూసుకుంటున్న ఊహాలు పేరుకుంటున్నాయి. అనాడు తను అనవసరంగా జాలి పడ్డాననిపిస్తుంది. తన సానుభూతి నిర్వీర్యమై పోయినట్టుంది. ఆఫీసులో కూడా హేమ యిలా నవ్వుతూ, తుళ్ళుతూ ఉంటుందన్నమాట? అంతా మంచివాళ్లేట. మగవాళ్ళ మీద ఎంతటి సదభిప్రాయం?

పాప-తల్లి పరధ్యాన గమనించి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి దమయంతి చాలా అసహనంగా, అసౌకర్యంగా, నిద్రపట్టక మంచం మీద దొర్లుతూనే ఉంది. శంకర్రావు గమనించినా 'మళ్ళీ ఆమెకు ఏ ఆలోచన వచ్చిందో ఏ విప్లవానికి పునాది వేస్తోందో?" అని ఊరుకున్నాడు. గిర్రున ఆర్నెల్లు తిరిగిపోయేయి.

ఈ మధ్య శంకర్రావుని దమయంతే అడుగుతోంది—

''హేమ బాగుందా?"

''ఆ! ఆ!''

''ఇవాళ మీరు టీ ఇప్పించకపోయేరా?"

''ఇప్పించేనులే!"

''ఓహో మరి టిఫెనో?''

''వద్దంది''

''అయ్యోపాపం ఆదేం?

"ఏమిటో చాలా మొహమాటం''

''చ్చా! చ్చా! పోగొట్టండి అయినా ఇన్నాళ్ళయాక మొహమాటం కాదది, బెట్టు పాపం మీరంతా చాలా మంచివాళ్ళు కదా అంతా తలొక సారి ఇప్పిస్తున్నారా, ఒక్కసారే ఇప్పిస్తున్నారా''

"దమయంతి'' తెల్లబోతూ పిల్చేడు శంకర్రావు.

''ఎందుకండీ ఆశ్చర్యం, తెల్లనివన్నీ పాలనినమ్మి, మహా బాధ పడి జాలిచూపే నాలాంటిది మీ ఆఫీసు వైనం తెల్సుకున్నాక-విడ్డూర పడాలి గానీ...'' అంటూ నవ్వేసి వెళ్ళిపోయింది.

శంకర్రావుకి బుర్ర తిరగడం మొదలైంది

ఇంచుమించు రెండు రోజులకొకసారి ఇదే భాగోతం వినుగేస్తుంది. వినిపించుకోనట్టు బయటికి వెళ్ళిపోతున్నాడు.

ఓ రోజు ఇంటికి వచ్చేసరికి-అతని మనసు అసలే బాగులేదు. దానికితోడు గదిలో నుంచి మాటలు విన్పిస్తున్నాయి.

దమయంతి పాపని గద్దిస్తోంది ఉహూ గర్జిస్తోంది.

''ఇంతపని చేస్తావా? ఎంత అప్రతిష్ట? నేను నల్గురిలో తల ఎత్తి ఎలా బ్రతకగలను ఒళ్ళు పైన తెలియకుండా తిరుగుతావా ఎవడు వాడు చెప్పు పీక పిసికేస్తాను వాణ్ణి దాటిపోనివ్వను నల్గురిలో పెట్టి కడిగేస్తాను నీ దారిని నిన్ను వదిలేసిపోతాడా నీకు బుద్ధి లేదూ ఎలా లొంగేవు నాకు ఒక్కసారేనా చెప్పేవా చెప్పు ఎవడు వాడు అరగంటనుంచి అడుగుతూ వుంటే చెప్పవేం చంపేస్తాను. నరికి పోగులే పెట్తాను. చెప్తావా లేదా?"

ఫెడీ ఫెడీ చప్పుడు పాపవెక్కిళ్ళు వినిపించేయి చరాల్న ముందుకు దూకి, గదితలుపులు తోసి చూసేడు శంకర్రావు. పాప పోనిటేల్ దమయంతి చేతిలో మెలితిరిగివుంది. పాప చెంపలు కంది పోయి, కళ్ళు వాచిపోయి, పెదవుల మధ్య దుఃఖాన్ని అపుకుంటు హృదయవిదారకంగా వుంది.

శంకర్రావు చటుక్కున దమయంతి నుంచి పావని విడదీసేడు

''మీరా వచ్చారా? చూడండి, చూడండీ ఇదెంతపని చేసిందో, నా కడుపున చెడపుట్టింది. దీన్ని చంపి పారేయాలండీ'' అగ్ని పర్వతంలా ఉంది ఆమె.

"ఛ ఆడపిల్లని అంతంత మాటలనకు దమయంతి" అన్నాడు

అంత కోపంలోనూ విచిత్రంగా చూసి వెంటనే "మీకు తెలియదండీ. మీకు తెలియదు. ఇది ఏం చేసిందో తెల్సునా" అంది.

"తెల్సును." చాలా నెమ్మదిగా అన్నాడు.

'తెల్సునా"

'అవును. ఈడు వచ్చిన ఆడపిల్లని కట్టుబాట్లు లేకుండా, స్వేచ్ఛ పేరిట హద్దులు చెరిపేస్తే ఎలాంటి అనర్థం వాటిల్లుతుందో...అదే జరిగింది. ఇప్పుడు నువ్వు పాపని కొట్టి తిట్టినా ప్రయోజనం లేదు చేతులు కాలేక ఆకులు పట్టుకున్నట్టే.

'స్వేచ్ఛ, స్వాతంత్రం అనేవి నువ్వు చెప్పినట్టు జన్మతం: అందరికీ ఉంటాయి దమయంతీ, కానీ అందమైన పువ్వుకీ నాజూకైన అరిటాకుకి, ఈడు వచ్చిన ఆడపిల్లకీ రక్షణ అవసరం. ప్రకృతి సహజమైన కోరికల్ని అరికట్టడం కష్టం కనుకనే ఆ రక్షణ పేరిట 'కట్టుబాట్లు' అంటూ ఏర్పాటు చేసుకున్నాం. ఇంత అభ్యుదయ పథంలో నడుస్తున్న నీవుకూడా-పాప చేసిన పొరపాటుని 'తప్పుగా' భావించి శిక్షిస్తున్నావు. మరి నువ్వు ఎక్కడ ఎదిగేవు? స్వేచ్ఛ నిచ్చేవు. హద్దు చెరిపేసేవు. కాని కాలు జారిందని శిక్షిస్తున్నావు. ఆ తప్పును తప్పుగా కాక తేలికగా తీసుకోగల్గితే నువ్వు నిజంగా ఆదర్శమూర్తివే. హూ! కానీ సగటు అభ్యుదయాలు ఆదర్శాలు ఇలా తమదాకా వస్తే తట్టుకోలేక పోతున్నాయి.

"చూడు ఇవాళ హేమ రిజగ్నేషన్ చేస్తూ నీకు ఉత్తరం రాసి ఇచ్చింది. చదువుకో" అంటూ జేబులోనుంచి ఓ కవరు తీసి ఆమె మీద గిరాటు వేసి "పాపా; ఏడ్వకమ్మా తప్పు నీదికాదు నాది; మీ అమ్మని మొదట్లో కంట్రోల్ చేయని నా సహనం ఈనాడు నీచేత తప్పుదారి తొక్కడానికీ ఓ దారి బ్రతుకుతున్న హేమ జీవితం మళ్ళీ ముళ్ళలో పడడానికి పనికి వచ్చింది.

"దారుణాలు, అక్రమాల్ని ఖండించాలి గానీ అనవసరంగా

సంఘం మీద కత్తికట్టి తన గొయ్యి తనే తీసుకునే తెలివిమాలిన ఆదర్శాలు అభ్యుదయాలు ఇక కట్టిపెట్టు" అని దమయంతిని మందలించి పాపనిహృదయానికి హత్తుకున్నాడు శంకర్రావు.

తండ్రి చేతులమధ్య పాప వివేకం మేల్కొంది.

"నేను వెళ్ళి మాట్లాడుతాలేమ్మా" అని తల నిమిరాడు.

హేమ ఉత్తరం చదువుకున్న దమయంతి తనలోకి తను కుంచుకుపోతున్నట్టు కూలిపోయి కూర్చుంది.

"అక్కయ్యగారూ? కొండంత దిగులు మనసులో దిగమింగుకుని, సమాజాన్ని మోసం చేస్తూ ధైర్యంగా కనబడుతూ బ్రతుకు సాగిస్తున్నాను. దీనంగా బేలగా ఉంటే అలుసు చేస్తారని అందరితో నవ్వుతూ హాయిగా ఉన్నట్టు నటిస్తున్నాను. మీ దయాగుణం విని ఆనందించేను. ఇప్పుడిప్పుడే నిజంగా నా దిగులు మర్చిపోతున్నాను. కానీ మీరు నన్ను హీనంగా అమానుషంగా హింసిస్తున్నట్టుగా వ్రాసిన ఉత్తరం నాకు అందింది.

"ఇంతకన్నా మగవాడు 'రేప్' చేసిన కేసులే నయం. అన్నంత బాధ కల్గింది. ఇక నేను ఉద్యోగం చేయలేను. వెళ్ళి పుట్టింట్లోనే ఉంటాను. ఎంతైనా మీరు కూడా 'ఆడమనసు' చూపించేరు.

ఇట్లు
హేమ

దమయంతి భోరున ఏడ్చింది. కానీ లాభం??



# "అసమర్థుడు"

(1967లో ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో ప్రచురించబడిన కథ)

ఆదరాబాదరాగా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని బస్‌స్టాప్ చేరాడు భాస్కర్. చేతి రుమాలుతో ముఖానికి పట్టిన చెమట తుడుచుకుని అలవాటుగా పక్కకి చూశాడు. ఆ రెండుజడల అమ్మాయి వాచీ తీసి టైము సరిచేసుకుంటూంది. 'మామూలేగా' అనుకుని ముఖం తిప్పేసుకున్నాడు.

భాస్కరం బస్‌స్టాప్‌లో ఉన్నాడంటే తొమ్మిదింపావు అయిందని అతన్ని ఎరిగిఉన్న వాళ్ళందరికీ తెలుసు. అతను అంత ఖచ్చితంగా ఉంటాడని కాదు. ఆ బస్సు అందుకోవాలని పడే ఆరాటం అటువంటిది. ఆ తొందర అందరికీ ఉన్నా, భాస్కరం మటుకు తన జీవితాన్ని భూతద్దంలో చూసుకుంటాడు. క్యూలో ముందు నిల్చోకపోతే తొమ్మిదిన్నర బస్సుకు అందుకుని అందులో జొరబడలేడు. పావుగంట ముందుగా రాకపోతే క్యూలో మొదటి పదిమందిలో నిల్చోలేడు. ఆ బస్సు దాటిపోతే ఆ తరవాత బస్సు ఆఫీసు టైమ్‌కి అందదు. రోజు రిక్షామీద పోగల జీవితం కాదుకదా! సైకిల్ కొనాలనుకుని గత ఏడాదినుంచీ ప్రయత్నం సాగిస్తూనేఉన్నా ఏదీ ఆ శుభసమయం సమీపించటంలేదు. అంతవరకు తనకి బస్సుకోసం పడిగాపులు తప్పవు. తనను చూసి ఎవరు వాచీలకి కీలు ఇచ్చుకున్నా, టైమ్‌లు సరిదిద్దుకున్నా ఊరుకోవలిసిందే.

బస్సు సాగుతున్నట్టే భాస్కరం ఆలోచనలు సాగుతున్నాయి. గత సాయంత్రం ఇంటికి వచ్చినప్పటినుండి వేధిస్తున్నది ఒక విషయం కమల తన బావను ఎందుకు చేసుకోలేదు? తమ వివాహం మన

స్ఫూర్తిగా అంగీకరించినదేనా? పెద్దల ఒత్తిడి ఏమీ లేదుకదా? ఈ విషయం అయిదారేళ్ళ క్రితం తెలుసుకోవలిసిన సంగతి. ఇప్పుడు ఇద్దరు పిల్లలు పుట్టాక ఆలోచించవలసింది కాదు. కాని ఆ అవకాశం ఎప్పుడు కలగలేదు. అంతటి అనుమానమూ రాలేదు. తమ దాంపత్యంలో ఎప్పుడు పొరపాట్లుగాని కలతలుగాని రాలేదు. అదంతా తమ అదృష్టంగానే భావించుకున్నాడు కాని...ఏమిటో నిన్న ఉదయం వాళ్ళ బావట...ఈ ఊరికి బదిలీ అయిందిట...కారులో భార్యా సమేతంగా వచ్చి, "ఫలానా ఇల్లు ఇదేనా?" అని తెలుసుకుని భార్యని లోపలికి పంపించాడు. తను కుర్చీలో కూర్చుంటూ "మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు. ఏదీ ఆఫీసుపని తీరటంలేదు. ఏదో మొహమాటాలు. ప్రతివాడికీ ఆశ, తనే ఆ ఉద్యోగం కొట్టేయ్యాలని యోగ్యత ఉండవద్దు జల్లెడ పట్టేసి ఏరేటప్పటికి? మా పని సరే, ఇక ఊపిరిసలపనంతపని బిగుతుగా ఉంటాయండీ మా పనులు. కమల పెళ్ళికి తప్పకుండా వచ్చేవాణ్ణె. అర్జంటుగా ఆఫీసుపని తగిలింది. మా కమలానికి బాగా కొపం వచ్చే ఉంటుంది. అందుకే మా పెళ్ళికి మీ దంపతులు రాలేదు. అవునా," అన్నాడు. దడదడ మాట్లాడేస్తున్న అతన్ని అయోమయంగా తను చూస్తున్నప్పటి దృశ్యం ఊహించుకుంటే నవ్వు వస్తూంది.

"ఏమిటి, బ్రదర్, ఊహాగానమా? మనం ఇంకా ఆఫీసుకు వెళుతున్నాముగాని ఇంటికి కాదు."

తోటి గుమాస్తా రాజారావు పళ్ళు ఇకిలించి బుగ్గ నున్న కిళ్ళీ నగం కనిపించేలా నవ్వుతూ ఉంటే గబగబా దిగాడు బస్సు.

యాంత్రికంగా పనిచేస్తున్న భాస్కరం మస్తిష్కంలో మళ్ళీ నిన్న ఉదయపు సంఘటనే రీలులా తిరగటం మొదలైంది. 'ఇన్నాళ్ళకు చూడగలిగినందుకు చాలా సంతోషంగా ఉందిట అతనికి—ఆఫీసరైన కమలవాళ్ళ బావకు—అప్పటి తన వేషం ఎలా ఉందీ, లుంగీ కట్టుకుని అంతకు అయిదు నిమిషాలక్రితం గడ్డం చేసుకున్న బాపతు సబ్బు

చెవులపక్క మెడక్రింద అట్టలా పేరుకుని అక్కడక్కడ తెగిన రక్తపు చుక్కలతో వికృతంగా ఉంది. తెగద్దూ మరీ పొదుపుకోసం కొత్త బ్లేడు మానేస్తే? బనియను చిరుగు సరిగ్గా ముందుకే ఉండటంవల్ల తువ్వాలుతోటి కప్పుకుంటూ, బొబిగాడు జారిపోతూఉంటే చంకలో ఇముడ్చుకునేందుకు శతవిధాల ప్రయత్నంచేస్తూ, వేళ్ళ సందున సగం కాలిన సిగరెట్ నుంచి వచ్చే పొగకు కళ్ళు చికిలించి చూస్తూ వచ్చిన వ్యక్తిని గౌరవించే నిమిత్తం అర్థంలేని వెర్రినవ్వులాంటిది నవ్వుతున్న తనని చూడగలిగినందుకు సంతోషం కలగటం ఎలాఉన్నా బాధ మాత్రం కలగవచ్చు. 'నువ్వట్రా నూ కమలానికి పుస్తె ముడేసిన దౌర్భాగ్యుడివి!" అని.

ఆఫీసర్ హోదాలో, పుల్ సూటులో, కారు వేసుకుని వచ్చిన ఆ వ్యక్తి నా కమలకి బావ అని తెలిసిన క్షణంలో అతనిలో కలిగిన భావం ఇది. 'కమలకి అన్యాయం చేసేనేమో?'

ప్యూను వచ్చి, ''అయ్యగారు రమ్మంటున్నారు" అన్నాడు.

కోపంగా చూశాడు వాణ్ణి, అయ్యగారిమీద చూపించలేని అక్కసునంతా కళ్ళల్లో నింపి వాడా ఊరుకునేది! తల ఎగరేసి 'అదేదో అరి దగ్గిర చూపండి' అన్నాడు. అన్నవాడు ఆగేడా? పక్క వాళ్ళవైపు తిరిగి 'భాస్కరంబాబుకు కోపంకూడా వస్తుందని నాకు తెల్దు' అంటూ అవొకలాగున నవ్వాడు, 'నీకు కోపం వస్తే ఎట్లగయ్యా' అన్నట్టు.

'ఏమిటోయ్ ఈ తప్పులన్నీ?' ఆఫీసర్ మందలింపుకు సంజాయిషీ చెప్పుకుని ఆ కాగితాన్ని మళ్ళీ తెచ్చుకున్నాడు.

'ఏం బ్రదర్ మోతాదుకు మించాయా దీవెనలు?' పక్కవాడు ఉత్కంఠంతో అడిగే ప్రశ్న.

'అబ్బే, భాస్కర్ అలాంటివి పట్టించుకోడుగా!' రాజారావు లాలింపు.

'అయినా బాస్ అనదగువాడు, మనము పడదగువారము.' ప్రమోషన్ లిస్టులో పేరుపడ్డ రామారావు తీర్మానం.

భాస్కరం ఎవరికీ జవాబు చెప్పలేదు. చెప్పమని వాళ్ల అడగ నూలేదు. వాళ్ళల్లో వాళ్లే ప్రశ్నలు, జవాబులు, తీర్మానాలు, సంజాయిషీలు అనేసుకుని పావుగంటలో మళ్లీ ఎవరి పనుల్లో వాళ్ల మునిగి పోయారు.

కాంటిన్‌లో కాఫీ తాగుతూ ఆలోచిస్తున్నారు భాస్కరం.

'ప్రతివాడికీ అలుసే ఈ గుమాస్తాగిరీ! నాన్నకి తన ఈ ఉద్యోగం మీద ఒక నిరసనభావం. బి.ఎ. డిగ్రీతో ఇంతకంటే ఘనమైన ఉద్యోగం చెయ్యవచ్చని ఆయన ఉద్దేశ్యం. ఫలితాలు పడిన మరునాటి నుంచే దరఖాస్తులు పెట్టించేటప్పుడుమాత్రం ఈ ఉద్దేశ్యం ఉన్నట్టు తోచదు. నిన్న ఆయన బజారునుండి ఇంటికి వచ్చేసరికి ఎదురుగా ఉన్న కారును, కొత్త వ్యక్తులను చూసి మొదట తెల్లబోయారుకాని చుట్టరికం తెలుసుకున్నాక ఆయన చూపించిన శ్రద్ధ లీలగా ముఖంలో మెరుస్తున్న ఆనందం తను కనిపెట్టకపోలేదు. ఆ ఆనందం వెనుక 'తన కొడుకు కూడా ఇంతటివాడు అయితే బాగుండునే' అనే ఆవేదన తన గుండెల్ని పిండినట్టయింది. అంతకంటే మరొక విషయం తనను సిగ్గుపడి తల వంచుకునేలా చేసింది. అతను కారు ఎక్కి 'వెళుతున్నా'మని, 'తప్పక మీరు రండి' అని చెబుతున్నప్పుడు, నాన్న చూపించిన కంగారు— 'అయ్యో! ఎంతమాట! తప్పక వస్తాము. మీరు శ్రమపడి రానక్కర్లే' దని వినయంతో చెప్పటం— సహస్రాంతం చిన్నవాడైన అతని ముందు వంగి వంగి విధేయత కనపరచటం—ఛ!ఛ! తనకి మనసు మూలిగినట్టైంది!

ఆమె కర్చీఫ్ ఊపుతూ ఫ్రంట్‌సీట్లో నుంచి కమలతో 'వెళ్లి వస్తా' మని చెబుతూంటే తలుపు చాటున నిలుచున్న కమల ముఖంలోకి పరీక్షగా చూసాడు. ఆమె ముఖం తిప్పుకుని ఇంటిలోకి వెళ్లిపోయింది.

నాన్నలాగే కమలకూడా వాళ్ళ బావ హోదా జీవితం చూసి తన జీవితంలో వెలితి అనుభవిస్తూందా? ఏమో?

రాత్రి భోజనాల దగ్గిర నాన్న అన్నారు: 'ఒరేయ్ అబ్బాయీ! దేనికైనా పెట్టిపుట్టాలిరా. అంతచిన్న వయస్సులో ఎంత దర్జా బ్రతుకు! ఇంటికే నూట వదిరూపాయలుట! ఏవమ్మా కమలా, మీ బావ ఇంత అంతస్తులో ఉన్నాడని ఎప్పుడూ చెప్పలేదే?' అదేదో విలువైన వస్తువు పోగొట్టుకున్నంత ఆత్రంగా అడిగారు మజ్జిగ వడ్డనకి వచ్చిన కమల ముఖం జేవురించినట్టు తను గ్రహించాడు. చిన్నగా నవ్వేసి ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

'మీ బావ వాళ్ళింటికి వెళదామా?' అని సాయంత్రం తను అడిగితే తనవైపు అదోకలాచూసి, 'నేను రాను. మీరు వెళుతున్నారా?' అన్నది. 'నాకు' సుతరామూ ఇష్టంలేదు. కాని నాన్న ఒత్తిడిచేస్తున్నారు. ఎటూ ఆయన తెల్లవారుఝాము బండికి వెళ్ళిపోతారు కనక ఒక్కసారి ఆయన చెప్పినట్టు వెళ్ళివస్తే వదిలిపోతుంది. ముసలాయన మనసు కష్ట పెట్టడమెందుకని...'

తను మాట పూర్తి చెయ్యకముందే కమల బదులేమీ చెప్పకుండా లోపలికి వెళ్ళిపోయింది. యాంత్రికంగా నాన్నగారితో వాళ్ళింటికి వెళ్ళి వచ్చాడు. వచ్చిన దగ్గిరనుండి నాన్న ధోరణి తనకి బాధ కలిగిస్తూనే ఉన్నా ఊరుకున్నారు. రాత్రంతా నిద్రపట్టలేదు. ఒకటే వేదన, ఆలోచన, బాధ.

'నాన్నకి తనొక ఆఫీసర్నైపోయి పెద్ద మేడలో ఉంటూ అమ్మా' నాన్నల అజ్ఞలు పాటిస్తూ అక్కయ్యని, బావని, పిల్లల్ని పండగలకు తీసుకునివస్తూ, రాధ పెళ్ళికి చేసిన అప్పు తీర్చేసి...' నిజమే అసలు ఆయన తమ ఇంటికి వచ్చిన పని దానిని గురించేగా? రెండేళ్ళ క్రితం రాధ పెళ్ళికి చేసిన నాలుగువేల అప్పు పూర్తిగా తీర్చదేలేదు. రాధకు ఇప్పుడు ఏడో మాసం. పురిటికి తీసుకురావాలి. అందుకనే ఆ పొలం కాస్తా అమ్మేసి అప్పు తీర్చేద్దామని, తనతో చెప్పి సంతకాలు తీసుకు

వెళ్ళాలనుకుంటున్నాని చెప్పినప్పుడు 'మంచి పనే' అనుకున్నాడు. అంతకంటే చేసేదిలేదు. పట్టణవాసంలో మధ్యతరగతి కుటుంబాల స్థితి ఎలాంటిదో అనుభవించేవాళ్ళకేగాని తెలియదు. అనాడు రాధ పెళ్ళికి సెలవు దొరకని కారణంగా పెళ్లికి ముందురోజే దిగారు. తను, కమల. చిట్టి బంధువు లందరూ అనుకున్నారు. ''ఏం కొడుకులో కోడళ్లో? వీళ్లా ఉద్ధరించేది? పెళ్ళివారితో సమంగా దిగారు బండి.'

తరవాత మాటలు తను వినదలుచుకోక పెరట్లోకివెళ్లిపోయాడు తన స్థితిగతులు విన్నావాళ్ళకి నచ్చవు. అందుకే ఏం మాట్లాడకుండా ఊరుకున్నాడు. తిరిగి మళ్ళీ వచ్చాక ప్రతినెలా కొంత డబ్బు పంపిస్తు న్నాడు. అలా పంపించడానికి ఎంత సతమతమవుతున్నారో వాళ్ళకి తెలియదు. ''మరి కాస్త సర్దుబాటు చెయ్యడానికి ప్రయత్నించ కూడదా? కమలతో సంప్రతించాకే" అని అమధ్య నాన్న రాసిన జాబు చూస్తే ఏడుపులాంటి నవ్వు వచ్చింది. అక్కడికి కేదో తను పంపగలిగేఉండి భార్యాదాసుడైనట్టు —ఏమిటి వీళ్ళ ప్రవర్తన?

సర్వర్ ఇచ్చిన బిల్లు కాగితాన్ని పట్టుకుని లేచాడు, వాస్తవం లోకి వచ్చిన భాస్కరం.

కాగితాల మధ్యనుంచి తలఎత్తి చూశాడు. ఎదుటి సీట్లో సుదర్శనం కనిపించాడు. అతను తన తోటి క్లర్కేకాని ఎన్నడూ ఆతని ముఖంలో ఆ చాయలు కనిపించవు. ఇన్‌షర్ట్ వేసిన టెరిలిన్ షర్టు, చిరునవ్వు చిందే ఆ ముఖం... ఎంత అదృష్టం? వెనక ఏమైనా ఆస్తి కలవాడు అవునో, కాదోగానీ పెళ్ళికి ఎదిగిన ఇద్దరు చెల్లెళ్ళు, హైస్కూలు చదువులోఉన్న తమ్ముడు అందరి కళ్ళకి కనిపించే చరాస్తులని తెలుసు. అయినా అతను ఎప్పుడూ చికాకు ఎరగని విలాసపురుషుడు. భార్యాపిల్లల్ని సినిమాలకి, షికార్లకి తిప్పగల అదృష్టవంతుడు.

తనకిమాత్రం అనిపించదు! ఎంచక్కా ఒక చిన్న బంగళా మాట చెప్పగానే పనిచేసే నౌకర్లు. తను, కమల కార్లోనో, స్కూటర్

మీదో షికారుకి వెళ్ళి వచ్చేటప్పటికి పిల్లలకి అన్నాలు పెట్టి పడుకో బెట్టి, తమకోసం కాచుకుని కూర్చునే వంటామిడ. సిల్కుచీర విప్పే ఓపికలేని కమల అలిసి భోజనం చెయ్యనని అలిగితే తను బ్రతిమాలి 'ప్లీజ్, కమ్ము పోనీ ఈ గ్లాసు పాలు తాగెయ్యి. వద్దూ! అయితే ఈ రెండు ఆపిల్ ముక్కలు . నే తినిపిస్తాగా!' అని అనాలి

''ఊహే ఇంత మధురంగా ఉన్నది గదా. అనుభవం ఎంత ఆనందంగా ఉంటుంది. సరిగా కమల వాళ్ళ బావ దాంపత్యం ఇలాగే ఉంటుందేమో. కమల కూడా నాలాగే కలగని ఏమనుకుం టుంది. ఊఁ, ఏమనుకుంటుంది. ''నా జన్మలో ఈ కల నిజమయ్యే భాగ్యం కూడానా!" అని అనుకుంటుంది. కుంగిపోతుంది. చాతకాని మొగుణ్ణి అనుకుంటుంది. వీల్లేదు. కమల మనసు వికలం కాకూడదు. ఆమె బాధ పడకుండా తన సమర్థత చూపాలి'

దృఢంగా నిశ్చయించుకుని గట్టి నిర్ణయానికి వచ్చాడు.

ఎన్నడు ఆలస్యంగా రాని భర్తని ఆశ్చర్యంగా చూసింది కమల.

''కమలా! చూడు, ఈ పాకెట్లలో చీరలున్నాయి. నచ్చాయేమో చూసుకో. బాగా లేకపోతే వాపసు ఇస్తానని చెప్పాలే. ఏరీ పిల్లలు, ఒరేయ్, బాబీ ఏదీ నోరు తెరువు. ఆ అదీ బాగుందా బిస్కెట్టు! అమ్మా, చిట్టీ, ఈ వస్త్రం పరికిణీగుడ్డ నీకు బాగుందా చూసుకో. ఆ బుట్టలో పళ్లున్నాయి. కోసి పెడతాలే. అరే! ఆదేమిటి కమలా అలా నిల్చుండి పోయావు! చీరలు చూడవేం!"

కమల పరీక్షగా భర్త ముఖంలోకి చూసి రెండు చేతులతో ముఖం కప్పేసుకుని బావురుమని ఏడ్చేసింది.

నిర్ఘాంతపోయాడు భాస్కరం!

కమల వెక్కి వెక్కి పడుతూనే చెప్పింది. ''మీరింత బలహీనులవుతారనుకోలేదు. తమస్థితిని ధైర్యంతో ఎదుర్కొనే మనోబలంగల

భర్తగా మిమ్మల్ని చూసి ఇన్నాళ్ళు గర్వించాను. స్త్రీమతు ఎరిగి జీవితాన్ని సరిదిద్దుకోగల నన్ను మీరింత తేలికభావంతో అంచనా వేసుకున్నారా! మేడలు, కార్లే ఆనందం ఇవ్వగలవని, సాఫీగా, కులాసాగా ఉన్న మన సంసారంలో తృప్తి ఆనందం లేవని ఎలా అనుకున్నారు! ఎన్నడైనా మనలో ఆ లోటు మచ్చుకైనా కనిపించిందా, ఈ కమల హృదయంలో మీరు చూడగలిగింది ఇంతేనా, సైకిల్ కోసం దాచిన సొమ్ముతో ఈ బహుమానాలన్ని కొని, నన్ను మెప్పించాలనుకున్నారా, నన్ను మీరు అర్థం చేసుకోలేదని ఈనాడే తెలిసింది," పాకెట్లవైపైనా చూడకుండా ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

స్థాణువులా నిలబడ్డ భాస్కరం తెప్పరిల్లుకుని కుర్చీలో కూర్చుండిపోయాడు. చెల్లాచెదురుగా ఉన్న ఆ పాకెట్ల మధ్య బాబి, చిట్టీ పోటీలుపడి బిస్కెట్లు తింటూఉంటే నవ్వుకున్నాడు.

మనసులో మాత్రం అనుకున్నాడు. 'నిజం, కమలా, అందరిలాగే నిన్నూ భావించానుగాని నీ ఔన్నత్యాన్ని అర్థం చేసుకోలేకపోయాను నన్ను క్షమించు. నీ భాస్కర్ అసమర్థుడు!'



# "వరలక్ష్మి"

(ఈ కథ ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో 1968 సంవత్సరపు దీపావళి కథల పోటీలో మూడవ బహుమతి పొందినది.)

మరల ఉత్తమ కథానికల సంపుటిలో శేషాచలం కంపెనీ వారు ప్రచురించినారు.

పది గంటలవేళ!

రిక్షాలు, సైకిళ్ళు, బస్సులు, కాలినడకలవాళ్ళ—ఒకటే తొక్కిడి ప్రజ! అందరికీ తొందరే.

క్షణం తీరికలేని ఈ మనుష్యులందరిలో - ఎందరో స్వార్థపరులు - కొందరు ఉపకారస్థులు. రంగురంగుల చీరలు....గొట్టం ప్యాంట్లు... గళ్ళబుష్‌కోట్లు! ఖాదీ లాల్చీలు!

కలగా పులగంగా...కుమ్మరించిన కూరగాయల్లాగ పొట్టి... పొడుగు - సన్నం...లావు—రకరకాల మనుష్యులు. వెంట్రుకల వాసిలో ప్రమాదాన్ని తప్పించుకోగల్గే అదృష్టవంతులు...

రేవటిని గూర్చి ఆలోచించక్కర్లేని నిరాశావాదులు!

ఎందరెందరో కన్పిస్తున్నారు ఆ కిటికీనుంచి. అందుకే వాలు కుర్చీలో కూర్చుని గంటకుపైగా అలా బయట ప్రపంచాన్ని చూస్తూ కూర్చుంది వరలక్ష్మి.

ఎదురింట్లో కిందవాటాలో-కిటికీప్రక్క నుంచుని వల్లభరావు రావూ చూస్తున్నాడు వరలక్ష్మిని!

బిగించి వేసుకున్న జడ... పెద్ద బొట్టు...కళ్ళనిండుగ కాటుక... ఆ కళ్ళల్లో దాగిన నిర్లిప్తత అతన్ని కదిలిస్తున్నాయి.

వారంరోజులక్రితం ఆ ఇంటి కిటికీతలుపులు మూసివుండేవి. కిటికీ వూచలమీద పేరుకుపోయిన దుమ్ము, మూలలకి పట్టిన బూజులు ఓ శుభముహూర్తాన దులపబడ్డాయి. ఎవరో ఆ ఇంటిలో దిగుతారని తెలుసుకున్నరోజున...వాళ్ళకి వరలక్ష్మిలాంటి అందమైన, పెళ్ళి కాని ఆడపిల్ల వుంటుందని ఊహించలేదు. రెండు రోజులనుంచి ఆ అమ్మాయి ఆ కిటికీ దగ్గర కూర్చోవడం చూసేక... వల్లభరావుకి బోలెడంత సానుభూతి...మరేదో అనుభూతిలాంటివి కలగడం ప్రారంభించేయి. ఆ అమ్మాయిపేరు వరలక్ష్మి అని మాత్రం తెలుసుకోగలిగేడు. ఆ క్షణంనుంచే అతని మనస్సులో ఆ అమ్మాయిని ఓదార్చడం మొదలెట్టేడు.

'వరం, నువ్వలా చూడకు. నాకు చాలా బాధగా వుంది. నీలాంటి పెళ్ళికాని ఆడపిల్లలందరూ అలాగే చూస్తారు జాలిగ! మీ నాన్న కట్నంఇచ్చి పెళ్ళి చేయలేడనేగదూ ఆ దీనమైన చూపులు... అవును. అంతులేకుండా కట్నాల రేటును పెంచుకొస్తున్న తల్లిదండ్రులకి భయపడే పిరికినన్నాసిరావులు నీలాంటివాళ్ళ దీనాలాపనలు అర్థం చేసుకోలేరు. నీ మూగబాధ వినపడదు. వినిపించినా అమ్మానాన్నల మాటని అతిక్రమించలేరు. కాని నాకు ఆ గొడవలేమీ లేవు. నేను స్వతంత్రుణ్ణి. ఉన్న ముసలి మేనత్త అక్కయ్యదగ్గర వుంది. నా భవిష్యత్తుకు అడ్డుపడగల సమర్థురాలు కాదు. అందుచేత నేను మీ నాన్నగారితో మాట్లాడుతాను. బాధపడకు వరం! నేనున్నానుగా?

ఒక్కసారి ఇలా నా కిటికీవైపు చూడు. నీకే తెలుస్తుంది. ఎంతసేపలా రోడ్డునే చూస్తావు? ఒక్కసారి ఇటు... నావైపు చూడు...

నాన్నా ఈ పరికిణీ కట్టుకోనా? నాల్గేళ్ళ చిట్టి వల్లభరావు చెయ్యి లాగేసరికి ఊహలు చెదిరి వాస్తవంలో పడ్డాడు.

రెండేళ్ళ క్రితం భార్యపోయిన వల్లభరావు ఇద్దరు పిల్లలతో చేసుకోవడం ఎంత ఇబ్బందో అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. ఎప్పటికప్పుడే మేనత్తని రమ్మని రాయాలనుకుంటూ మళ్ళీ ఆవిణ్ణి శ్రమపెట్టడ మెందుకని వూరుకొనేవాడు. మరొక ఆడదక్షత ఎంతో అవసరమని తెలుసు తను సిద్ధంగానే వున్నాడు. కట్నం ఇచ్చుకోలేని ఆడపిల్లల తండ్రులమీద ఈ మధ్య విపరీతమైన జాలి కల్గుతోంది: అందునా ఎదురింటిలోనే తటస్థపడేసరికి మరీ తట్టుకోలేక పోతున్నాడు.

'చూడు వరం. రెండో పెళ్ళి వాణ్ణి కదా అని సంశయించకు. బోలెడన్ని బాధ్యతలున్న మొదటి సంబంధపు పెళ్ళికొడుకున్న వేయి రెట్లు నయం. పెళ్ళికెదిగిన ఆడబడుచులు, చదువుకొచ్చిన మరుదులు, సాధించే అత్తగారు నీకుండరు. నానాపాట్లుపడి కట్నాలిచ్చి చేసే సంబధాలలో నిజానికి అవే వుండేవి. సుఖం వుందా చెప్పు? మీ నాన్న ఏ తిప్పలూ పడక్కర్లేదు. నువ్వు అలా దిగులుపడక్కర్లేదు. నేను మీ నాన్నతో మాట్లాడేస్తాను...

'నాన్న, అన్నం తిందామురా నాన్నా - బాబుకూడా పిల్చే సరికి వల్లభరావు కిటికీవదలి వంటింటివైపు కదిలేడు. కదుల్తూ 'వరం, త్వరగా నీవు ఈ బాధలన్నీ తీసుకోవాలి మరి' - అను కున్నాడు.

సరిగ్గా ఆ సమయంలోనే పై అంతస్తులో బాల్కనీలో నుంచుని వున్న అన్నపూర్ణమ్మ-ఆ ఇంటి యజమానురాలు-వరలక్ష్మి కూర్చున్న కిటికీవైపు చూసింది

'కొత్తగా దిగారు కాబోలు. అమ్మాయి చక్కగా ఉంది. పెళ్ళి కావల్సిన పిల్లే! బోసి మెడ తెలుస్తూనే వుంది. అబ్బో! ఆడ పిల్ల

పెళ్ళి అందునా మధ్యతరగతి కుటుంబీపిల్లాగే వున్నది-వున్న పట్టు పడాలి?...అందం చందం కొలమానం కాదు ఈ రోజుల్లో. కోరిన కట్నం ఒకవైపు వుంచి త్రాసు సమంగ తూగివేసే అమ్మాయిల మెళ్ళో తాళిబొట్టు పడేది! హూ! బాగా ఈడు వచ్చిన పిల్లలాగానే వుంది. సరిగా కనిపించటంలేదు కాని ఎత్తరి గానే వుంటుంది...'

అన్నపూర్ణమ్మ దృష్టి మరల్చి రోడ్డు చివరిదాకా చూసింది. ఎక్కడా కొడుకు వస్తున్న జాడ కన్పించలేదు. అంతభారీ మనిషి-ఎంతో కుంగిపోయినట్టు నిట్టూర్చుకుని మరొకసారి వరలక్ష్మిని చూసి లోపలికి వెళ్ళింది. వెళ్ళి, హాల్లో సోఫాలో జారబడి కళ్ళు మూసుకున్నది.

అన్నపూర్ణమ్మ ధనవంతురాలు. చేయెత్తు మనిషి. ఠీవి. దర్పం గల నిండైన అందం. ఒక్కగానొక్క కొడుకు రాజు. ఎంతో ముద్దు ముచ్చట్లలో పెరిగిన రాజుకు లేని దురలవాటు లేదు. వివాహ ప్రయత్నం జరుగుతుండగానే తండ్రిపోయేడు. రాజుకు స్వేచ్ఛ ఎక్కువైంది. పిల్ల నివ్వడానికి సిద్ధపడ్డవాళ్ళు వెనక్కి తగ్గేరు. రాత్రిళ్ళు తాగి వచ్చేవాడు. ఒక్కోసారి ఆ రావటం మానేసేవాడు. అన్నపూర్ణమ్మ కొడుకుబెంగతో చిక్కి శల్యమవుతోంది.

రాత్రినుంచి ఇంటికిరాని కొడుకునుగూర్చి తల్చుకుంటూ కళ్ళు మూసుకుంటే . . అప్పుడే చూసి వచ్చిన వరలక్ష్మిరూపం లీలగా కన్పించింది. 'ఆ అమ్మాయితే వాణ్ణి దారిలో పెట్టగల్గుతుంది. పైసా కట్నం ఇచ్చుకో అక్కర్లేదని చెప్తే... ఆ పిల్ల తండ్రి ఎంత సంతోషిస్తాడో! ఆ అమ్మాయిని చూస్తే రాజు తప్పకుండా ఒప్పుకుంటాడు. ఆ పిల్ల తండ్రిని పిలిపించి ఒక్కసారి మాట్లాడితే... సంగతివింటే అతను ఎంతలా పొంగిపోతాడో! కాదుమరి? రాజు తాహతుకు సరి తూగేవాళ్ళైనా? వాడు ఇలా తయారవబట్టి తను అంతస్తు దిగి రావల్సి వస్తోంది. క్రిందిమెట్టు మీదున్న సంబంధమైతే తమకే నయం. వాణ్ణి సరియైనదారిలో పెట్టగల్గుతుంది...'

అన్నపూర్ణమ్మ కళ్ళుతెరచి టేబుల్‌మీదున్న గడియారం వంక చూసింది. గంట పదకొండు చూపెడుతోంది. కాని రాజు రాలేదు. గడియారం పక్కనే ఫ్రేంలో బిగించిన రాజు ఫోటో నవ్వుతోంది. ఆ ఫోటో పక్కన కిటికీవెనుక కూర్చున్న వరలక్ష్మి రూపాన్ని అమర్చుకుని - తృప్తిగా గాలి పీల్చుకున్నది అన్నపూర్ణమ్మ.

తొమ్మిదిగంటలనుంచి పదకొండుగంటలదాకా కిటికీ ప్రక్కన వాలుకుర్చీలో కూర్చున్న వరలక్ష్మికి కొంచెం చికాకు లాంటిది కల్గింది. నడుంనొప్పి తీరేదాకా వళ్ళు విరుచుకుని, బద్ధకంగా ఆవులించి వంటింట్లో వున్న తల్లిదగ్గరకి నడిచింది.

వంటంతా పూర్తి చేసుకుని మధ్యాహ్న ఫలహారానికి పిండికలుపుతున్న సత్యవతమ్మ కూతుర్ని చూసి 'నీవు తినేయరాదుటే! వాళ్ళకోసం ఎంత సేపు చూస్తావు?' - అన్నది.

'సరే. ఐతే, పెట్టు- అన్నది వరలక్ష్మి ఇష్టంలేకపోయినా.

అందరితో కలిపితినాలని సరదాగావున్న తల్లి ముందు చెప్పలేకపోయింది. పెరట్లో పంపుదగ్గర కాళ్ళు కడుక్కొందుకు వెళ్ళింది.

బాదంచెట్టున్న వాటాలో వెంకటలక్ష్మి తొంగి తొంగి చూసింది వరలక్ష్మిని. బాగా ఎత్తరిగా, తగిన వొళ్ళుతో పొందికగావున్న వరలక్ష్మిని చూడగానే 'ఎంత బాగుందో?' అనుకుంది.

'ఇంకా పెళ్ళికాలేదుట! అందుకేమరి తెలుస్తూనే వుంది. ఆ కళ్ళలో దిగులు, నిర్వం గుబులు... (!)'

'నిజమే మరి! ఇరవైయేళ్ళైనా వుంటాయి కదా! పెళ్ళి పెటాకులు లేవుగాదా? దిగులుగా వుండకపోతే కళకళలాడుతుందేమిటి?'

పంపుదగ్గర కాళ్ళు కడుక్కుంటుంటే మోకాళ్ళ వరకు కనిపిస్తున్న వరలక్ష్మి కాళ్ళు నాజూగ్గా తెల్లగా అరటిమూటల్లాగా కనిపించేయి. ఒక్కొక్కడుగు వేసుకుంటూ వెళ్ళిపోతూవుంటే— లయవే

స్తున్నట్టున్న ఆ బారుజడ — అచ్చం సినిమాలో నాట్యసుందరిలా ముచ్చట గొలిపాయి.

అప్రయత్నంగా తన కాళ్ళవైపు చూసుకుంది వెంకటలక్ష్మి.

ఇంకా మడిబట్ట విప్పలేదేమో - వంటలో వున్నప్పుడు పని తొందరలో తుడుచుకున్న నూనెమరకలు, సగం తడి, అక్కడక్కడ పసుపు, నలిగి అంచులు ముడుచుకుపోయి రంగు వెలిసిపోయిన చీర కచ్చాకట్టు-పిక్కలదగ్గర గోకున్నప్పుడు రేగిన తెల్లనిపొట్టు చారికలు, గీరలు - పాదంనిండా పసుపు - అరకాళ్ళల్లో పగుళ్ళు అక్కడక్కడ రక్తం చిమ్మిన గుర్తులు...

సిగ్గుపడి గభాల్న ఇంట్లో కెళ్ళిపోయింది.

'బాగుంది మరి, సంసారం, పిల్లలు, భర్త వీళ్ళందరిని చూసుకుంటూంటే అంత నాజూగ్గా వుండటానికి వీలుంటుందేమిటి? రేపుతనకు పెళ్లైతే ఇంత శృంగారంగా కులుకగలదా? అయ్యో రాత! అదిలేకేగా ఆ అమ్మాయి దిగులంతా! ఆ ఈడుకు నేనప్పుడే బుజ్జిని నాసిగాణ్ణి కన్నాను. పాపం! ఇంకా పెళ్ళేలేదు. అసలు ఆ ప్రయత్నాలూ లేవు (ఉన్నట్టు కనిపించలేదు!) అయినా కట్నాలు ఇచ్చుకోలేక ఎంతెంత వాళ్ళు పిల్లల్ని ఇలా చెట్లల్లా ఎదగబెట్టేస్తున్నారు! ఆ తల్లితండ్రులకి మాత్రం బాధ, ఆరాటం వుండవేమిటి? - పోనీ తన తమ్ముడికి చేసుకుంటే? —

'పిల్ల భేషుగ్గానే వుంది. కట్నం ఏదో శక్తికి మించిపోకుండా తీసుకుంటే సరి...వాడు స్కూల్ ఫైనల్ ప్యాసై నూటయాభై సంపాదించుకుంటున్నాడు. బొత్తిగా కట్నాలు లేకపోతే ఏం బాగుంటుందీ? చిలకా గోరింకల్లా వుంటారు. వాడు కాస్త లావన్న మాటేగాని ఎర్రగా ఉంటే దొరలాగుంటాడు! నామాటంటే వాడికి, అమ్మకి, నాన్నకి ఎంతో గురి.

ఎలాగో ఈ పెళ్ళి జరిపించేస్తే...ఈ పిల్ల, ఆ తల్లిదండ్రులు ఎంత ఇదైపోతారూ? నేనంటే ఎంత గౌరవం చూపిస్తారు? మరి

కాదా? ఈనాడు ఇంత దీనంగా చూస్తున్న ఈ పిల్లే రేపు నా మరద లైతే...ఎంత కళకళలాడిపోతుంది?... ఎంతైనా ఆడపిల్ల అత్తారింటిలోనే సుఖపడాలి...' పాతికేళ్ళ వయస్సులో నల్గురుపిల్లల తరువాత మళ్ళీ నెలతప్పిన వెంకటలక్ష్మి సంసారసుఖం ఎరగని కన్నెపిల్లమీద జాలిపడుతోంది.

*　　　*　　　*

మధ్యాహ్నం మూడు గంటల సమయంలో ఒక టాక్సీ ఆగింది.

వరలక్ష్మి వాళ్ళింటిముందు. అందులో నుంచి ఫుల్ సూటులో ఉన్న ఒక వ్యక్తి సూటుకేస్ చేతపట్టుకుని దిగేడు. టాక్సీ చార్జి యిచ్చేసి ఇంటిలో కెళుతున్న అతనిచుట్టు వరలక్ష్మి తమ్ముళ్ళు మూగేరు 'బావ వచ్చాడే అమ్మా' అంటూ.

వల్లభరావు ఆ సమయంలో ఆఫీసులో ఆఫీసర్ చెప్పిన అర్జెంటుఫైళ్లు చాలా అర్జెంటుగా చూస్తున్నాడు. అతని కిటికీ తలుపులు మూసి వున్నాయి. కాళ్ళు కడుక్కొందుకు నీళ్ళిచ్చి 'ఉదయమే వస్తావని ఎదురు చూసేము' అన్నది సత్యవతమ్మ.

'అనే రాసేననుకో. రాలేకపోయాను అత్తయ్యా' అన్నాడు ప్రసాదు. ప్యాంటు ఒక చేత్తో పైకి పట్టుకుని కాళ్లు కడుక్కొంటూ 'మామయ్య స్టేషన్‌కి వచ్చాడేమిటీ?' అన్నాడు.

'నేను ఒక్కణ్ణే కాదు. ఈ పిల్లలూ వచ్చారు. చూసి చూసి విసిగెత్తి చక్కా వచ్చాం' అన్నారు నారాయణరావుగారు.

సత్యవతమ్మ నవ్వి 'మా మాటకేంగాని' అంటూ గుమ్మంవైపు చూసి 'అది ఇవాళ ప్రొద్దుటనుంచి ఆ గదిలో కిటికీదగ్గర అతుక్కుపోయింది' అనేసి వంటింట్లో కెళ్ళింది కాఫీ తేవడానికి.

గదిలో వరలక్ష్మికి తల్లిమీద కోపం ముంచుకొచ్చింది-ఛ! ఏమిటో అలా చెప్తే ఏం బాగుంది. ఇందరిలో ః

గదిలోకి వచ్చి చిలిపిగా నవ్వేడు ప్రసాదు, 'నిజమా!' అన్నట్టు.

మొగ్గలా ముడుచుకుపోయి రెండు చేతుల్లో ముఖం దాచుకున్నది వరలక్ష్మి.

దగ్గరగా వచ్చి చెవిదగ్గర వంగి మెల్లగా అన్నాడు.

'నువ్వు ఇప్పుడు చదువుకున్న అల్లరిపిల్లలా లేవు.. అచ్చమైన పెళ్ళికూతురు. నాకోసం..నా రాకకోసం ఎదురుచూసేలా ఉన్నావు' చేతులు తీసేసు ముఖంమీద నుంచి—

వరలక్ష్మి కళ్ళలో వింతవెలుగు! మెరవు! సిగ్గు !...

పాపం, వెంకటలక్ష్మి వేవిళ్ళ బాధతో తిన్నదంతా వాంతి చేసుకుని, ఏడాది పిల్లని పక్కలో వేసుకుని నీరసంగా నిద్రపోతోంది కలలో తల్లిని తండ్రిని తమ్ముణ్ని ఒప్పిస్తోంది. పెళ్ళికి, వరలక్ష్మి దీనపు చూపులకు కలలో కదలిపోతోంది.

రెండురోజుల తరువాత నారాయణరావుగారు శుభలేఖలు ఇవ్వడానికి అన్నపూర్ణమ్మగారి మేడమెట్లు ఎక్కేరు.

ఆ సమయానికి ఆవిడ గదిలో మంచంమీద కొడుక్కి పట్టీలు, మర్దనాలు చేయడంలో వుంది. మూడురోజుల క్రితంనుంచీ ఇంటికి రాని రాజు క్లబ్బులో పేకాడి, బాగా తాగి, ఎక్కడెక్కడో తిరిద (!) ఎవర్నో నోటికివచ్చిన బూతులు తిట్టేస్తే వాళ్ళు చితుగా చావగొట్టి కాలవప్రక్కన పారేసేరు. తెలిసినవాళ్ళు 'పాపం' అని ఇంటికి చేర్చేరు.

'నీకెంత ఖర్మ పట్టిందిరా రాజూ'—అని ఆవిడ వాపోతూ కొడుకు శరీరంమీతేలిన ద్దులదరు, రక్తం చిమ్మిన చారికలు చూసుగి

కుంటూ చేతితో నిమురుతూ..కన్నీటి పొరల్లో రెప్పలార్చుకుంటోంది ఎదరింటి కిటికీదగ్గరి పిల్లని కట్టబెట్టిస్తే అదే దారిలోకి తెస్తుంది వీణని నీరసంగా గొణుగుతోంది.

శుభలేఖ చూసింది.

వరలక్ష్మి బి. య్యేను ప్రసాదు ఎమ్.యస్‌సి. కిచ్చి తిరుపతిలో పెళ్ళి! సోఫాలో నీర్సంగా జార్లపడి 'కట్నం ఎంతిస్తున్నారు' అన్నది.

నారాయణరావుగారు నిండుగా నవ్వేరు.

'కట్నం ఏమిటండీ? వాడు మా మేనల్లుడే. పుట్టినప్పట్నుంచి అనుకుంటున్న సంబంధమే! ఆ మధ్య మా అక్కయ్యా వేళాకోళానికి 'ఒరేయ్ ప్రసాదు, ఈ చదువుకున్న కోడలు నాకొద్దురా' అందిట! —'అయితే నేను జన్మంతా బ్రహ్మచారిగ వుండిపోనా?' అన్నాట్ట వీడు. అదంటే వాడికి అంతప్రేమ! అమ్మాయికీ అంతేననుకోండి. ఆఁ! మరి వస్తా. చాలా పనులున్నాయి'—ఆయన మెట్లు దిగి వెళ్ళి పోతూంటే అన్నపూర్ణమ్మగారు కొడుకు మంచం వున్న గదివైపు జాలిగా చూసుకున్నది!



# "సునీతి"

(వనిత మాస పత్రికలో (అప్పుడు పక్షపత్రిక)
ప్రచురితమైన కథ)

ఆరోజు ఆఫీసులో అందరికీ ఆశ్చర్యమే !

సునీతి ఉద్యోగానికి రాజీనామా చేసింది !

ఆఫీసులో ఏవరైనా కొత్త ముఖాలు చేరినా...పాత ముఖాలు పోతున్నా..?అది సంచలనం కలగచేసేదేనన్నమాట !

అయితే...సునీతి విషయంలో మరికొంత విశేషం వుంది!

ఆఫీసులో కొత్త ముఖమే...ఇంకా ఆమెను గురించిన...'శల్య పరీక్షలు' పూర్తి కాలేదు. మిగతా ఉద్యోగులకి! మరీ అంత 'రిజర్వ్‌డ్'గా (మిగతావారి పరిభాషలో కొరుకుడు పడని ఆడది!) ఉండటం...వలన సమాచార సేకరణ కొంత కష్టమే అవుతోంది పావం.

ఈ మధ్య కనకరాజు 'కాజువల్ లీవ్'లన్నీ-ఖర్చు కావటానికి కారణం అదే! నారాయణరావు 'పర్సులో-నీర్సం' పేరుకోడానికి

అదే కారణం. సినిమా హాళ్ళల్లో--సెంటర్‌లో...బస్సుస్టాప్‌లో సునీతికోసం కాపువేయవలసిన డ్యూటీ నారాయణరావుది. ఎందుచేతనంటే నారాయణరావు భార్య పురిటికి వెళ్ళింది. ఇలా పురుళ్ళకి వెళ్ళే సీజన్‌లో ఎవరుంటారో..సదరు భార్య తాలూకు ఖర్చు..ఆఫీసులో మిత్రులసలహా ననుసరించి..'జేబుఖర్చులు' భరించవలసి వస్తుంది.

ఇంకా పెళ్ళికాని కుర్ర బ్రహ్మచారి మోహన్‌రావు-ఉదయ, సాయంకాలాలు-సునీతి ఇంటి అడ్రసు పట్టుకోడమనే తాపత్రయంలో వున్నాడు. అదీ వృథాయే అవుతోంది!

నిజానికి ఈ విషయాలేమీ సునీతికి తెలియివు. ఆర్డర్ కాగితం అందుకుని-ఆఫీసులో చేరింది.

ఉద్యోగంలో చేరిన మొద''రోజు దూరపుచుట్టం ఇంటిలో తిగి పెట్టే బేడాపడేసి-ఆదరాబాదరా ఆఫీసుకు పరిగెట్టింది.

సాయంత్రం ఆఫీసు నుంచి వస్తూ 'తన భావిజీవితం ఎలా గడుస్తుందా? అనీ ఎక్కడైనా ఒకగది దొరికితే బాగుండుననే' ఆలోచనలతో..మెల్లగా చుట్టాలింటిలో అడుగుపెట్టింది..అంతక్రితంవాళ్ళు ఏం మాట్లాడుకున్నారోగానీ, చాలా ముభావంగా-పలకరిస్తే అతుక్కుపోతుందేమోనన్న భయంతో ప్రవర్తించేరు. చుట్టాలిళ్ళకి వెళ్ళి వాళ్ళని నానా ఇబ్బందులపాలు చేయడం విసిగించడం లాంటివే వింటాంగానీ రెండోవైపునుంచి ఆలోచించి వివేకంగా మసలడం మాత్రం ఎందరికి తెలుసును?-ఆ ఇంటి యజమానురాలు పక్కవాటా పిన్నిగారి సలహా ననుసరించి సునీతిని అతి తొందర్లో ఇంటిలోనుంచి పంపే ఏర్పాటులో మొదటి మెట్టుగ-ఆ సాయంత్రమే కాఫీ గ్లాసు అందిస్తూ ''చూడమ్మా, ఆఫీసు చాలా దూరం అనుకుంటాను. రోజూ ఇలా కష్టపడాలంటే ఎలా' అంది.

ప్రశ్నలో అభిమానమూ వుంది... ఆక్షేపణా కలిసింది!!

సునీతికి కాఫీ గ్లాసులో రెండు నలకలు, ఓ చీమ, గ్లాసు అంచు

మీద అట్టకట్టిన మామిడి పండు రసం తాలూకు ఛాయలు కనిపించి 'ఇంటావిడ మన స్తత్వం మాద్వారా తెలుసుకో' అని హెచ్చరించేయి.

అందుకే సునీతి బుర్ర చురుకుగా పనిచేసి 'అమ్మయ్యో! కాఫీ రెండోసారి ఇంత తాగను పిన్నిగారూ! మీరు సగం తీసుకోండి' అని గ్లాసు తిరిగి అందించబోయింది. కాని పిన్నిగారు చాలా ఇబ్బంది పడింది. ఆ కాఫీ స్పెషల్‌గా సునీతి కోసం తయారు చేసింది. డికాక్షన్ గుడ్డ పిడిచి మరీ వంచింది గ్లాసులోకి. తనకి ఆ వాసన గిట్టదు. అందుకని ఓ గ్లాసులోకి సగం పంపి—అక్కడ ఆడుకుంటున్న అఖరబ్బాయిని తాగమంది. కుర్రవెధవ! 'అమ్మ మళ్లీ కాఫీ ఇచ్చిందే' అనుకని గుటుక్కున తాగేసేడు! సునీతి బలవంతాన తాగి 'ఆఫీసు దగ్గరలో గది చూస్తున్నాను పిన్నిగారూ! ఒకటి రెండు రోజుల్లో వెళ్ళిపోవాలి. అనవసరంగా బస్సులకి, రిక్షాలకి దండగ పెట్టటం ఎందుకు? నాల్గు గిన్నెలు, డబ్బాలు తెచ్చాను. ఓ స్టవ్ కొనుక్కుంటే హాయిగా వండుకుని తినవచ్చు. ఆఫీసుకి దగ్గరా ఉండవచ్చును. ఏమంటారు పిన్నిగారూ?' అన్నది కాఫీ గ్లాసు కడుగుతూ.

'అనేందుకేముందమ్మా, దివ్యంగా ఉంటుంది. అయ్యో కాఫీ గ్లాసు అక్కడ పడేయ్. పనిపిల్ల కడుగుతుంది' అన్నది పిన్నిగారు. అప్పటికే సునీతి కడగటం అయిపోయింది.

ఆ రాత్రి సునీతి నిద్రపోలేదు. తెల్లవారితే ఏం చేయాలా అని తెల్లవార్లూ ఆలోచించింది.

అలా ఆ అమ్మాయి ఆలోచిస్తోందనీ, సతమతమవుతోందనీ తెలియని పిన్నిగారు, రెండో ఆట చూసి వచ్చిన మొగుడిగారికి వడ్డిస్తూ, 'అమ్మో మనం ఏమో అనుకున్నాంగానీ ఆ పిల్ల అన్నిటినీ సిద్ధం చేసుకునే వచ్చింది. కట్టుకున్న భర్తని వదిలి ఉద్యోగం మోజులో పడ్డ ఆడది ఆ మాత్రం తెగించదూ? నీతి సూత్రం మర్చి

పోయినదానికి మంగళసూత్రం ఓ అడ్డా?' అన్నది కొంత ధిక్కారం కలిపి.

సునీతి అదిరిపడి ఆ తర్వాత బోర్లా పడుకుని తలగడను తడిపేసుకుని ఆవేదన తీర్చుకుంది.

మర్నాడు ఆఫీసు నుంచి ఇంటికి రాలేదు. ఇల్లుకోసం చుట్టు పక్కల వీధులన్నీ గాలించింది.

ఉద్యోగం కోసం ఇంటర్వ్యూలప్పుడైనా అన్ని ప్రశ్నలు వినాల్సి రాలేదు. ఓ చిన్న గదికోసం సునీతి జీవిత వివరాలన్నీ అడిగేరు ఇంటిగల వాళ్ళందరూ.

'ఒక్కదానివే ఉంటావా?' అని ఓ అనుమానపు ఇల్లాలి అరా!

'మీ ఆయన ఏ ఊళ్ళో ఉంటాడూ?' అన్నాడొక ఇంటి యజమాని.

'ఫలానా ఊరంటున్నావ్! ఏ పేట? ఇంటి పేరు?'—ఆ వరుసతో తనిఖీ చేసిందొక చాదస్తురాలు. సునీతికి ఒళ్ళు మండిపోయింది. అయినా అవసరం తనది! ఆ పైన తనకి అర్జంట్‌గా గది దొరికి తీరాలి. అందుకోసం చచ్చిపోతున్న సహనాన్ని బతిమాలుకుంటూ ఒంట్లో నీర్సాన్ని కసిరిగొడుతూ లేని శాంతాన్ని అరువు తెచ్చుకుని ఆఖరికి జయించింది.

ఏమిటీ!— ఓ చిన్న వంచపాళీ!

ఇంటి అద్దెలమీదే బ్రతుకున్న ఓ బామ్మగారి, కూలిపోతున్న మండువా లోగిట్లో రెండు సంసారపక్ష కుటుంబాలు, మరొక రెండు పిల్లల్ని చదివించుకునేందుకు పట్నం కాపురాలు పెట్టిన కుటుంబాలు మధ్యగా మిగిలిన వరండాలాంటి ఖాళీ ప్రదేశం పూరికే ఉంచేయడం ఇష్టంలేక-బామ్మగారు స్వయంగా వెదురు తడికలు కట్టి, వాటికి

రేగడిమట్టి పూసి వెల్లవేసి గదిలా తయారు చేసింది. దాని అద్దె పన్నెండు రూపాయలు మాత్రమే! పైగా కరెంటు, పంపుకి ఇచ్చుకోవాలి. సునీతిని అట్టే ప్రశ్నలు వేయలేదు.

ఆ గది అద్దెకివ్వడమే ప్రధానం గనుక బామ్మగార్కి సునీతి లాంటి ఒంటి ఆడది నచ్చింది.

తనకి గది దొరకడమే ప్రస్తుత కార్యం అనుకున్న సునీతికి బామ్మగారు తన వివరాలేవీ అడక్కపోవడం మరీ నచ్చింది.

వెంటనే అడ్వాన్సు ఇచ్చేసి, వీధిలోకి వచ్చి చకచకా నడుస్తున్నప్పుడు సునీతికి ఓ అనుమానం, మరొక భయం కలగాపులగంగా చుట్టు ముట్టేయి !

'ఎప్పుడైనా తండ్రి తనని చూడ్డానికి వస్తే ఈ గదిలో ఎలా ఉండగలడు? తమ సొంత ఊళ్లో ఆవుల్ని, గేదెల్ని కట్టే దూళ్ళకొట్టం కూడా బామ్మగారు అద్దెకిచ్చిన నాలుగు కుటుంబాల ఇళ్ళకంటే విశాలంగా ఉంటుంది అయినా నాన్న వచ్చేలోపులో వేరే ఇల్లు చూసుకుంటే సరి'—అని సరిపెట్టుకుని మర్నాడే వచ్చి చేరింది.

నాల్గు రోజులు మామూలుగా...'ప్రపంచం చాలా మంచిదే... మనుష్యులు మరీ మంచివాళ్ళు!'- అనిపించేలాగ గడిచిపోయాయి సునీతికి, ఇంటా బయటా :— ఆ తర్వాతే ..ప్రపంచంలో ఉండే మరొక ప్రపంచం...మనిషిలో ఉండే మరొక మనిషి...కన్పించసాగేరు.

ఆ రోజు ప్రొద్దుటే సునీతి పెరట్లో పంపు దగ్గర కూజాలో నీళ్ళు పట్టుకుంటోంది!...పక్క పాటాలో...చదువుకునే కుర్రాడు.. ప్యాంటు, బనియన్ వేసుకుని పైమీద టవల్ కప్పుకుని...చేతిలో గ్లాస్కుతో...పళ్ళపుగట్టుకు ఓ గజం దూరంలో...నుంచున్నాడు.

సునీతి ఓసారి అతనివైపు చూసి...మళ్ళీ ఇటు తన పని చూసుకో సాగింది!—

"ఏమండీ!" అన్నాడా కుర్రాడు.

"ఏమిటండీ?" అన్నది ఇటు తిరిగి.

"మీరు గ్రాడ్యుయేటా?-అబ్బే వూరికే అడుగుతున్నాను" సంజాయిషీ ఇచ్చుకుంటూ ప్రశ్న అడిగి, వెర్రి వాలుళ్ళా ఓ చిన్న నవ్వు నవ్వి, నుంచున్న ఆ కుర్రాడు అచ్చంగా తమ ఊళ్లో చదువు కుంటున్న తమ్ముళ్ళాగానే అనిపించేడు సునీతి కళ్ళకి.

అందుకే తనూ ఓ చిన్న నవ్వు విసిరి 'మరే! అలానే వుంది సర్టిఫికెట్‌లో!' అన్నది.

"అబ్బో! గడుసుగా చెపుతున్నారే? ఔనూ, ఏ ఆఫీసులో వున్నారు" అన్నాడు.

చెప్పింది—

"ఏ సెక్షన్?"

అదీ చెప్పింది—

"పని ఎక్కువ ఉండదాండీ?"

"ఉద్యోగంలో ఉన్నాక పని ఎక్కువ అనుకుంటే కుదురు తుందా? అయినా ఏదీ, నేనిప్పుడేగదా చేరిందీ, చూడాలి ఎలా ఉంటుందో" అంటూ పంపు కట్టేసి కూజా చేత్తో పట్టుకుని ఓ అడుగు వేసింది ముందుకు.

"అవునులెండి, ఇంకా క్రొత్త గదా! ఐనా ఆడవాళ్ళకి హెవీ వర్కు ఇవ్వరులెండి. మగవాళ్ళకే ఆ బాధలన్నీ; అవునూ, అసలు మీరు జాబులో చేరాల్సిన ఆవసరం చాలా వుందా...అహ, అబ్బే!

అసలు సరదా కోసం చేసే వాళ్ళుంటారు గదండి. అందుకని అడుగుతున్నాను...''

సునీతి ఆ కుర్రాణ్ణి ఓసారి చూసి ''పోనీ అలాగే అనుకోండి'' అన్నది. అని మరి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా గబగబా తన వాటా వైపు నడిచింది.

పదినిముషాలు అవలేదు. అంతే, ఆ కుర్రాడి వాటాలో నుంచి ఆ అబ్బాయి మేనత్తో, పినతల్లో, మరే వరుసో...''ఏరా! అయ్యాయా యోగ క్షేమాలూ! ఆ పిల్లతో నీకేం కబుర్లు? నీ చదువు సంధ్య సంగతి చూసుకోకుండా! పంపు దగ్గర ఆ భాగోతమేమిటీ! ఏదో వండి పెట్టున్నందుకు నా మాట దక్కించి, నీ చదువు గట్టెక్కించుకో ఆ తర్వాత ఉద్యోగం వచ్చాక నువ్వెన్ని వేషాలు వేసినా ఇబ్బంది లేదు'' అని మందలింపు వినిపించింది

కుర్రాడి జవాబు వినాలనిపించలేదు సునీతికి. సాటి ఆడది! ఎంత తొందరగా మాట విసిరిందా—అని చివుక్కుమన్నది మనస్సు! కొన్ని పదాల్లో కొరడా దెబ్బలంత చురుకు ఉంటుంది.

అదే నోరు మంచిగలవాళ్ల మాటల్లో నోట్ల కట్టలు మూట కట్టిచ్చినంత ఊరట దొరుకుతుంది. ఉద్యోగం వచ్చాక ఎన్ని వేషాలైనా వెయ్య వచ్చునా? ఎవరూ? మగవాడా? ఏం ఆడది వెయ్యకూడదా?? నాతో మాట్లాడితే భాగోతమా అంత చులకన చేయాల్సిన అవసరం ఏమిటి ఆవిడకి చెప్తాను తనేమిటో, తన పరువు ఏమిటో! సమయం వచ్చినప్పుడు చెప్పాలి!—అనుకుంటూ గబగబ పనులు ముగించుకుని ఆఫీసుకు వెళ్ళి పోయింది.

ఆఫీసులో...

ఎవరి సీట్లలో వాళ్ళు అతుక్కుపోయినట్టు కూర్చున్నారు! ఓరగా కోరగా మధ్య మధ్య వెకిలిగా చూపులు విసురుతూ! చకచకా పనులు చేస్తున్నారు! చేస్తున్నట్టు నటిస్తూ వున్నారు. సునీతికి ఆఫీసర్ గారి పిలుపు

వచ్చింది. లేచి వెళ్లింది మళ్లీ తిరిగి వచ్చేటప్పటికి—కనకరాజు మోహన్‌రావుకేదో చెప్తూ కన్ను గీటేడు!

నారాణరావు నవ్వుతున్నాడు.

సునీతిని చూసి... సర్దుకుని కూర్చున్నాడు! మౌనంగా తన సీటు దగ్గరికి వెళ్ళిపోయింది. లంచ్ అవర్‌లో మోహన్‌రావు అడిగేడు. 'సునీతిగారూ! మీరు వచ్చి అప్పుడే వారం రోజులు కావస్తోంది. మరి మాకందరికీ స్వీట్సైనా పోయలేదు. అన్యాయం కదండీ?— పోనీ ఈ రోజు మా నోర్లు కాస్త తియ్యబరచకూడదూ?''— అన్నాడు చొరవగా.

సునీతికి నిజమే ననిపించింది!— 'అలాగే' అంది.

కాంటీన్ వైపు నడిచేరు అందరూ ఆడవాళ్ళలో సునీతి, మరియమ్మ ప్రిట్రోషియా అనే ఆంగ్లో ఇండియన్, యామినీ అనే ఓ పాతికేళ్ళ పడుచు వున్నారు. మరియమ్మ నలభై ఏళ్లంది అందర్నీ 'బిడ్డా' అనే పిలిచేది. ప్రిట్రోషియా ఎప్పుడూ పెట్రొమాక్స్ లైట్లా చిరునవ్వులు చిందిస్తూ, మగ, ఆడ భేదం లేకుండా అందర్నీ సమానంగానే పల్కరించేది! యామినీని చూస్తే...పాపం మగవాళ్లే కాస్తగా జంకినట్టు వెనక్కి తగ్గేవారు జుట్టూ, శరీరం ఒకే రంగులో నిగనిగ లాడేవి!!—ఒక్క సునీతే కాస్త కంటికింపుగ... అందరాని పండులా కన్పించింది! అందుకే ఆరాటం.

కాంటీన్‌లో కావాలని మోహన్‌రావు సునీతికి ఎదురుగ నుంచుని సీటు లేనట్టు టిఫిన్ తింటూన్నాడు. ''ఇవాళ సునీతిగారి పర్సు ఖాళీ చేయిస్తావేంట్రా? చాల్లే నీ అగ్గర్లు!'' అన్నాడు నారాయణ రావు—గులాబ్ జామ్ ప్లేటు ఆశగా అందుకుంటూ.

'వెధవ జోకులు వెయ్యకండి నారాయణరావుగారూ! సునీతిగారి పర్సుఖాళీ అవుతుందనా లేక, నా తిండి మీదా మీ విసురు?' అన్నాడు.

అని 'కావలిస్తే మీరూ తెప్పించుకు తినండి! సునీతిగారు ఇవ్వలేకపోతే నేనిస్తా బిల్లు' -అని కూడా అన్నాడు.

'మంచివారే! మీరు ఇవ్వటమేమిటీ... ఈ రోజు ఎంత బిల్లు అయినా నేనివ్వాల్సిందే.' అన్నది సునీతి, మంచి మనసుతో-

'అదీ అలా అనండి! మా నారాయణరావుగారు ఎప్పుడు కాంటీన్ కొచ్చినా నా తిండి మీద ఏడ్చి బిల్లు దగ్గర పేచీలే పెట్టారు. ఇంక ఈ దెబ్బతో ఆయన ఆట కట్టు!' అన్నాడు మోహన్‌రావు సగం నారాయణ రావుని చూస్తూ, సగం సునీతిని చూస్తూ.

సునీతి నవ్వి వూరుకుంది.

మిగతా వాళ్లు అంతగా పట్టించుకోలేదు.

బిల్లు పాతికరూపాయలు సునీతి ఇచ్చేసింది.

కనకరాజు, నారాయణరావు ఓసారి భుజాలెగర వేసుకుని ముఖాలు చూసుకుని వంకరగా నవ్వుకుని ఆ పైన 'పాపం!' అనుకున్నారు,

పాతిక రూపాయలు ఖర్చు పెట్టేస్తే ఇల్లు గడవడం ఎంత కష్టమో!...గొప్పకి పెట్టేసింది- అనుకున్నారు. అయినా అవసరం అనుకున్నప్పుడు మనం అలాగే పెట్టాం గదా...అడదైనా వెనకాడకుండా పెట్టింది! ఫర్వాలేదు దారిలోకొస్తోంది:' అనుకున్నారు. ఆ రోజు సాయంకాలం ఆఫీసు బయటికి వస్తున్నప్పుడు మరొక సెక్షన్‌లో వుండే సత్యనారాయణ, మోహన్‌రావు భుజం చరిచి 'అదృష్టం నీది! జాగ్రత్తగా వుంటే డబ్బుకి యిబ్బంది పడక్కర్లేదు. ఇందాక మన 'ఎర్రతేలు' నాకు ఊదేసింది! పాతికరూపాయలు బిల్లు ఇవ్వగల్గింది అంటే మరింకేమీ అనుమాన పడక్కర్లేదు! అంటూ చిన్నగా చెప్తున్న మాటలు సునీతి చెవుల్లో పడ్డాయి. ఉలిక్కిపడింది.

ఎర్రతేలంటే ప్రిట్రోషియా అన్నమాట— అనుకున్నది.

తను మామూలుగా, సరదాగా చేసిన పనికి వీళ్ళంతా గోతులు తవ్వుతారనీ తన్ను-'నిలువెత్తు నీతి నుంచి బయటపడి స్వేచ్ఛా విహారం చేస్తున్న చవకబారు ఆడదానిగా'- అంచనా వేస్తారనీ అనుకోలేదు. ప్రొద్దుట ఇంటి దగ్గర సాటి ఆడదీ అలాగే వాగింది: ఇప్పుడు వీళ్ళు అలాగే కూస్తున్నారు! 'ఛీ వెధవ మనుష్యులు' అనుకుంది!

అలాంటి వెధవమనుష్యులు ప్రపంచం అంతటా వుంటారు. ఆఫీసుల్లోనే గాదు. స్కూళ్ళల్లోనూ, కంపెనీల్లోనూ, గవర్నమెంటు ఉద్యోగస్థుల్లో, ప్రైవేటు జాబుల్లో, ఏ పనీ లేని అమ్మలక్కల్లో అన్ని పనులూ వున్నట్టుండే సొసైటీ లేడీస్‌లో ఇంటిలో, వీధిలో అన్నిటా మంచి మనసున్న వాళ్ళ ప్రక్క 'ఈ వెధవ మనుష్యులూ' వుంటారు; నిజంగావాళ్ళుండబట్టే ఇన్నేసి కథలు, జీవితాలు బయటపడుతున్నాయి, -లేకపోతే 'రామరాజ్యం'లా వుంటే ప్రజలకి కాలక్షేపం ఏదీ?! రామాయణంలో రామచంద్రమూర్తి పట్టాభిషేకం తర్వాత 'చాకలి కూతకి' మళ్ళీ కథ ముందుకు సాగలేదూ? ఇకపోతే అడవుల్లో 'వనవాసం అజ్ఞాతవాసం' పూర్తి చేసుకుని వస్తే కథ అంత రక్తి కట్టేదా?— లక్ష్మణస్వామి మూడు గీతలు గీసి 'దాటి రాకు వదినమ్మా' - అంటే సీతాదేవి దాటే వచ్చింది నిజానికి ఇవిడ ధర్మం చేయాలనే సత్సంకల్పంతోటే వచ్చింది. అయినా అనర్థమే ఎందుకు జరగాలి?—బహుశా ముందు తరాలవారికి బోధచేసేలా వుండాలనా? అయితే రావణాసురుడు మాటో? ధర్మం చేయబోతున్న సీతమ్మని ఎత్తుకు వెళ్ళి సర్వనాశనం అయాడు గదా?-మరి అది 'విలన్' లాంటి వాళ్ళకి కనువిప్పు కల్గించదేం? నీతి సూత్రం ఆడదానికేనా? మగవాడికి వర్తించదా?

కాలంమారింది! యుగం మారింది!

కట్టుబాట్లు ఆచార వ్యవహారాలూ మారేయి ఒకనాడు 'స్త్రీ ధనం' వాడితే అధర్మం అన్నవాళ్ళు, ఈ నాడు స్త్రీ ధనమే ఆధారం అనుకుంటున్నారు. అయినా సినిమాల్లో, కథల్లో మాత్రమే చూడగగ్గే 'ధర్మమేజయిస్తుంది' అన్న ముగింపు నిత్యజీవితాల్లో మాత్రం హాస్యాస్పదంగా నిలిచిపోతోంది!

ఆడదానికెప్పుడూ రక్షణ లేదు. ఆవిడకి స్వేచ్ఛ లేదు. ఆమెను నిల్చోబెట్టి, చుట్టూ నిలువెత్తున నీతి సూత్రాలు పాతి, దాటి బయటికి వస్తే 'చెడిన ఆడ'దని అచ్చుగుద్దుతారు.

అందుకే సునీతి, 'తనపేరులోనే 'నీతి'ని నిల్పి అమ్మా. నాన్న చిన్నప్పట్నుంచీ తనని బంధించేరా?' అనుకుని వెర్రిగా నవ్వుకుంది. అది ఎప్పుడూ అంటే-కథా గమనంలో... ఆఫీసులో కొలీగ్స్ వ్యంగ్య ధోరణి విన్నాక సునీతి చాలా రిజర్వ్‌డ్‌గా జాగ్రత్తగా వుండటం మొదలుపెట్టింది.

మోహన్‌రావువాళ్లు శతవిధాల ఆమెను సన్నిహితం చేసుకోవాలని ప్రయత్నిస్తూనే వున్నారు. అప్పుడప్పుడు అసభ్య ధోరణికూడా చూపబోయేవు. భరిస్తూనేవుంది. అది అలా వుండగా—

ఇంటి దగ్గర ఓ ఆదివారంనాడు ఇంటి యజమానురాలు, పక్క వాటా ఇల్లాలు, చదువుకునే కుర్రాడి మేనత్తా కలిసి మ్యాట్నీకి వెళ్ళారు అవతలప్రక్క వాటాలోని గృహిణి-అర్జంట్ రాచకార్యం మీద పక్క ఊరు చుట్టాలింటికి వెళ్ళింది. ఇంటి మొత్తంమీద సునీతి తప్ప ఆడ పురుగులేదు. మగవాళ్ళూ. కాలేజీ కుర్రాళ్ళూ ఓ వాటాలో చేరి పేకాట మొదలుపెట్టేరు. ఆడుకోవడం తప్పుకాదు. ఆడుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఎంజాయ్' చేయడం అంతకన్నా తప్పుకాదు. ఆ కబుర్లు పరాయివాళ్ళపైన చెప్పుకున్నా బాధలేదు. కానీ ఆ కబుర్లు పక్కవాటలో ఒంటరిగా వున్న ఆడకూతుర్ని గురించి... అదీ ఆమెకు వినిపిస్తుందని తెలిసీ— చెప్పుకోవడం ఎలా భరించడం? తడికెల గదిలో తుంగచాపమీద పడుకుని నవల చదువుకుంటున్న సునీతిని రకరకాలుగా వర్ణించుకుంటూ. విమర్శించుకుంటూ జోరుగా పేకాట ఆడుకుంటున్నారు మగమహారాజులు!

పది నిముషాలు, పావుగంటసేపు విన్నది. సహించింది. ఇంకా అసహ్యంగా అసభ్యంగా, 'రేపెంతో కనుక్కుందామా?' అనేసరికి,

తోక తొక్కిన తాచులా పుస్తకం విసిరికొట్టి లేచి నుంచుంది. విసురుగా తలుపు తీసుకుని బయటికి వచ్చి, వాళ్ళ గుమ్మం దగ్గర నిలబడి 'చూడండీ—' అని అరిచింది.

అరడజను మంది మగవాళ్ళూ ఒక్కసారి ఉలిక్కిపడి ఆట ఆపేసి చూసేరు! అపరకాళిలా గుమ్మంలో నిల్చున్న సునీతిని చూచి అదిరిపోయారు!

'మీరిందాకట్నుంచి ఏదో వాగుతున్నారు. అందుకేవచ్చాను. నారేటెంతో...మీ ఆడవాళ్ళ నడగండి చెప్తారు. ఎందుకంటే వాళ్ళకు అనుభవాలుంటాయి గదా? అందుకని చెప్పి నిర్ణయిస్తారు!' అనేసరికి-

'నోర్ముయ్!' అన్నాయి నాలుగు మగ కంఠాలు కోపంగా.

గట్టిగా నవ్వి, 'అదేం? మీవాళ్ళు చెప్పరా?' అన్నది.

'నీకు వాళ్ళకీ పోలికా? సంసారం చేసుకునే ఆడవాళ్ళకి, నీలా ఒంటరి ఆడదానికీ తేడా లేదూ?' అన్నాడొక పౌరుషవంతుడు.

'ఉంది: ఉంది: చాలా వుంది: మగవాడు చాటు వుంటే ఆడదానికి కావల్సినంత నీతి అండగా వుంటుంది. లేకపోతే ఇలాగే అడ్డమైన వెధవలకి అలుసు అవుతుంది. పోనీ మీలో ఎవరైనా నాకు అండగా నిలుస్తారా? నా జీతం మూడు వందలు. కాక నాపేర రెండెకరాల పొలం వున్నది. మా వూళ్ళో నా వాటా డాబాఇల్లువుంది అమ్మితే పదివేలు వస్తుంది. బాంకులో నా నగలు ఆరువేల ఖరీదువి దాచేను. మా నాన్న మామిడి తోటలో నగం రాసిస్తానన్నాడు. అన్నీ కలిపితే యాభై వేల ఆస్తికి వారసురాల్ని: గవర్నమెంటు ఉద్యోగస్థురాల్ని! ఎవరైనా సరే- ముందుకువచ్చి న్యాయసమ్మతంగా నన్నుపెళ్ళి చేసుకుంటే సంతోషిస్తాను. చెప్పండి మీలో ఎవరికైనా ఆ ధైర్యం, మానవత్వం వుందా? నాకు ఇంతకు మునుపు అయిన పెళ్ళి రద్దు చేసుకుని ముందుకువస్తాను!'

ఆరుగురు ఇంకా తేరుకుని జవాబు చెప్పేలోపల మ్యాట్నీకి

వెళ్ళిన బామ్మగారు, మిగిలిన ఇద్దరు ఆడాళ్ళు టికెట్ దొరకలేదని వచ్చేసేరు.

తడికెచాటు నుంచి సునీతి, ఇలా మగాళ్ళు పేకాట ఆడుకుంటున్న గది ముందు నిల్చుని సవాల్ చేస్తున్న దృశ్యం కంటబడేసరికి -ఇంకేముందీ? కొంపలంటుకుని పొగలు, సెగలు, హాహాకారాలు అంతెత్తున లేచిపడ్డాయి.

'మగవాళ్ళు ఎన్నో అనుకుంటారు. ఆడది ఎదురుపడి నిలేస్తుందా?'-'అంత ఆస్తివుంటే, ఈ ఉద్యోగమెందుకు?'-'మొదటి పెళ్ళి కాదనడానికి రెండో పెళ్ళి అడ్డా?'-'నీతి లేని ఆడదానికి ఇక్కడ సంసారాలు చేసే చోట చోటు లేదు' పొమ్మన్నారు. 'నీలాంటి ఆడదానికి ఇలాంటి తడికేల గది సరిపడదు. సిమెంట్ కాంక్రీటు చేసిన గదిలో తాళం కప్ప వేసి వుంచాలనీ... ఆఫీసులో ఈ సవాళ్ళన్నీ వేయక పోయావా అనీ...నోటికి వచ్చినన్ని దులిపేసు. ఆడవాళ్ళు.

మగవాళ్ళు పేకాట కట్టిపెట్టి, ఎవరి వాటాలోకి వాళ్ళు జారుకుని 'పాపం! పోనీలెండి. ఆ పిల్ల తెలియక ఏదో వాగింది. ఊరుకోండి యిక!' అన్నట్టు చూడసాగేరు.

సునీతి చెప్పే నిజాన్ని ఎవరూ వినలేదు!

ఆ రాత్రి సునీతి చాప మీద బోర్లా పడుకొని- కరువుతీరా ఏడ్చింది.

'తను యాభై వేల రూపాయలకి హక్కుదారు, నిజమే! కానీ ఎప్పుడూ? తనూ భర్తా కోర్టు ద్వారా విడాకులు పుచ్చుకుంటే, తనకి మనోవర్తి క్రింద అవన్నీ ఇస్తారు. కానీ తనకి కోర్టుకెక్కడం ఇష్టం లేక, తనకున్న బి.య్యే. సర్టిఫికెట్‌తో తన బ్రతుకు తను బ్రతుకుదామని వచ్చింది. ప్రపంచంలో మంచి! మానవత్వం ఇంకా వున్నాయనుకుని వచ్చింది: న్యాయం, ధర్మం పచ్చగా బాగున్నాయనుకుని

వచ్చింది. పురాణకాలం కాదు కనుక నీతి సూత్రం మగవాళ్ళకి, ఆడ వాళ్ళకి సమానమే అనుకుని వచ్చింది.

'కానీ సమాన హక్కులు అన్నింటిలో కాదనీ, ఆడదెప్పుడూ ప్రగతి సాధించలేదనీ తెలుసుకుని- ఒంటరిగా ఆడది ఉద్యోగం చేసుకుంటూ ప్రశాంతంగా జీవించడం ఈ యుగంలో కాదు కాబోలు— అనుకొని-ఉద్యోగం వదిలేసి వెనక్కి వెళ్ళి పోవడానికి నిశ్చయించుకున్నది.

ఒకవేళ విడాకులు తీసుకుని ఆస్తి దక్కించుకుని బ్రతుకుదామన్నా- అప్పుడు మాత్రం ఒంటరి ఆడది కాదా?—

అందుకని ఉద్యోగం, ఆస్తి రెండూ వద్దని- భర్తతో కాపురం చేయడానికే నిర్ణయించుకుంది-

ఇంతకీ ఆభర్త సంసారానికి అనర్హుడు:

ఆ విషయం డాక్టర్లు ఋజువు చేశారు.

కోర్టు విడాకులు తీసుకోవడానికి అనుమతిచ్చింది. కానీ సునీతి ఆ భర్తతో కాపురం చేయడానికీ, చేస్తున్నట్టు నటించడానికీ, తన్ను వంచించుకుంటూ బ్రతకడానికి దృఢపరుచుకుని—ఆ రాత్రి నిద్దరపోయింది.

మర్నాడు—

ఆఫీసులో అందరికీ ఆశ్చర్యమే!

సునీతి రాజీనామా చేసింది.

కనకరాజు, నారాయణరావు, మోహన్‌రావు- ఇంకా 'శల్య పరీక్షలు' పూర్తి చేసుకోక ముందే సునీతి రైల్లో కూర్చుంది.

రైల్లో, కిటికీ దగ్గర పమిట నిండుగా కప్పుకొని కూర్చున్న సునీతి-దూరంగా మైదానంలో జరుగుతున్న సభలు...బోర్డులు చూసి విరక్తిగా నవ్వుకుంటూ-'ఈ ప్రయత్నాలన్నీ మళ్ళీ యుగానికి పునాదులు' అనుకుంటూ ముఖం తిప్పుకుని, కన్నీరు తుడుచుకుంది. ✳

# "అందమైన సాయంత్రాలు"

(వనిత మాస పత్రికలో ప్రచురితమైన కథ (అప్పట్లో పక్షపత్రిక)
ఈ కథని కన్నడ వనితలోకి అనువదించారు)

మనోరమ మనస్సు ఆ సాయంత్రం చాలా ఉల్లాసంగా వుంది! ఆ పిల్లకి ఆ సాయంత్రం చాలా చాలా అందంగా వుంది!

అన్ని సాయంత్రాలూ అలా వుండవు! ఆ రోజు 'పాణి' ఊరి నుంచి వచ్చాడు. వారంరోజులై వూళ్ళో లేడు. పాణి వూళ్ళో వుండి అతని గదికి తాళం లేకపోతే - మనోరమ మనస్సు చాలా ఉల్లాసంగా ఆ సాయంత్రం చాలా అందంగా వుంటుంది.

నిజానికి ఆవేళప్పుడు...ఉదయం పది గంటలకి గూడు వదలి వెళ్ళిన ఆఫీసు పక్షులు ఇల్లు చేరుకుంటూ వుంటారు; అదృష్టవంతులు వినోదాలకి, విలాసాలకి బయటికి వచ్చే తరుణం ఆ సమయంలో పుట్టు దరిద్రులు కొందరు నిట్టూర్పులు వదులుతూ వుంటారు జారిపోతున్న తమ 'వరువం' తల్చుకుని:

అన్నిరకాలైన మనుష్యుల్ని జీర్ణించుకుంటున్న కొండ చిలువలాంటి ఆ

వీధిలో మనోరమలాంటి మనస్సుగల వాళ్ళు చాలామంది వున్నారు. ఆ ఇల్లు 'పూరి గుడిసే'! కానీ...

పెద్ద భవంతి కాదు.

సరిగ్గా చెప్పాలంటే—

పైకి ఎక్కలేక క్రిందకి దిగలేక నవ్వుతున్నట్టు నటిస్తూ ఏడ్చు కుంటున్న మధ్యతరగతి జీవితాలకి ప్రతీకలా వున్న పెద్ద మండువా లోగిలి! రెండేసి గదుల వాటాల్లో ఏడేసి మంది చొప్పున 'వామన్న గుంట' లాడుకుంటున్నట్టున్న కుటుంబాలు ఆరున్నాయి ఆలోగిల్లో!!

వీధి అరుగుమీద వున్న గదిలో హాయిగా మహారాజులావున్న 'పాణి' మనోరమ దృష్టిలో 'హీరో!'—

ఆ రోజు సాయంత్రం పాణి తన గదిలో కిటికీ దగ్గర నుంచుని అద్దంలో చూసుకుంటూ వాసననూనె పులుముకున్న ఉంగరాలజుట్టును జాగ్రత్తగా దువ్వుకుంటున్నాడు. ఆ ఊరికి క్రొత్తగా బదిలీ అయివచ్చినా ఉద్యోగానికి పాతే!

గత మూడునెలలుగా పాణిని చూసినవాళ్ళందరు 'అతనికేం? మూడువందల యాభై రూపాయల జీతం బాదరబందీలు లేనివాడు-మహారాజులా వున్నాడు'—అనే తలపుతో చూస్తారు

నిజమే మరి!

ఆ వాటాల్లో వున్నవాళ్ళల్లో ఏ ఒక్కడూ పాణిలా లేరు అంద చందాల మాట అటుంచి పాతికేళ్ళ వయస్సులో అంత నిర్విచారంగా వున్న జీవి లేనేలేడు!!

అందుకే మగవాళ్ళందరికీ జెలసీ!

ఆడపిల్లకీ-ఆడపిల్లలు గల తల్లులకీ-ఏదో తెలియని అపేక్ష!!

తల దువ్వడం పూర్తికాగానే అద్దం చేతిలోకి తీసుకుని పౌడను

చూసుకున్నాడు. ఆ తర్వాత టకప్ సరిగా ఉందో లేదో చూసుకుని చేయి పైకి ఎత్తి అద్దాన్ని పైకి పట్టుకుని తన ప్రతిబింబం అపాదమస్తకం ఒక్కసారి చూసుకుని అద్దాన్ని కిటికీలో పెట్టేసేడు.

అదంతా అరుగుమీద నుంచుని ఓరకంట కనిపెట్టి చూస్తూనే వుంది. మనోరమ ఇంటిముందు గేదెని నిల్పి పాలు పిండుతున్నాడు, పాల వెంకడు.

నిజాయితీ మరీ చిక్కనైతే అరగదని వెంకడు పాలు పితుకుతూనే నీళ్ళు కలిపేస్తున్నాడు.

మనోరమకి ఆ సంవత్సరమే పదిహేడునిండాయి. పాలవాడిని, పనిమనిషిని, చూడాలనే కన్నా పాణిలాంటి కుర్రాణ్ణి ఊహాల్లో నిలువుకుని గాల్లో తేలిపోయే తపన ఎక్కువగా వుంది: ఆ పిల్లకి చుట్టు పట్ల ఏం జరిగినా అక్కర్లేదన్నంత పరాకుఉంది.

పాణి ఎంత బాగుంటాడు పాతికేళ్ళువున్నా తన కన్నా ఏడేళ్ళగా పెద్ద? అదొక లెక్కా? అమ్మకి నాన్నకి పన్నెండేళ్ళ తేడా వుందిట పాణికి నేనంటే ఇష్టమే కాబోలు చిరునవ్వుతోటే చూస్తాడు-బాగా నచ్చితే అంటే నన్ను ప్రేమిస్తే కట్నం లేకుండా పెళ్ళాడేయగలడు. అతనికేం జీతం వుంది' అందం వుంది, ధైర్యం వుంది. తండ్రి అడ్డు పడినా త్రోసి పారేయగలడు అయినా అసలు తండ్రి వుండి వుండడు, ఏ మేనమామో పినతండ్రో ముసలి తల్లో...వుండి ఆస్థిని కాపాడుతూ 'నీ కిష్టమైన పిల్లని పెళ్ళి చేసుకుని వస్తే... నా బాధ్యత తీరుతుందిరా' అంటారు. తనెన్ని కథల్లో చదవలేదూ.

'అదేమిట్రా అబ్బాయ్? నీళ్ళు కలిపేస్తున్నావా? అయ్యో నీ అన్యాయం మండిపోనూ? మరీ ఇంత దారుణమా?' అని అప్పుడే ఇంటిలోంచి వస్తున్న ప్రక్క వాటా జానికమ్మ కంచు కంఠం ఖంగ్ మనేటప్పటికి ఉలిక్కి పడింది మనోరమ.

'అదేటమ్మా మనోరమా? ఇక్కడే ఉండి చూపటం లేదూ' అని ఓ నిష్ఠురపు చూపు విసిరేసింది.

'చూడక పోవటమేమిటీ? చూస్తూనే వున్నాను. కాస్త రెప్ప కొట్టానేమో అంతే ఆ కాస్తలోనే వాడా పని చేస్తాడని నాకేం తెల్సు' ఉలికిపాటును కప్పి పుచ్చుకుంటూ దబాయింపుగా అన్నది. మనోరమ.

'అ ఆ అదేంటి బుల్లెమ్మాయిగోరూ. మీరు కూడా అట్టాగనే స్తారూ?' అన్నాడు— ధర్మంకోసమే బ్రతుకుతున్న అపరార పురుష శ్శాగ వెంకడు.

'అదిగో బుల్లెమ్మగోరూ చిట్టెమ్మగోరూ— అనొద్దని ఎన్నిసార్లు చెప్పాను? నేనింకా చిన్న పాపాయినా?' కస్సుమన్నది.

పాణి వీధి అరుగు మీదకి వచ్చి గదికి తాళం వేస్తున్నాడు. అతడి ముందు తన చిన్న పిల్లలా మిగిలిపోకూడదని కోపం!

'సర్లెండమ్మా! పెద్దమ్మాయిగోరే లెండి! మనోరమగోరంటాను!' అంటూ పాలచెంబులో బుడగల్లా గుబురు మీసాల చాటున గురగుర నవ్వేడు.

మనోరమ కాపలా కాస్తే వెంకడి పాల వ్యాపారం దివ్యంగా సాగుతుంది. ఆ సంగతి వాడికి తెల్సు కనుకనే మనోరమని 'మంచి పిల్ల'గా పొగడ్తుంటాడు.

పాణి వీధి మెట్లు దిగుతూ చిన్నగా నవ్వినట్టు అనుమానం కల్గింది మనోరమకి! 'సరిగ్గా ఆ నవ్వే... 'ఫలానా' సినిమాలో కారున్న గొప్పింటి పిల్లాడు బీదపిల్లని మనసారా ప్రేమించి నవ్వేడు. అదేదో కథలో ఆదర్శవంతుడైన యువకుడు నయాపైసా తీసుకోకుండా సామాన్యుల పిల్లని పెళ్ళి చేసుకుందుకు ఒప్పుకుని చిరునవ్వు నవ్వేట్ట, సరిగ్గా ఇలాంటి నవ్వే అయ్యుంటుంది.

"అదేంటమ్మా? గిన్నె సరిగా పట్టుకోండి! పాలు ఎట్లాపొయ్యాలి?" వెంకడు పాలు పోస్తున్నట్టుకూడా గమనించలేక పోయింది.

మిగిలిన నాల్గు వాటాల్లో వాళ్ళు జానికమ్మ గారితో పాటు పోయించుకున్నారు. పాణి వీధి మలుపు తిరుగుతూ వుంటే ఆ పిల్ల దృష్టి అటే వుండిపోయింది.

ఆ మర్నాడు సాయంత్రం జానకమ్మగారు వెంకడు వచ్చే వేళకి తనే ముందు గిన్నె పుచ్చుకుని వచ్చింది!

కన్నెపిల్ల మనసు కలల్లో ఉంటే పాలల్లో నీళ్ళు కలిపి, వెంకడి వ్యాపారం బాగుపడవచ్చు గానీ జానికమ్మకేం జరుగుతుందీ, చాలి చాలనీ జీతం రాళ్ళతో తీరితీరని ఆశలతో ఆరువాటాలున్న మండువా లోగిట్లో గుట్టుగా జీవితం వెళ్ళబుచ్చుతున్న జానికమ్మకి—మనోరమని నమ్ముకోడం ఇష్టంలేక-పనులన్నీ గబగబా ముగించుకుని వెంకడు వచ్చే వేళకి అరుగు మీదకి చేరింది:

''అమ్మా మనూ! పాలు చూడ్డానికి జానికమ్మత్తయ్య వెళ్లారు గనుక-ఈ కాస్త బియ్యం కడిగియ్యమ్మా"-అని తల్లి పని పురమాయించటంతో, మనోరమ కన్నెమనసు గింగిల లాడిపోయింది. మల్లె రెక్కలాంటి తెల్ల వాయిల్ ఓణీ వేసుకుని, నల్ల లేసున్న గులాబి పూల పరికిణీ కట్టుకుని, మల్లు జాకెట్టు తొడుగుకుని-జానెడు పొడుగు మల్లెదండ తల్లో తురుముకున్నది;

పాలవాడొచ్చే వేళకి-పాణి గదిలో 'మేకప్' అయ్యే వేళకి-తను వీధి అరుగుమీద నిల్చోవాలని ఎంతో ఆరాటపడింది.

తీరా ఆ జానికమ్మ పానకంలో పుడకలా తయారైంది,

అసలు ఆ రోజు చదివిన నవలలో-ఉత్తేజం, ఉత్సాహం పొంగి వున్నాయి. కాలేజీలో తన క్లాసుమేట్సు ఆ పుస్తకం కావాలని ఎంతలా మీద పడ్డా, తను పూర్తిగా చదివితేగాని ఇవ్వలేదు. ఎంత రసవత్తర

మైన సంఘటనలో! తనకి నవల చదువుతున్నట్టు అనిపించనేలేదు. తను హిరోయిన్ అయితే పాణి హిరో—మధ్య తరగతి కుటుంబంలో కష్టాలు, కలతలు చూడలేని—దయార్ద్ర హృదయుడు పాణి - బోలెడు ఆస్తి, లంకంత మేడ, వినయవిధేయతలు గల సేవకులు ఉండే ఉంటారు. అయితేనేం? ఏ శకుని మామలాంటివాడో తమ పిల్లనిచ్చి చేసి ఆస్తి కాజేద్దామనే ఉద్దేశంతో కాపువేసి వుంటారు. అలాంటిపిల్లా వాళ్ళ పెద్దల గుణాలూ, నచ్చక ఇలా ఈ రూములో ఉద్యోగం చేసు కుంటున్నాడు. ఆ తరవాత తన చూపులు కలిపి-మనసులు నిలిపి ఒకటైపోయే తరుణం వస్తుంది గదా—

'ఛీ! వెధవ బియ్యం ఎర్రగా కంకర రాళ్ళలా వున్నాయి. కడుగుతూఉంటే చేతులు నొప్పి పుట్టేస్తున్నాయి. చవకగదా అని నాన్న ఈ బియ్యం తెచ్చి పడేస్తారు. ఈ బియ్యం అన్నమూ టేమిటీ? చవకగా వున్న ఏ వస్తువైనా కొంటారు. కట్నం తక్కువైతే పెళ్ళి కొడుకు ఎలా వున్నా కొనేస్తారు. అందుకే తనకి భయం వేస్తోంది. ఈ మధ్య అస్తమానం అమ్మా-నాన్న పెళ్ళి సంబంధాల విషయమే మాట్లాడుకుంటున్నారు. ఏ చౌక డిపోలో వస్తువులాగో ఓ పెళ్ళి కొడుకుని లాక్కొచ్చి నన్ను వెంటిచ్చి పంపేస్తారు కాబోలు. అప్పుడు తను ఏడ్చి ఎదురు తిరిగినా, నాన్న ఊరుకోడు. తన పేదరికం, బాధలు, బాధ్యతలు చెప్పుకొచ్చి ఈ పెళ్లికెలాగైనా ఒప్పుకొని తన పరువు కాపాడమంటాడు. అప్పుడు పాణి ఏం చేసాడూ?" అనే ఊహ కలిగేసరికి బియ్యం గిన్నె వంటింట్లో వడేసి పాలగిన్నె చేత పట్టుకుని అరుగుమీదికి వచ్చింది.

ఛ! ఛ! పాణి గదికి తాళం వుంది! అతను వీధిలో మూల మలుపు దగ్గర వున్నాడు. వెంకడు పాలుపోస్తున్నాడు అందరికీ! ఆ రోజు వెంకడికీ బాధగానే వుంది. ఒక్క చుక్క నీళ్ళు కలపకుండా కాపలా కాసింది జానికమ్మ. ఆవిడ పైన వాడికి మహా గుర్రుగా ఉంది.

మనోరమ చాలా కోపంగా వుంది! 'అసలు ఈ మధ్య జానికమ్మని చూస్తే అరికాలి మంట నెత్తికి వస్తోంది; ప్రతి విషయానికీ ఆవిడ జాగ్రత్త నేర్పుకుంది. పాలల్లో నాల్గు నీళ్ళ చుక్కలు కలిస్తే ఇంతట్లో ఈవిడ కట్టబోతున్న మేడ ఒరిగిపోతుందా? వెధవ కావలా కాయక పోతేనేం? పాపం పాణి ఎంతలా చూసి ఉంటాడో తనకోసం? మౌనంగా అతను చూసే చూపులో శతకోటి అర్థాలు, అనంతకోటి రాయబారాలు తనకి అందజేస్తాడు. పద్దెనిమిదేళ్ళ కన్యకి తెలియవూ?-తనకోసం అతను ఎంతగా కళ్ళతో వెతుకుతాడో కూడా తెలుసు. ఒక్క క్షణం తన రాక ఆలస్యం అయితే ఆ కళ్ళల్లో ఎంత గుబులు నింపుకుంటాడో?-కాని ఇవేళ ఈ జానికమ్మ అడ్డు తగిలింది. పాపం పాణి వీళ్ళంతా చూస్తారని వెళ్ళిపోయి ఉంటాడు.

పాల గిన్నె చేతిలో ఉన్నా-చూపులు జానికమ్మని మింగేలా వున్నాయి. "ఇవాళ మీకు పాలు చిక్కగా కనిపిస్తున్నాయా అత్తయ్య గారూ?"-అన్నది కోపాన్ని నొక్కి పెట్టుకుని.

'ఉన్నాయో లేదో చూడు తెలుస్తుంది! అయినా ఎవరి జాగ్రత్తల్లో వాళ్ళు వుండాల్సిందే మనోరమా!- ఇంకొకరిని మాట అనడం ఎందుకులే!' అని ఆవిడ ఇంట్లోకి విసవిసానడిచింది.

మనోరమ మూతి తిప్పుకుంది.

వెంకడు పళ్ళు పటపటలాడించాడు.

ఆ రోజు జానికమ్మ మీద-వాళ్ళిద్దరికీ కోపంగానే వుంది.

ఎలాగైనా పాణి 'తనవాడే' ఎందుకు అనవసర ప్రసంగాలు అని సరిపెట్టుకుంది-మనోరమ.

ఆరువాటాల కాపరాల్లో-పంపు నీళ్ళ దగ్గర, బాత్‌రూమ్ దగ్గర, లైటు బిల్లున్ని గురించి ఉమ్మడి వాటాలో కసువు వూడ్చే పనిమనిషి కోసం-ఎప్పుడో ఒకప్పుడు ఏదానికో గల్లంతులు వాదోపవాదాలు

జరుగుతూనే వుంటాయి. రెండు కుటుంబాల మధ్య పొరపొచ్చాలు లేకుండా వుండటం హర్షదాయకమే గానీ ఆరుకుటుంబాలు, అందు లోనూ మధ్యతరగతి కుటుంబాలై ఉంటే-చెప్పకొనక్కరలేదు.

సినిమా చూసి వచ్చి మర్నాడు పంపుదగ్గర ఈలవేస్తూ మూడో ఇంటివాటాలో కొత్త కోడల్ని చూసే కుర్రకుంక ఒకడుంటే: చవక బారు సెక్సు పుస్తకాలు చదివి మండువా లోగిల్లో 'జోక్సు' పేరుమీద అవాకులు చవాకులు పేలే రకాలు కొందరు, నవలలు కథలు చదివి, అందని వళ్ళకోసం అర్రులు చాస్తూ రెక్కలు ఉంటే పైకి ఎగిరి పోదామనుకునే కన్నెపిల్లలకి మానసిక ఆరోగ్యాన్ని పెంపొందించ గల పరిస్థితులు బహు తక్కువ.

అందమైన సాయంత్రాలు మబ్బులు పట్టిన మధ్యాహ్నాలు కొన్ని జరిగిపోయాక, ఒకరోజు మండువా లోగిల్లో అమ్మలక్కలు అంతా ముచ్చటించుకున్న సమయంలో కన్నెపిల్లలు, వాళ్ళ పెళ్ళిళ్ళు కట్నాలు విషయం దొర్లింది.

'మా మనోరమకి ఈ సంవత్సరం ఎలాగైనా పెళ్లి చేసేయా లకునుకుంటున్నాం!' అన్నది మనోరమ తల్లి.

'ఏదైనా కావల్సింది వుందా? లేకపోతే పరాయి సంబంధమే చూడాలా?' మరొక ఇల్లాలి అరా.

'ఆ: కావల్సిన వాళ్ళు లేరమ్మా: పై వాళ్ళనే చూడాలి.'

అయితే తిప్పలే: ఆడపిల్ల పెళ్ళి చేస్తే అడుక్కుతినే గతి పట్టే రోజులు—ఏమాత్రం ధరకి నిలవాలనుకుంటున్నారు?'— ఇంకొక ముత్తైదు ముందుకు వంగి అడిగింది.

'ఏం చెప్పను? మా అదృష్టం...దాని అదృష్టం బాగుంటే అప్పుల పాలవకుండా ఐదువేలలో కానిద్దామని ఉంది!' ఎంతో నిజా యితీగా మాట్లాడుతున్న తల్లి మీద—మనోరమకి చిరాకు, కోపం కలిగాయి: గదిలోనుంచి బయటికి వచ్చి అరుద్దామనుకుంది గాని అంతలోనే నిగ్రహించుకుని చిన్నగా నవ్వుకుంది.

ఆ నవ్వులో ఏటూ ఎలక్షన్‌లో నెగ్గబోతున్న ప్రెసిడెంట్ గారి ఠీవి నిండి వుంది: మనోరమకి అంత ధీమా వుంది.

మరొక నాలుగు రోజులు తర్వాత నిజంగానే పెళ్ళివారు చూడ్డానికి వస్తున్నారని తెలియగానే మనోరమకి గుండె దడదడలాడింది: పైగా వాళ్ళు కట్నం దగ్గర ఎక్కువ పట్టింపు చూపించరుట. అని తెలియగానే 'చౌకబేరపు ముసలి మొగుడా' అని భయపడింది. ఆ తర్వాత పేదరికపు గుమాస్తా కుర్రాడని తెలుసుకుని ఒళ్ళు మండి—తిట్టుకుంది. ఇంక ఉపేక్ష పనికిరాదని చేయవలసిన సాహస కార్యాలన్నీ ఆలోచించింది,

ఏ నవలలో...ఏ హీరోయిన్ ఎలా చేసిందో నెమరు వేసుకుంది. ఆ రాత్రి అందరూ పడుకున్నాక మెల్లగా లేచి వీధి తలుపు తీసి దగ్గరగా వేసి పాణి గది తలుపు తట్టింది.

'ఎవరూ?' అని, తెరచిన తలుపులో నుంచి లోపలికి వస్తున్న మనోరమని చూసి ఆశ్చర్యపోయి—'మీరా!' అన్నాడు.

'ఇష్ మెల్లగా! ముందు తలుపు వెయ్యండి' అన్నది.

పాణి తలుపు దగ్గరికి నొక్కి 'ఏమిటిది? ఎందుకు వచ్చారు ఇలా?' అన్నాడు. అతనికి ఆశ్చర్యం కన్నా భయం ఎక్కువగా వుంది మనోరమ పాణిని ఒకసారి నిశితంగా చూసి—తలవంచుకుని చెప్పటం మొదలెట్టింది.

''పాణిగారూ! తెలియనట్టు నటించకండి-మీ మనసు నాకు తెలుసు! నా మనసు మీకూ తెలుసు. ఎన్నాళ్ళిలా మూగ చూపులు చూస్తూ కాలక్షేపం చేస్తాం? సమయం మించిపోతోంది. రేపు నన్ను చూడ్డానికి ఎవరో వస్తారు!—కానీ నా మనస్సు ఎప్పుడో మీకు అంకితమై పోయింది. ఇక నన్ను కాపాడుకోవలసిన బాధ్యత మీదే. వెంటనే రేపు మీరు మానాన్నకి చెప్పేయండి: లేదా ఈ రాత్రే మనం

ఇక్కడ్నించి వెళ్ళి పోవాలి. ఏం చెయ్యాలో మీరే చెప్పండి" అని తల ఎత్తి చూసింది.

అనుకోకుండా పడిన వానలో తడిసి చలికి వణికినట్టు-పాణి రెండు నిముషాలు విషయం అర్థంగాక అయోమయంలో కొట్టుకుని ఆ తర్వాత మెల్లగా అసలు సంగతి బోధపడ్డాక-చిన్నగా నవ్వుకుని ఆ పిల్లని జాలిగా చూసేడు.

'చూడు మనోరమా, ఈ రాత్రి మనం ఇలా మాట్లాడుకోడం ఎవరి కంటైనా పడితే బాగుండదు. రేపు నేను అన్ని విషయాలు నీకు తెలియ చేస్తాను. రేపు పెళ్లివారు సాయంత్రం వచ్చేలోగానే నీకు సవిస్తరంగా అన్ని సంగతులూ తెలియజేస్తాను. ఇంక నువ్విప్పుడు వెళ్లిపో! అని ఆ అమ్మాయిని బయటికి పంపించి తలుపు వేసుకున్నాడు.

ఆ తర్వాత మనోరమ తమ వాటాలోకి వచ్చి హాయిగా నిద్ర పోయింది. తెల్లవారిన తరువాత కాలేజీ మానేసి ఇంటిపట్టునే తల్లికి పనుల్లో సాయం చేస్తూ పాణి పంపే కబురుకోసం ఎదురు చూస్తోంది. చాలా ఆత్రుతగా తిరుగుతోంది.

మధ్యాహ్నం మూడు గంటల సమయంలో- తండ్రి తనని పిలిచి నెమ్మదిగా అడిగేడు- 'ఎమ్మా! నువ్వు రాత్రి పాణి గదికి వెళ్ళావా?'

ఒక్కసారి గుండె ఝల్లుమన్నా పాణి అంతా చెప్పే వుంటాడనీ, ఎటూ తనకు అతనితో వివాహం జరిగేదేననీ-కనుక భయం అనవసరమనుకునీ ధైర్యం తెచ్చుకుంది.

'ఆయన అంతా మీతో చెప్పారా?' అని తిరుగు ప్రశ్నవేసింది.

'ఆఁ అంతా చెప్పాడు. పదివేలు కట్నం ఇయ్యగలిగితే మీ అమ్మాయిని చేసుకుందుకు నాకేం అభ్యంతరం లేదన్నాడు. లేకపోతే పిల్లని జాగ్రత్తలో వుంచండి. అమాయకురాలు. ఏమీ తెలియదు.

రాత్రిపూట అలా ఎవరి గదిలోకైనా వెళితే ఏమవుతోందో తెలియని వెర్రి పిల్ల— అన్నాడు అనుభవం లేని పసి మనస్సు, అనవసరంగా జీవితాన్ని పాడు చేసుకోవద్దని బోధ చేయమన్నాడు. అతను ఉత్తమోత్తముడు గనుక ఈ విషయాలన్నీ నాకు రహస్యంగా చెప్పి, పది మందిలో నా పరువు కాపాడేడు!— ఇదిగో నీకు ఈ ఉత్తరం ఇచ్చి చదవమని చెప్పాడు.' అని జేబులో నుంచి ఓకాగితం మడత విప్పి కూతురు ముఖానికి కొట్టి' కోపంగా బయటికి వెళ్ళిపోయాడు.

కొయ్యబారుతున్న మనోరమ తెప్పరిల్లుకుని-ఉత్తరం ఆత్రంగా చదివింది. ఆ ఉత్తరం అసలు పాణి రాసిందికాదు. పాణికి వాళ్ళ నాన్న రాసిన ఉత్తరం.

చి॥ పాణికి ఆశీర్వదించి మీ నాన్న వ్రాయునది.

నువ్వు చూసి వచ్చిన సంబంధం నిశ్చయం చేయాలను కున్నాను. నువ్వు కోరిన ప్రకారమే వాళ్ళు పదివేలు కట్నం ఇచ్చి లాంఛనాలు జరిపడానికి ఒప్పుకున్నారు. పాపం వాళ్ళకది కష్టమే అయినా-మనమేమి చేయగలం?

మధ్య తరగతి కుటుంబాల్లో ఈ రకమైన ఇబ్బందులు తప్పవు! నీకిచ్చే కట్నంతో-పెద్ద చెల్లాయి పెళ్ళి చేయాలిగదా?-సరే నువ్వు నెలా నెలా పంపించే డబ్బుతో ఇంటిమీద అప్పు తీర్చేస్తున్నాను. అమ్మకి ఈ మధ్య కులాసాగానే వుంటోంది. బావగారి అలక తీర్చటానికి మొన్ననే ఒట్టల కొట్లో ఖాతాలో రాయించి రెండు నూర్లకి పంపించేను. తమ్ముడి చదువు ఏదో సాగుతోంది. చిన్న చెల్లాయిని ప్రవేటుగా హిందీ పరీక్షకు పంపిస్తున్నాను. నువ్వు వీలు చూచుకుని మరొక సారి వస్తే లగ్న నిశ్చయం చేసుకుందాం.

మీనాన్న

ఆ ఉత్తరం క్రింద రెండు ముక్కలు పాణి స్వహస్తంతో మనోరమకి వ్రాసేడు.

'మనోరమా! మానాన్న రాసిన ఉత్తరం చదివేవుగదూ? మా ఇంటి పరిస్థితులు అర్థమయ్యాయా?- మనమంతా ఒకే పడవలో ప్రయాణం చేస్తున్న సమాన వ్యక్తులం. రంగుల కలలు కనడం తేలిక! కానీ అవి జరగడం చాలా కష్టం. జీవితం వేరు. కథలు వేరు. మానసికంగా మనిషి ఎదగడానికి అనుభవాలే గొప్ప పాఠాలు. పెళ్ళివారు వచ్చే వేళకి చక్కగా ముస్తాబై-పిల్లాణ్ణి మెప్పించు-ఆ తర్వాత మంచి గృహిణిగా పేరు తెచ్చుకో'—

ఇట్లు నీ మంచి కోరే
పాణి

అనుకోకుండా రెండు కన్నీటి చుక్కలు రాలి ఆ ఉత్తరం మీద పడ్డాయి. తర్వాత మనోరమ 'పెళ్ళి చూపులకి' సిద్ధమైంది.



# "కాకులు"

(యువ మాస పత్రికలో 1984సం॥లో
ఈ కథ ప్రచురించబడినది).

వరండాలో చివరగా ఓ చిన్న స్టూలుమీద కూర్చుని వుంది ఆమె! ఘాణాంసింపుగా కొంగు బిగించుకున్నా మనసు నిండా కొండంత దిగులు — కళ్ళనిండా గుబులు నింపుకొని నిముషనిముషానికీ, సన్నగా నిట్టూరుస్తూ — నుదుట పేర్కుంటున్న చిరుచెమటల్ని కొంగుతో తుడుచుకుంటోంది.

ఆ వీధిలో రోడ్డుకవతల సగం ఎండి కొమ్మలు నరికిన తుమ్మ చెట్టుమీద - కొన్ని కాకులు అదేపనిగా అరుస్తున్నాయి. కొన్ని రెక్కలు విప్పుకుని టపటప కొట్టుకుంటుంటే మరికొన్ని కిందకీ పైకీ ఎగురుతూ శ్రుతి కలుపుతున్నాయి!

పావుగంట క్రితం - ఓ కాకి రెండుసార్లు అరిచింది! ఐదునిముషాల తరువాత మరో నాల్గు కాకులు - గబగబా వచ్చి టెలిగ్రాపు తీగమీద వాలేయి! సరిగ్గా మరో ఐదునిముషాల్లో - అరడజను కాకులు తుమ్మ చెట్టు కొమ్మల్లో దూరి - గొంతు కలిపేయి.

ఇప్పుడవన్నీ మూకుమ్మడిగా గోలచేస్తున్నాయి. వాటన్నిటి చూపు చెట్టు కిందవున్న చెత్తకుండీ పక్కన ఓ చచ్చిపడున్నట్టున్న 'పదార్థం' మీదే వుంది.

నిర్మానుష్యంగా- నిశ్శబ్దంగా వున్న ఆ వీధిలో ఆ కాకుల గోల తప్ప మరేమీ వినిపించటం లేదు—

వరండాలోని ఆమె-తల తిప్పి అటుచూసింది. ఆమె కూర్చున్న వరండా నుంచి కొద్దిగా పక్కగావున్న ఆ తుమ్మచెట్టుమీద కాకులు మరింతగా రెచ్చి పోతున్నాయి.

విసుగ్గా - భరించలేనట్టుగా కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచింది- అప్పుడు పావుతక్కువ రెండు కావొస్తోంది సమయం.

సరిగ్గా అప్పుడే లోపల గుమ్మంలో నుంచి 'ఓతల' బయటికి చూసి మళ్ళీ లోపలికి తప్పుకుంది. ఆ తల తాలూకు రెండు కళ్ళు-ఆమెను సూటిగా చూసేయి!

ఆమె చిన్నగా నిశ్వసించుకుంది!

వాచీ చూసుకుంది- అప్పుడే తనువచ్చి అరగంట దాటింది. ఈ అరగంటలో తన అనుభవాన్ని గుర్తుచేసుకుంది.

బస్సు దిగి ఎడ్రసు చూసుకుంటూ రెండు మెయిన్ బజార్లు నాలుగైదు చిన్న సందులు దాటి ఈ వీధిలోకివచ్చి గేటు తీసుకుని లోపలికి వచ్చింది. లోపల్నుండి ఓ పెద్దమనిషి వరండాలోకి వచ్చి 'ఎవరు కావాలి?' అని అడిగేడు.

తను చెప్పింది- 'రఘుప్రసాద్‌గారు వుండేది ఇక్కడేనా? వారి కోసం హైద్రాబాదు నుండి వచ్చాను-'

ఆ పెద్దమనిషి పై నుంచి కిందకీ- కిందనుంచి పైకీ చూసి, కనుబొమ్మలు పైకి లేపి- 'ఓహో! అలాగ? వాడితో ఏమిటి పని?' అనడిగేడు.

తను వెంటనే చెప్పలేకపోయింది. అయినా రఘుతో తప్ప తనకి ఎవరితోటీ పరిచయం లేదు-కొత్త వ్యక్తులతో తన వ్యక్తిగత విషయం ఎలా చెప్పగలదు? సిగ్గుగా బిడియంగా అనిపించి- 'వారు లేరా?' అన్నది.

'ఏం? వాడితో కానీ చెప్పకూడనిదా? నేను వాడి మేనమామని! ఫర్వాలేదు చెప్పవచ్చును.' అన్నాడా పెద్దమనిషి- ఆ మాటతీరులో వినిపించిన వ్యంగ్యం, హేళన-తనకి చురుక్ మంది. మనస్సు గాయపడింది. గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకుంది. కాని అతికష్టం మీద నిగ్రహించుకుని-తన అవసరాన్ని గుర్తు చేసుకుని-చిన్న నవ్వు నవ్వి - 'ఇంతకీ వారు ఇంట్లో లేరా? మీరు మేనమామగారా! నమస్కారం!' రెండు చేతులు జోడించింది.

ప్రతి నమస్కారం చెప్పలేదు సరికదా-విసురుగా ఇంట్లోకెళ్ళిపోయాడు! ఏంచేయాలో తోచక-రెండు నిముషాలు తటస్థంగా నిలబడిపోయింది తను. అప్పుడు లోపల్నుంచి ఓ అమ్మాయి సరిగ్గా తన వయస్సుదే-అంటే ఇరవై - ఇరువైఐదు సంవత్సరాల మధ్యలో వున్న అమ్మాయి బయటకి వచ్చింది.

'ఎవరండీ? ఎవరు కావాలి?'

నేను హైద్రాబాదు నుంచి వచ్చానమ్మా! రఘు ప్రసాదు వున్నారా? వారితో మాట్లాడాలి!'

'మా అన్నయ్యతో మీకేం పనండి?' అని నిలదీసింది.

'అంటే- రఘుగారి చెల్లెలా మీరు నమస్కారం!'

'నమస్కారం! అవును రఘు మా అన్నయ్యే! హైద్రాబాదు నుంచి మా అన్నయ్యకోసం వచ్చారా? ఎందుకు? వాడెలా తెలుసు?' ఆ అమ్మాయి కళ్ళలో ఆశ్చర్యమో-అనుమానమో తెలియని భావం తొంగి చూసింది.

తను మళ్ళీ చిన్నగా నవ్వి-మీ అన్నయ్య మా ఆఫీసులోనే పని

చేసేవారు. మాకు బాగా ఫ్రెండ్! వారితో కొద్దిగా పనుండి వచ్చాను. ఇంట్లో లేరా!? అన్నది తను.

'అదే ఏం పనో చెప్పండి! వాడు వచ్చాక చెప్తాను. ఊళ్ళో లేడు—'

'అయ్యో ఊళ్ళోనే లేరా? ఏ ఊరు వెళ్ళేరు? ఎప్పుడువస్తారు?' తను ఆ క్షణంలో హతాశురాలై పోయింది—

ఆ అమ్మాయి అదోలా చూసి 'ఇంట్లో అడిగి చెప్తాను' అంటు గిర్రున ఇంట్లోకెళ్ళి పోయింది- పది నిముషాల తర్వాత బయటికి వచ్చింది. అంతసేపు తను వరండా మెట్లమీదే నిలబడిపోయింది!

మా అన్నయ్య ఈ రెండు గంటల ట్రైనులో వస్తాట్ట! మరి వుంటారా?'

'వుంటాను' అని తను అన్నాక 'అక్కడ కూర్చోండి' అంటూ ఇదిగో ఈ స్టూలు చూపించి లోపలికి వెళ్ళిపోయింది.

తను-అదే మహాభాగ్యంగా భావించి కూర్చుండిపోయింది. మనసంతా చికాకుగా వుంది. బ్రతుకంతా శూన్యంగా కనిపిస్తోంది!!

తనకి ఉద్యోగం వుంది. తన కాళ్ళ మీద తను బ్రతకగల ధైర్యం వుంది. పరువుగా మర్యాదగా జీవించాలనే ఆకాంక్ష వుంది! ఎప్పటికీ తనలోని సంస్కారం, నిలబెట్టుకోవాలనే తపన వుంది. నీతికి నిజాయితీకీ కట్టుబడి వుండాలన్న తలంపు వుంది. గొప్ప పనులేమీ చేయలేకపోయినా కనీసం మనిషి స్థాయి నుంచి దిగజారిపోకూడదన్న మంచి మనసు వుంది!

కానీ ఏం లాభం??

సమస్యల ముడిలో చిక్కుకుంది, తను! ఆ ముడి జాగ్రత్తగా విప్పుకోకపోతే-తను అగాధంలో పడిపోతుంది! అందుకే ఆలస్యం చేయకుండా ఇలా రఘుని వెతుక్కుంటూ వచ్చింది! స్వయంగా

రఘుతో మాట్లాడాలి కానీ-తనకి పరిచయంలేని అతని కుటుంబీకులతో ఏమని చెప్తుంది?-

అయినా వీళ్ళ ధోరణి చూస్తే-ఏమిటో బాధగా వుంది: తను ఇక్కడ కూర్చున్న ఈ అరగంట సేపట్లో-ఎదురుగా వచ్చి ఎవరూ పలకరించలేదు సరికదా బయటికివెళ్తూ ఒకసారి, లోపలికి పోతూ ఒకసారి-తల మాత్రం బయటికిపెట్టి ఒకసారి-చూస్తున్నారు. నోరు విడిచి మంచి నీళ్ళు కావాలని తను అడిగేదాకా కనీసపు మర్యాద కూడా చేయలేదు. గ్లాసుడు నీళ్ళు తాగేక 'ఫర్వాలేదు చల్లగానే వున్నాయి' అనుకుంది-అవి తాగి అప్పుడే - చాలా సేపైంది. మళ్ళీ దాహం వేస్తున్నా అడిగే ధైర్యంలేక గుటకలు మింగుతూ-రఘు కోసం ఎదురుచూస్తూ కూర్చుంది ఆమె.

ఈ అరగంట నుంచి ఇంటిలోపల చాలా ఘోష్ఠులు జరుగుతున్నాయి-ఆ ఇంటి పెద్దదైన రఘు తల్లి-కళ్ళనీళ్ళు కారుస్తూ-సన్నసన్నగా గొణుక్కుంటోంది-

'పెద్దకొడుకు, ఇంటికి ఆదుకోవల్సిన వాడు-ఇలా పరవారి తను చూసుకుంటే-మా గతేంకాను? ఇలా కొంపముంచుతాడనుకోలేదు-నేను ఇప్పుడేం చేయను!'

'ఊరుకో అక్కయ్యా! అలా కొంప మునగనిస్తామేమిటి? రఘు వచ్చాక చీవాట్లేద్దాం!' అని ఓదారుస్తూ భుజం రాస్తోంది ఆవిడకి స్వయాన చెల్లెలైన మరొకావిడ.

'ఎంత వలెతిగించింది కాకపోతే-ఇలా ఇంటికే వస్తుందా? నేను ఎన్నాళ్ళనుంచో అనుకుంటూనేవున్నాను. ఎప్పుడు పెళ్ళిమాటఎత్తినా-వీడు 'ఇప్పుడే వద్దు ఇప్పుడేం తొందర'-అని దాటేస్తుంటే-ఇలాంటిదేమైనా జరిగిందేమో అని అనుమానపడుతూనే వున్నాను, వెధవ ఆడపిల్లలు! మరీ పెట్రేగిపోతున్నారు! కట్నాల బాధలు లేకుండా-ఇలా మగపిల్లల మీద వల విసిరి-లోబరుచుకుంటున్నారు. ఇలాంటివాళ్ళు రేపు మరొకడితో వెళ్ళిపోదని నమ్మకమేమిటి? దాని తల్లి తండ్రులకి బుద్ధి

వుండొద్దూ? పెళ్ళి చేయలేకపోతే బ్రతుకు తెరువుకి ఉద్యోగం చేసుకుంటూనే వుండిగదా? అలాజీవితం గడుపుకోక-మంచిపిల్లాణ్ణి చూసి ఇలా మాయలో పడేస్తుందా? గుళ్ళో చేసుకున్నారో-రిజిష్టర్ మ్యారేజ్ చేసుకున్నారో?-

'అయినా ఒక మాట చెల్లెమ్మా!' అని మరింత రహస్యంగా-'మన రఘుకి దాని మోజు తీరిపోయినట్టుందిలే-లేకపోతే ఇక్కడికి ట్రాన్స్‌ఫరై వచ్చాక ఈ నెల్లాళ్ళనుంచి పెళ్ళిమాట ఎత్తితే విసుక్కోటం లేదు-అందుచేత ఏం భయపడక్కర్లేదు-దాన్ని వదిలించుకునే పద్ధతి నేను చెప్తా గదా? ఏడవకు ఊరుకో!'-అంటూ అభయం ఇస్తున్నాడు, ఆవిడ అన్నయ్య!

ఒకవేళ అన్నయ్య - అవతలవున్న ఆ అమ్మాయిని - వదినగా స్వీకరిస్తే-తనకి కట్నం ఇచ్చి పెళ్ళి ఎలా చేయగలడూ? వాడు కట్నం తీసుకుని చేసుకుంటే కదా తనకి మళ్ళీ ఘనంగా కట్నంయిచ్చి పెళ్ళి చేయగల స్థోమత్తు వస్తుంది-లేకపోతే తనకి పెళ్ళెలా అవుతుంది. తనకి పెద్ద చదువు-ఉద్యోగం కూడా లేవు! ఇక తనకి పెళ్ళెప్పటికి అవుతుందీ? అని రఘు చెల్లెలు దిగులుగా కూర్చుంది-

మూల మంచంలో-ముక్కుతూనే రఘు బామ్మ - యధాశక్తి గొణుగుతోంది-

''ఏమిటో! నా కొడుకే బ్రతికివుంటే ఈ రఘుగాడు ఇలాంటి అప్రాచ్యపు పని చేస్తాడా? దిక్కుమాలిన ప్రేమలు-పెళ్ళిళ్ళు! కులం మతం-అన్నీ భ్రష్టత్వం అయిపోతున్నాయి! దానిది ఏ వర్ణమో? ఏం పాడో? దాన్ని కొంపలో తెచ్చిపెడ్తే నేను బ్రతకలేనే కోడలా? ఈ ప్రాణం ఇంక నిలవదు-'అంటూ గుండెలమీద రాసుకుంది.

'నువ్వూరుకో బామ్మా! మామయ్య రానిస్తాడేమిటీ? ఎక్కువగా మాట్లాడకు ఆయాసం వస్తుంది. మందు అయిపోయింది కూడా! అన్నయ్య వచ్చి తెచ్చేదాక ఆగాల్సిందే!' అని పెన్సుగ్లాసు చదువు

తున్న రెండో మనుమడు బామ్మని గదమాయించి - తనను మందు తెమ్మని చెప్పకుండా ముందే హద్దులో వుంచేడు!

అరగంటసేపు ఇలా లోపలిగదిలో రహస్యంగా తిట్టుకోడాలు-విమర్శలు-తర్జనభర్జనలు నానా భంగిమల్లో జరిగిపోతున్నట్టుఏమాత్రం తెలియని- బయటి వరండాలో ఆమె-రఘు నిరీక్షణలో- తన సహనాన్ని పరీక్షించుకుంటూ చూపులన్నీ గేటుమీదే నిల్పివుంచింది.

మరొక పావుగంట దాటిపోయి రెండైంది: ఎకస్ట్రా నిముషాలు గడిచి పోతున్నాయి. రఘు వచ్చేజాడ లేదు. ఆమెలో ఓపిక క్షీణించి పోతోంది— లోపలివాళ్ళు బయటికి వస్తున్నారు. ఒరగా ఆమెను చూసీచూడనట్టు గేటు తీసుకుని బయటికివెళ్ళి మళ్ళీ వస్తున్నారు-

కొద్దిసేపటి తర్వాత ఆమె లేచి వరండాలో అటు ఇటు తిరుగుతూ తల తిప్పి చూసింది. ఎదురింటి కిటికీలో రెండు తలలు నిక్కి నిక్కి చూస్తున్నాయి: చప్పున తలతిప్పుకొని పక్కకి నడిచింది. పక్కింటి అరుగుమీద — ఆ ఇంటి ఇల్లాలు, ఆమె భర్త కాళ్ళు పైకెత్తి చూస్తూ- కనిపించేరు-వెంటనే తలదించుకుని మళ్ళీవచ్చి స్టూలుమీద కూర్చుంది ఆమె-

చెట్టుమీద— టెలిగ్రాఫ్‌తీగల మీద కాకులసంఖ్య పెరిగి పోయింది॥ అరుపులు మరీ కర్ణకఠోరంగా వుంది.

అప్పటికి సమయం రెండున్నర దాటింది!

ఆమెలో ధైర్యం- ఆశ సన్నగిల్లి పోయాయి! బహుశా రఘు ఈ రైలుకి రాడేమో అనుకుంది. పోనీ ఏ ఊరు వెళ్ళేడూ— ఏ పని మీద వెళ్ళేడో అని అడుగుదామన్నా - ఇంటి వాళ్ళెవరూ తనని లోపలికి పిలవటమే లేదు!

తనే తెగించి లోపలికి వెళ్తే?

అవును ఇంత దూరం వచ్చి బిడియపడ్తే ఎలా?

అవసరం తనది! అనుకుని చటుక్కున లేచింది. వివరాలన్నీ

అడిగి-తనను గురించి చెప్పి ఒకసారి హైద్రాబాదుకి రఘుని రమ్మనీ చెప్పాలి- అనుకుంటూ గుమ్మంవైపు అడుగువేసింది—

సరిగ్గా అప్పుడే- మరొక రెండు కొత్తముఖాలు తలుపుదగ్గర నిలబడి. తనవైపు చూస్తూ సైగలు చేసుకుంటున్నాయి కళ్ళతో!

ఇంతవరకు బయటికీ-లోపలికీ తిరిగిన ముఖాల్లా లేవు అవి.

ఆమెకి ఎందుకో భయం వేసింది! వెంటనే వెనక్కి తిరిగి చూసింది! ఎదురింటి కిటికీల్లో- పక్కింటి అరుగుమీద అందరు తననే చూస్తున్నారు.

ఒక్కసారి నిలువెల్లా సిగ్గుతో కుంచుకుపోయింది ఆమె. మన స్సంతా అవమానంతో నిండిపోయింది.

ఛీ! నేనెంత తొందరపడి వచ్చాను? కనీసం ఉత్తరం రాయాల్సింది. నా ఆవేదనలో ఆరాటంలో ఏదీ తోచలేదు:- ఇంకా రఘుకి ఏదో చెప్పాలనుకోటం - పొరపాటు-వెంటనే వెళ్ళిపోవాలి. నాల్గు గంటల రైల్లో వెళ్ళిపోవాలి. ప్లాటుఫారం మీదే కూర్చో వచ్చును.— అనుకుని— 'ఏమండీ నేను వెళ్తున్నాను. బహుశా రఘు గారు ఇవాళ రారేమోలెండి.' అని లోపలికి వినిపించేలా గట్టిగా అనేసి చర చరా మెట్లుదిగి గేటుదిగి గేటు తీసుకుని బయట పడింది.

బిలబిలలాడుతూ చీమల్లా ఇంట్లో వాళ్ళంతా వరండాలోకి వచ్చారు... వీధిలో అల్లంత దూరంలో కొంగు నిండా కప్పుకుని గబగబా వెళ్తున్న ఆమెను చూసి— 'మంచి పనే జరిగింది. వాడు రాలేదు.' అని ఒకరంటే- 'అబ్బో! పెద్ద పతివ్రత వేషం చూడు' అని మరొకరు- 'ఆ! ఎన్ని వేషాలు లేకపోతే ఇంత ధైర్యం చేస్తుం దని' ఇంకొకరు—

'ఎలా వచ్చిందో అలా వెళ్ళింది!' అని మేనమామ నవ్వేడు- 'పోనీలే మీ అక్కయ్య అదృష్టవంతురాలు, గొడవ జరగకుండా ఆ పిల్ల తనదారిని తను పోయింది' అని పొగిడిందొకావిడ.

అప్పుడే అందరు గమనించినట్టు- 'ఇదేమిటీ? ఈ కాకులగోల విపరీతంగా వుందే,' అని విసుక్కున్నారు. వాళ్ళలో ఒకర్ని వెళ్ళి- వాటిని అదలించేరు. అయినా అవి మానలేదు అరుపు - చిరాకుగా ఎక్కడివాళ్ళు అక్కడి వెళ్ళిపోయారు.

ఓ గంటన్నర తర్వాత-రఘు బ్యాగ్ ఊపుకుంటూ వచ్చాడు.

'అదేమిట్రా? ఇప్పుడు ఏ రైలుంది?' అని వెల్లబోటా అడి గేడు మేనమామ.

'ఇప్పుడే రైలు లేదు. నేను రెండు గంటల రైల్లోనే వచ్చాను అన్నాడు రఘు బ్యాగ్ బల్లమీద పెట్టి—

'మరి లేటైందా?'

'కాదు. స్టేషన్ దగ్గర మా ఫ్రెండ్ ఒకడు కనిపించి మాటల్లో పెట్టేసేడు-ఆలస్యమైంది. ఇంతలో సావిత్రి కనిపించింది. మళ్ళీ ఆమెతో స్టేషన్‌కెళ్ళేను'-

'సావిత్రా? అదెవ్వర్రా?' అంది తల్లి.

మంచలమీద కూర్చుని బూటు లేసులు విప్పుకుంటూ-

'మనింటికి వచ్చి నాకోసం చూసి తిరిగి వెళ్ళిపోయినావిడ' అన్నాడు తాపీగా.

'ఆ! అయితే అది నీకు కలిపించిందన్నమాట'

'ఆ! కనిపించేదు మామయ్యా! అది గిది అనకు. పరువు మర్యాదా గల కుటుంబంలో మనిషి రాకరాక మన వూరువస్తే- సమయానికి నేను ఇంట్లో లేను. వెనక్కి రమ్మంటే రానని, తనకి చాలా అర్జెంటు పనివుందని నాలుగు గంటల రైలుకే వెళ్ళిపోతా నన్నారు. కనీసం రైలువచ్చేవరకు అక్కడేవుండి ఎక్కించి వచ్చాను. మీవాళ్ళు చాలా మంచివాళ్ళు అని చెప్పేరు -- కాఫీ, టిఫిను బాగా పెట్టేరు కాబోలు' అన్నాడు నవ్వుతూ.

అంతా ముఖాలు చూసుకుని వెర్రి నవ్వు నవ్వి ఊరుకున్నారు.
'బామ్మా! ఎలా వున్నావూ? మందు అయిపోయినట్టుంది తెస్తాలే సాయంత్రం. నేను వెళ్ళినపని సక్సెస్ అయింది మామయ్యా. ఆఫీసర్ ఓ.కే. చేసేడు. త్వరగా ప్రమోషన్ రావచ్చును నాకు. ఇక పెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టండి' అని బూట్లు మంచం కిందికి తోసి లేవబోయాడు—

'ఒరే రగ్గూ! ఇంతకీ ఆ సావిత్రి ఎవర్రా' అని చేయిపట్టుకుని ఆపింది బామ్మ.

'ఆవిడ మా ఆఫీసులో పనిచేసేవారు. ఇప్పుడూ అక్కడే వున్నారనుకో. పాపం! మంచి సంబంధం అని చెప్పి తల్లితండ్రులు పెళ్ళిచేసేరు. వాడూ మా ఆఫీసులో వాడే. కానీ వట్టి తిక్క వెధవ. చచ్చే అనుమానం. డబ్బు కావాలి – కాని పెళ్ళాం మగాళ్ళ మధ్య కూర్చోకూడదు, మాట్లాడ కూడదు ఎలాగ? ఉద్యోగం చేసే వీరు హద్దులు దాటకుండా వీలవుతుందా? పోనీ జాబు వదిలేస్తానన్నారు ఆవిడ; అబ్బే వద్దన్నాడు. పైగా తాగివచ్చి నానా బాధ పెడతాడు. ఆవిడకి ఎంత వోర్పో! ఏదీ చెప్పరు. ఈ త్రాష్టుడే తాగిన మైకంలో వున్నప్పుడు తను చేసే ఘనకార్యాలన్నీ చెప్పేవాడు.

'ఇప్పుడు వెధవ ఎవరో అమ్మాయిని పట్టేడు. బాగా డబ్బుందిట. అందుకని సావిత్రి వదిలేయాలనుకుంటున్నాడు. పాపం ఆవిడ తల్లితండ్రులు ఈమధ్యనే ఏక్సిడెంట్ లో పోయేరు. అందుకని కష్టసుఖాలన్నీ మా కోలీగ్స్ కే చెప్పుకుంటుంది. నన్ను అన్నయ్యలాచూస్తుంది. 'డైవోర్స్ తీసుకోను నువ్వు వచ్చి ఆయనతో చెప' అని నాతో చెప్పడానికి ఈ ఊరు వచ్చేరుట. పోనీ వదిలేయకూడదా వెధవని అని నేను చెప్తే 'మాపాపకి తండ్రి కావాలి–నాకు భర్త అక్కర్లేకపోయినా' అన్నారు. అన్నట్టు వాళ్ళకి రెండేళ్ళ పాప వుందిలెండి. ఏమిటో పాపం–చాలా మంచావిడ. జాతకమే బాగులేదు. సరే ఒకసారి హైద్రాబాదు వెళ్ళిరావాలి నేను' అంటూ లేచి – 'మరి మామయ్యా నాకు ప్రమో

షన్ ఖాయం. ఇన్నాళ్ళూ అందుకే పెళ్ళి వాయిదా వేసేను. ఇంక నా ఆలస్యం ఏంలేదు' అనేసి సిగ్గుపడినట్టు నవ్వేడు రఘు.

'శుభం అలాగే. వెళ్ళి స్నానంచేయి' అన్నాడు మామయ్య. రఘు బాత్‌రూమ్‌లో స్నానంచేస్తున్నప్పుడు వాళ్ళంతా అనుకున్నారు-

'పాపం! ఆ ఇల్లాలు ఆ భర్తతో ఎలాపడుతుందో! సావిత్రి పేరుకు తగిన మనిషన్నమాట!'

'మరే! వెధవగాళ్లను అపవాళ్ళని కాల్చుకు తింటుంటే సావిత్రులు, అనసూయలు భరించక ఏంచేస్తారూ?' అన్నది చెల్లెలు అక్క భుజంతడుతూ—

'వెధవ మొగుణ్ణి తిరగబడి కొట్టరాదూ! ఉద్యోగం చేస్తున్నావిడ కూ్కడా ఇంత పిరికితనమా' అనుకుంది రఘు చెల్లెలు.

'అయ్యో! అలాంటి పిల్ల ఈ ఇంటి కోడలైతే ఎంత అదృష్టమో' అని గొణిగింది బామ్మ.

రఘు స్నానంచేస్తూనే వున్నాడు.

వీధిలో కాకులు ఎప్పుడో ఎగిరిపోయాయి.

చెట్టుకింద చెత్తతుంప పక్కనవున్న నల్లటి పదార్థాన్ని ఓకుక్క లాగింది. అది సూనె గుడ్డ! చచ్చిన కాకి కాదు!



# "మంచుకరిగినవేళ మమత నవ్వింది"

(ఈ కధకి 1968 సం॥లో 'సవ్యసాహితీ సమితి' వారు ఉత్తమ కధగా ఎన్నిక చేసేరు. సన్మానం పొందినది.
—ఇది 19-1-68 ఆంధ్రసచిత్ర పత్రికలో ప్రచురితమైంది.)

శ్రీకారం చుట్టుకున్న అరచేయి కళ్ళ కద్దుకుని గట్టిగా ఆప లించి లేచికూర్చున్నారు రంగనాధం మేష్టారు. ఆయన మంచం కిటికీ ప్రక్కగా ఉంటుంది. తెల్లగా తోమిన కంచు మరచెంబు దానిమీద మట్టిగ్లాసు బోర్లించి. కిటికీలో ఆయనకి అందేట్టు వుంటుంది.

రాత్రివేళ దాహంవేస్తే చేతికి అందే మరచెంబు ఎత్తి గడగడ నీళ్ళన్నీ త్రాగేసి నిద్రపట్టేవరకు తలగడ క్రిందవున్న విసనకర్రతో విసురుకోవటం ఆయనకి జీర్ణించుకుపోయిన అలవాట్లు. మరీ వేసం కాలంలో తప్ప ఆయన ఆ గదివదలి బైట పడుకోరు. ఆరుబైట గాలి ఆయన తత్వానికి సరిపడదు. తనకి సరిపడని పనులు పొరపాటునైన ఆయనచేయరు. మరొకరుచేసినా సహించరు. ఆయన సంగతి అందరికీ తెలుసు. రంగనాధం మేష్టారి పట్టుదల, పంతం బడిలోనూ జరిగి తీరాల్సిందే! అయితే అన్నీ తెలుసుండీ ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా

ప్రవర్తించి ఎదురించినవాడు గర్భవాసాన పుట్టిన కొడుకే కావటం - ఆయనకి తీరని బాధని కలిగించింది.

మసక వెలుతురులో ఎదురింటి సీతారామమ్మ వాకిట్లో పెడుతున్న ముగ్గులు, తెల్లగ మల్లెలు వెదజల్లినట్టు, అంతకంటే అందంగ -ఆమె ప్రక్కనే నుంచున్న మనమడు రఘు బొమ్మకొంగు పట్టుకుని, ఆమె వంచినప్పుడల్లా తనూ నడుం వంచుతూ నానాఅవస్థపడటం కనిపిస్తోంది'ఎందుకురా వెధవాయ్‌వెళ్ళిపడుకోరాదూ'కసురుకున్నది సీతారామమ్మ కొంగు లాగుతూ వుంటే చుక్కలు సరిగా కుదరటంలేదని. 'నే వెళ్ళను. మరేమో మజ్జిగచేసి వెన్నంతా చట్టిలో దాచేసేవుగా నిన్న. ఇవాళ అంతా నాకు పెట్టాల్సిందే'.

'ఓరి నీ అసాధ్యం గూల. అలాగే లేరా! వెళ్ళి మీ తాతయ్య దగ్గర పద్యాలు చెప్పించుకుంటూ వుండు. అంతలో ముగ్గులు పెట్టేసి వస్తాను' అరచేతిలో ముగ్గు తాలిస్తూ అన్నది. 'ఊహూ...మరి తాతయ్య చుట్ట త్రాగి చెప్తానన్నాడు' ముద్దుగ గునుస్తూ. బామ్మ పెట్టున్న ముగ్గులు త్రొక్కేస్తూవుంటే వీధి అరుగుమీదికి వచ్చిన తాతయ్య 'ఒరేయి ఇలా రారా! వెధవ చుట్ట అంటుకోవడంలేదుగాని, మనం పద్యాలు చెప్పుకుందామురా' అన్నాడు అరుగుమీద చతికిలబడుతూ.

మంచంమీద బాసినపట్టేసుకుని కూర్చున్న రంగనాథం మేష్టారికి నేత్రానందకరంగా వున్నది ఆ దృశ్యం. 'తాతయ్య మనమడు' ఈ అనుభూతి క్రొత్తగ వున్నది. మునుపెన్నడు ఎరగని పరవశం కలిగి గిలిగింతలు పెడ్తోంది తాను ఎంత మందికి చదువులు చెప్పలేదూ. డిక్టేషన్‌లో తప్పులు రాస్తే పదేసిసార్లు రాయించటం క్లాసులో అల్లరిచేస్తే ఇంపోజిషన్ రాసి తెమ్మనటం-పద్యాలు కంఠస్థం చేయకపోతే గోడకుర్చీలు, జవాబులు రాయకపోతే బెత్తం దెబ్బలు! ఎన్నెన్ని శిక్షలువేసి దార్లో పెట్టలేదూ ? ఈనాడు తనదగ్గర చదువుకున్నవాళ్లు పెద్దపెద్ద పదవుల్లోవున్నా తనని ఎంత భయభక్తులతో చూస్తారని?...

అలాంటిది స్వంత కొడుకైనవాడు తన రక్తం పంచుకుని పుట్టినవాడు ప్రసాదు తను ఇష్టపడకపోయినా తనని వదలి ప్రేమించిన అమ్మా యిని చేసుకుని వెళ్ళిపోతాడా? వాడూ ఒక కొడుకే? తల్లి ఎంత బాధపడ్డదో వాడి కళ్ళకళ్లేకపోయాక వాడు బ్రతికినా చచ్చినా ఒకటే నని పించింది. పరాయి పిల్లంపాటి భయభక్తులు వాడికి లేకపోతే తనేనా అంత తక్కువ? 'ఫో ఇంట్లోంచి' అనేసేడు. భార్య ఎంత గోల పెట్టిందని? కాని తను కరుగలేదు పైగా ఏమన్నాడూ? 'ఇదిగో చూడు వాడు నిజంగ కొడుకే అయితే మనల్ని కాదని ఆ పిల్లని చేసు కుందుకు పోతాడా? ఏనాటి బాకీయో అనుకో. వీళ్ళంతా మన పిల్లలే, నా శిష్యులందరూ మన బిడ్డలేనే!' అని గంభీరంగ పలుకు తున్నప్పుడు ఎదురుచెప్పే ధైర్యంలేని లక్ష్మమ్మ బాధనంతా గొంతు కలో దిగమ్రింగుకుని 'నా బాధ మీకు అర్థంగాదు. కన్నకడుపు తీపి పరాయి పిల్లలమీద ఉంటుందా? మీరుకరగలేని, కటుడు మనసు కలవారు. నా ఆవేదన మీరు తెలుసుకోలేరు' అని కుళ్లికుళ్లి ఏడ్చింది.

మంచులా బిగుసుకున్నారేగాని ఆవంతైనా కరగలేదు మేష్టారు. భార్యదగ్గర ఎన్నడూ కొడుకు ప్రస్తావన తేలేదు. ఆ నోట ఆ నోట వాళ్ళను గురించిన వార్తలు వింటున్నా అయనలో మార్పు రాలేదు. మనమడు పుట్టేడన్న వార్త వినికూడా అయన నిర్లిప్తతగానే వుండి పోవడం లక్ష్మమ్మకి కత్తిపోటుకంటే ఎక్కువే అయింది. 'ఈయన మనిషి కాదు రాయి' అనుకున్నది. స్కూలు పిల్లలు-కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుకోవటం, నోట్సులు రాసుకోవటం-అంతే ఆ ప్రవా హంలో కొట్టుకుపోతు ఒకచోట తక్కువ ఆగిపోయేరు. అదే అయన 'రిటైర్' అవడం ఒక్కసారి నడుం విరిగినట్టు విలవిల లాడిపోయేరు. ఎక్కడలేని తీరుబడి, ఎంతోచదు. ఒంటరితనం. బావురుమంటున్న ఇంట్లో, మట్టిబొమ్మలా తనూ, భార్య!

ఎదురింటిలో కలకల లాడుతూ కొడుకులు,కోడలు, మనమలు తమ వెక్కిరిస్తున్నట్లు, జాలిపడున్నట్లు.

'తాతయ్యా, పద్యాలు చాలుగాని వేపమండ విరు. ముఖం కడుక్కుందాం. బామ్మ అప్పుడే మట్టిగ 'చేసేస్తోంది.'

'ఓరి పిడుగ్గా! నీ దృష్టి అంతా అటే వుందిరా?' ఒడిలోనుంచి పరిగెట్టిపోతున్న మనమణ్ణి చూస్తూ నెరసిన మీసాలు ఊగులాడేటట్లు నవ్వుతున్న తాతయ్యని చూసి రంగనాథం మేష్టారు క్షణంపాటు మరిచిపోయేరు.

'చెంబు నీళ్ళు అరుగుమీద పెట్టేను. ముఖం కడుక్కోండి కాఫీ త్రాగుదురుగాని' గుమ్మం దగ్గరనుంచి కేకేసి వంటింట్లోకి వెళ్ళిపోయింది. యంత్రంలా దినచర్యలన్నీ చేసుకోవటం అలవాటైపోయిన లక్ష్మమ్మని అలా చూస్తూ మొదటిసారిగా బాధపడ్డారు.

'సీతారామమ్మలా మనుమడి ముద్దు ముచ్చట్లకి, అల్లరికి నోచుకోలేదు. 'అత్తయ్యా' అనే పిలుపుకి దూరమైంది. మరబొమ్మలా ఆ వంటింట్లో పనులు చేసుకోవటమేగాని 'మీరుండండి ఆ పని నేను చేస్తాను' అనే కోడలి ఆదరణకి కరువైందిగదా! తను మాత్రం? ఇంత కాలం స్కూలు పిల్లలు, తోటిపంతుళ్ళు, ఇన్స్పెక్షన్‌లు ఈ గొడవలతో కాలమే తెలియలేదు. ఇప్పుడో తన అవసరం తీరింది అందరికీ! ఏమిటో వెలితి—బాధ ఒంటరితనం' 'తాతయ్యా' అనే మనుమడు వుండి లేనట్టు చేసుకున్నాడు. రఘు ఈడే కాబోలు వాడికీ! వాడు ఇలాగే తెల్లవారకట్ల లేచి వాళ్ళమ్మ నాన్నని తాతయ్యా పద్యాలు చెప్పమంటాడేమో? ఆ ముసలాడు సరిగా చెప్తాడా? ఏదో ఆఫీసులో పనిట. ఎంతైనా పంతులు చెప్పినట్టు చెప్పగలడా? అపస్వరాలు చెప్తే... తల్చుకుంటేనే ప్రాణం గిలగిల లాడుతోంది. తను ఎంత మందికి విద్యాదానం చేయలేదూ? స్వంత మనమడిని ఒడిలో కూర్చోబెట్టుకుని మనసారా ఆనందిస్తూ తన విద్యాధనాన్నంతా ఇవ్వలేక పోతున్నాను. ఊహూ వీల్లేదు వాడిని అలా వదిలివేయలేను. తాతయ్యా అనిపించుకుని ఒక్కసారి వీపుమీద ఎక్కించుకోవాలి...' 'అదేమిటీ అలా కూర్చున్నారు? మనసు బాగాలేదా? ఆ నీళ్ళేమిటీ కళ్ళకి?' కాఫీ

గ్లాసు అందిస్తూ పీటమీద బిగాలుగా కూర్చున్న భర్తని చూసి విస్తు బోయింది.

'ఆ!. .అహ...ఆ ఏంలేదు, మా స్నేహితుడు పోయొచ్చేడు, అంతే! సరేగాని ఇవాళ సాయంత్రం బస్సులో వెళ్ళి రేపు సాయంత్రానికి వచ్చేస్తాను. ఉండగలవా? లేకపోతే వాళ్ళ రఘును వాడి చెల్లిని రేపంతా మనింట్లోనే ఉంచుకో.' పంచకొనతో కళ్ళ నీళ్ళు తుడుచుకుంటు కంగారుగ అన్నారు మేష్టారు.

'సరిపోయింది. వాళ్ళు మనింట్లో వుంటారా? రఘుకి తాత పక్కలోగాని నిద్రే పట్టదు. వాడి చెల్లికి బామ్మ చంకగాని పనికి రాదు. ఆ చంటిపిల్ల మటుకు ఇంకా వాళ్ళమ్మదగ్గరుంటుందిగాని కాన్నాళ్ళయితే అదీ తాత వీపో బామ్మ మెడో పట్టుకోదూ? సరేలెండి నే నెలాగో వుంటాను. పగలంతా ఒంటరిగ ఉండటం ఎలాగు అం వాటే! రాత్రి ఏదో రామస్మరణ చేసుకుంటా లేదా పనిమనిషి రంగమ్మని పిలిపించుకుంటాను.'

మేష్టారు మరేం మాట్లాడలేకపోయాడు'

*               *               *               *

'అమ్మాయి తలుపు తీయమ్మా'

ఎడ్రసు తెలుసుకుని ఇల్లు వెదకి పట్టుకుని తలుపుమీద చేయి వేయబోయేటప్పుడు చేయి వణికింది. కాళ్ళు వణికేయి, ఏదో చేయరాని పని చేస్తున్నట్లు గుండె వేగం హెచ్చింది. వెనుదిరిగి 'వెళ్ళిపోదామా' అనుకున్నారు. ఎన్నడు ముఖమైనా చూడని కోడలిని ఎలా పలక్కరించాలా అనుకున్నారు. నిరసనగ చూస్తుందేమో! ఈసడిస్తుందేమో? కానీయ్ నేను మాత్రం వాళ్ళ కోసం వచ్చానా? ఆ పసివాడికోసం వచ్చాను. చూస్తాను వెళ్ళిపోతాను. వీలైతే వెంట తీసుకెళ్ళిపోతాను. ఆ! అంతే!! వాళ్ళతో నాకేం పని? గుండె చిక్క పట్టుకుని బింకంగ మేస్లెక్కి గంభీరంగ తలుపు తట్టేరు.

'ఎవరూ!' తలుపు తెరచి 'ఎవరికోసం?' అన్నది రాధ. అపరిచిత వ్యక్తిని పరికిస్తూ.

'నేనూ...నేను...ప్రసాదు ఇల్లు ఇదేనా!' ఎంత బిగుసుకున్నప్పటికీ రాధ ముఖం చూడగానే కంగారు పడక తప్పలేదు మేష్టారుకి.

'ఆ. ఇదే. మీరు ఏం పనిమీద వచ్చారో ఈ రాత్రిపూట! వారు కాంపు వెళ్ళారు. రేపుగాని రారు. ఆఫీసు పనిమీద వచ్చారా మీరూ'

ప్రసాదుకోసం చాలామంది వచ్చిపోతూ వుంటారు ఆఫీసు పని మీద. ఆ బాపతేమో అనుకున్నది. అయితే చేతిలో సంచీ అదీ చూసి సంశయంతోనే అడిగింది.

కలుక్కుమన్నది మేష్టారు హృదయం. 'తాను ఆఫీసు పని మీద వచ్చిన పరాయి వాడా!' అంతలోనే సర్దుకున్నారు. అబ్బాయి ఊళ్ళో లేడని తెలుసుకుని అంతరంలో ఏదో తృప్తి ననుభవించారు. వాడి కళ్ళ పడకుండా పోవచ్చునని!

'కాదమ్మాయ్ నేను ప్రసాదుకి పెద్ద తండ్రిని ఏదీ రాకపోకలు లేకపోవడంనుంచి నేను నీకు తెలియదు. ఏమిటో బంధుత్వాలు మరుగునపడిపోతే కన్నవాళ్ళే గుర్తు తెలియదు. ఏదో ఊళ్లో పనుండి వచ్చాను. చూసిపోదామని...'

'అయ్యో! అలాగా!! ఎంత మంచిరోజు రండి మామగారు. లోపలికి రండి ఎన్నడూ చూడలేదు కదా అందుకని ఎరగను క్షమించండి మనసు చిన్నబుచ్చుకున్నారేమో లోపలికి రండి ఆ సంచీ ఇలా ఇవ్వండి కాళ్ళు కడుక్కోండి. వంట తయారుగానే వున్నది భోజనం చేద్దురుగాని'. ఆప్యాయం వేడికోలు, మనన్నలన్నీ మిళితమైన రాధ ముఖం చూసి చకితులయ్యారు. అత్తవారివైపు బంధువులు వస్తే ఇంత సంబరపడిపోయే కోడలని ఎప్పుడూ ఊహించలేదు. అందునా ఎన్నడూ రాకపోకలు లేక పట్టుదలతో ఉన్నప్పుడు ఇలా ఏనుగెక్కినంత సంబరంగా హడావిడి పడుతున్న రాధని చూస్తే నిజంగానే

ఆయన కడుపు నిండిపోయింది. లోపలికి వచ్చి ముచ్చటగవున్న ఇల్లు కళకళలాడే కోడలి ముఖం చూసి మురిసిపోయేరు రంగనాథంగారు నలుమూలలా కలియచూసి చటుక్కున అడిగేరు.

'అవును గాని బాబు ఏడమ్మా కనిపించడేం! పేరేమిటీ! 'వాడు ప్రయివేటుకు వెళ్ళాడు మామగారూ. ఈపాటికి వచ్చేస్తు వుండాలి. ప్రక్క సందులోనే. ఏమిటో ఆయనకి తీరుబడి ఉండదు. నా దగ్గర వీడికి భయంలేదు. అందుకని వాడిని ఇలా పరాయివాళ్ళ దగ్గరకి ప్రయివేటుకి పంపించాల్సి వస్తోంది. వాళ్ళ తాతగారి పేరే రంగనాథం!'

'తాతగారి పేరు రంగనాథం!' మనసులో గొణుక్కున్నారు. ఆనందం ఉబికిపోతూ అలాగ!' అనటం తప్ప మరేమీ మాట్లాడలేక పోతున్నారు.

'అవును మామగారూ. ఏమిటో పట్టుదలలకి అర్థం ఉండదు మా పెళ్ళి మూలంగా అటు కన్నవారికి ఇటు అత్తగారికి దూరమై అనురాగాలు, ఆదరాలు అన్న పదాలే మర్చిపోయాము. లేకపోతే వాడు అలా పరాయివాళ్ళ దగ్గర చదువుకునే కర్మేమిటి చెప్పండి! తాతగారి విద్య ఎందరిని ఉద్ధరించలేదూ? స్వంత మనుమడై ఉండి వీడు ఇలా పాకులాడవలసి వచ్చింది. ఆయనకి ఎన్నోసార్లు చెప్పాను. మీరేనా పట్టుదల వదలి అత్తయ్య మామయ్యని తీసుకురండని. ఆయన వింటుంటేనా! నాన్నకి లేని ప్రేమ నాకెందుకుండాలీ అంటారు? కాని నాకు తెలుసు మామగారూ—స్త్రీ హృదయం ఎంత క్షోభిస్తుందో అత్తయ్య ఎంత పరితపిస్తున్నారో నేను వెళ్ళి తీసుకునివద్దామను కున్నాను ఆయన ఒప్పుకోలేదు! పోనీ మా అమ్మనేనా చూసివస్తానంటే...మీ నాన్న కోపం తగ్గి వచ్చి తీసుకెళితే వెళ్ళగాని అంతేగాని నీ అంతట నీవు వెళ్తే నే సహించను అంటారు.' కళ్ళొత్తుకుంటున్న రాధని చూస్తుంటే రంగనాథంగారి మనసు ఆర్ద్రమైపోయింది ఇంత

కాలం పుట్టింటివారి మద్దతు ఉందనుకున్నానుగాని కొడుకు కోడలు దిక్కులేని పక్షుల్లా ఉన్నట్టు తెలియదు ఎంత ప్రారబ్ధం!

'అమ్మాయి నిజంగా మా వాడు...అదే మా తమ్ముడు ఎంత కఠినుడమ్మా! కొడుకు తన మాట వినలేదని పట్టుదలేగాని ముందు చూపులేని మనిషి. పత్రి మొండిపట్టు. మతిలేని మనిషా అని మతిలేని మనిషి!! భార్యని పీడిస్తూ కొడుకు కోడలికి దూరమై ఏం బావుకు చద్దామని: ఇప్పుడు రాగానే సరా?

'మామగారూ!... వద్దు అంతలేసి మాటలనకండి. ఎంతైనా ఆయన మాకు పూజ్యులు...తండ్రిలాంటివారు. ఏదో మా అదృష్టం ఇంతే అనుకుంటాము. ఇన్నాళ్ళకి రాకరాక వచ్చిన మిమ్మల్ని ఇలా కలత పెడుతున్నాను పాపిష్టిదాన్ని. లేవండి భోజనం చేద్దురుగాని. అదుగో రంగడు వచ్చేశాడు. ఇద్దరికి వడ్డించేస్తాను.'

'అమ్మా! మరేం..మరేం...అంటూ వచ్చేస్తూ ఆగి 'ఎవరమ్మా ఈ తాతగారు?' అన్నాడు కళ్ళు చిట్లించి ఎక్కడా చూడలేదే! అన్నట్టుగ. తనకు తెలుసున్న తాతల జాబితాలో ఈ తాత లేడే! కోమటికొట్టు గవరన్న తాత-తోటమాలి వీరన్నతాత ఇంకా పక్క మేడలో కాపురమున్న సీతాలు వాళ్ళ ముక్కు పొడుం తాత కూరగాయలు అమ్మే కోటయ్య తాత ఇంకా పోతే వేరుసెనక్కాయలమ్మే పాపన్న తాత-అప్పుడప్పుడు వచ్చే తత్వాలు పాడే తంబురతాత మరి...ఈ తాత ఎవరబ్బా! దర్జాగ కుర్చీలో కూర్చున్నాడు అచ్చం బడిలో మేష్టారిలాగ' ఆ చిన్నబుర్రలో జవాబు దొరకలేదు.

'ఈ తాతగారు మన తాతగారి బాబు. అంటే మీ నాన్నగారికి పెద్ద నాన్నగారు'— అన్నది రాధ కళ్ళనిండా వెలుగు నింపుకుని తనయుడివైపు చూస్తూ.

'రా బాబూ' రెండు చేతులు చాచి ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్నట్టు వాడిపోయి ఉన్నట్టు ఆశగ పిలిచారు రంగనాథంగారు.

'తాతగారూ' అంటూ ఆయన దగ్గరగా వెళ్ళి 'అయితే మా తాతగారు మీకు తమ్ముడా? ఆయన్నిక్కడికి తీసుకురండి. లేకపోతే మనమే వెళ్దాం పదండి. మా నాన్నగారు ఊరికి వెళ్లారుగా త్వరగ వెళ్ళి వచ్చేద్దాం...'

మేష్టారి కళ్ళు అశ్రుపూరితాలయి కంఠం గద్గదమైపోతోంది. 'అచ్చు అవే కళ్ళు అదే ముక్కు. అచ్చు గ్రుద్దినట్టు ప్రసాదు పోలికే. నాయనా ప్రసాదు ఎన్నాళ్ళయిందిరా నిన్ను చూసి' ఒళ్లు తెలియనంత గాఢంగా కౌగలించుకున్నారు మనమణ్ణి.

*     *     *     *

వర్దన్నకొలదిదగ్గర కూర్చుని కొసిరి కొసిరి తినిపించిన కోడలి చేతి భోజనం—ఉత్సాహంగా స్కూలు విషయాలు చెప్తు పంక్తిని కూర్చున్న మనమడి ముద్దు మాటలు రంగనాథంగార్ని ఉద్విగ్నంచేస్తు న్నాయి.తను కొన్నివందలమంది పిల్లలకి విద్య ధారపోసేరు.అందులో కొంతమంది తనకెంతో అభిమాన పాత్రులు అయారు. కాని కాని రంగడు కొన్నిగంటల సమయంలోనే ఇంత చేరువయ్యాడు. వీడి తర్వాతే మిగతా వాళ్ళంతా. ఈ మమత చెప్పలేనిది! అనాడు 'లక్ష్మి' అందుకే ఏడ్చింది. నాకు అర్థం కాదన్నది. కాని అర్థమయింది. ఈ తీపిని వర్ణించే శక్తి నా సర్వీసులో అర్జించలేకపోయేను. వీడిని వదలి ఎలా వెళ్ళగలను?' పక్కలో పడుకున్న రంగడి బుగ్గ మృదువుగా నిమిరారు. తెల్లవారగట్ల మెలుకువ వచ్చిన మేష్టారు అయనకి అరుగుమీద తాతయ్య వడిలో కూర్చున్న రఘు మెదిలాడు.

ఆ రోజంతా తాత మనుమలు బజారంతా తిరిగేరు. రంగడిని బడి మానిపించి మరీ త్రిప్పారు రంగనాథం మేష్టారు. పుస్తకాలు బొమ్మలు, కొన్నారు. చీర రవికల గుడ్డకొని పూలు పొట్లం కట్టించి ఇంటికి చేరేరు.

'ఎందుకు మామగారూ ఇవన్నీ?' అనవసరంగా డబ్బు ఖర్చు పెట్టారని నొచ్చుకున్నది రాధ.

'ఫర్వాలేదు అలా అనకమ్మా. నేనే మీ మామగార్ని అయితే అలా అందువా? ఏదో నా ఆనందం! మళ్లీ సాయంత్రం వెళ్ళిపోవాలి చీర కట్టుకో తల్లీ చూస్తాను' అన్నారు హృదయమంతా నిండిన ఆనందంతో.

రాధ చీర కట్టుకొని మామగార్కి నమస్కరించింది. 'దీర్ఘ సుమంగళీభవ. నూరేళ్ళు మీ దంపతులు, బాబు సుఖంగ వర్ధిలండి' తలమీద చేయి వేసి మరీ దీవించారు మామగారూ, మీరు ఆయన వచ్చేదాకా ఉండండి. అసలు ఆయన కోప్పడుతారు గూడాను.' రాధ అన్నది. 'అవును తాటియ్యా నువ్వుఇప్పుడు వెళ్ళడానికి వీల్లేదు బాబు వంత పాడేడు. మేష్టారుకీ ఉండాలని అసలు అక్కడే వుండిపోవాలనీ ఉన్నది కాని అవతల 'లక్ష్మి' ఒంటరిగ వుంది! అదీగాక ప్రసాదు తనని చూస్తే కోడలికి తెలిస్తే...ఉహూ ఇప్పుడు కాదమ్మా మళ్లావస్తాలే బాబుని వదల్లేక వెళ్ళారు

*   *   *   *

'ఇదేమిటీ ఈ చీర ఎప్పుడు కొన్నావు! నాకు తెలియని కొత్త చీర నీ కెక్కడిదీ' ఇంట్లోకి రాగానే కొత్త చీరతో కనిపించిన లక్ష్మమ్మని చూస్తూ వింతగ అడిగేడు మేష్టారు.

'అవును ఈ చీర మీకు తెలియనిదే అంతేకాదు దీని విలువా మీకు తెలియదు. భగవంతుడికి ఇన్నాళ్ళకి నా మీద దయ గల్గింది. మీరు నిన్న పూరికి వెళ్ళగానే అబ్బాయి వచ్చాడు. నా తండ్రి నన్ను చూసి ఎంత సంతోషపడ్డాడని! కడుపార భోజనం తిని అమ్మా ఎప్పుడూ ఇలాగే నువ్వు నాకు దగ్గర కూర్చుని తినిపిస్తూ ఉండాలమ్మా భగవంతుణి అలా ప్రార్థిస్తానమ్మా అన్నాడు నా బంగారు నాయన!' కొత్తచీర కొంగుతో కళ్లు వత్తుకున్నది.

'అ!?? అయితే అబ్బాయి కాంపు వెళ్ళ లేదా; నాలాగే వాడు కూడా!' ఆశ్చర్యంలో మునిగి స్వగతంలో అనుకోవలసిన మాటలు పైకే అనేసేరు.

'ఏమిటీ మీ రనేది' మీరు స్నేహితుడ్ని చూడ్డానికి వెళ్ళలేదూ!' లక్ష్మమ్మ ప్రశ్నకి జవాబు చెప్పకుండ ముఖమంతా ఆనందం పులుము కున్నట్టు నుంచున్నారు. ఎప్పుడూ గంభీరంగ నిద్ర బిగుసుకున్నట్టు వుండే రంగనాథం మేష్టారు, ఇంతకాలం అజ్ఞాతవాసం చేస్తున్నట్టు ఇకపైన చేయలేనట్టు అంతరంలో దాగిన మమత మాత్రం పెదాల చాటున ముసిముసిగ నవ్వింది.



# గ్రీన్ రూమ్ నవ్వింది

(ఈ కథ విశ్వరచనలో మొదటి బహుమతి గెలుచుకుని 'విశ్వ సాహితి' సంస్థచే సన్మానార్హత పొందినది.)

రంగరాజ్ కారు మెల్లగా హోటల్ 'సరోవర్'లోకి జారింది.

కారు ఖరీదైంది.

హోటల్ కూడా ఖరీదైనదే!!

'నీలిమ' ఇంకా ఇంకా ఖరీదైనది!!!

ఆ నీలిమని చేపట్టగలిగిన 'రాజ్' చాలా అదృష్టవంతుడు. అందుకే రాజ్ నీలిమని చూసి నవ్వినప్పుడు పైకి గర్వంగా లోపల, కృతజ్ఞతగ చూస్తూ ఉంటాడు.

లక్షల కధికారి నీలిమ తండ్రి.

నీలిమ ఏకైక పుత్రిక.

నమ్మకమైన అల్లుడు...ఇల్లరికం రాగలవాడు...ఆస్థిని నాల్గింతలు చేయగలవాడు..కావాలా..వలవేసి గాలించేడు సత్యమూర్తిగారు.

అయితే... పీతలు, మండ్రగబ్బలు. ..బురదగొట్టలు చాలానే పడ్డాయి. వలలో...!

అందులో ఏ ఒక్కటి కూడా 'ఏక్వేరియమ్'లో వుంచతగ్గ బంగారు చేపలా కనుపించలేదు సత్యమూర్తి గార్కి!

అందం...చదువు...తెలివి...వున్న యువకుడు... పేదవాడైన కుర్రాడు కావాలి!—అలాంటి వాడైతేనే...తనకున్న సముద్రమంత ఆస్థిలో పడి... నీలిమను...బాగా చూడగలుగుతాడు!

లేకపోతే...వాడికే డబ్బుంటే...

'నీలిమ లాంటి' వాళ్ళని తనే కొనుక్కుంటాడు: (ఖరీదైన హోటళ్ళలో...) అలా కోనుక్కోలేని పేదవాడైతే—పర్సులో డబ్బు తను లెక్కపెట్టి ఇచ్చినప్పుడు చచ్చినట్టు తీసుకుంటాడు!

ఇంతకీ—

నీలిమ తండ్రికి, డబ్బుంది కానీ—అందమైన కూతురులేదు:-

అందాన్ని.. ఆనందాన్ని. .ఆదర్శాలనీ... ఆవేశానీ జేబుల నిండా నింపుకున్న కుర్రాళ్ళని 'తూకంవేసి' జీవితాలని కొనగల తెలివితేటలు...డబ్బు సత్యమూర్తి గార్కి వున్నాయి గనుక.

అలా జేబులు బరువుగ నింపుకున్న రంగరాజ్ 'జీవితాన్ని' టోకుబేరంలా కొనేసేరు! :—

కారు లాక్ చేసి. లాన్ లోకి నడిచేడు...నీలిమ నడుం చుట్టు చేయివేసి.

పచ్చలు పొదిగిన పట్టు తివాసీలా వుంది...నేలంతా మధ్య మధ్య ముత్యాలు జతబరచినట్టు మంచు బిందువులు... అక్కడక్కడ జరీతో డిజైన్ వేసినట్టు ...చంద్రవంకలాగ చెమ్కీలుకుట్టినట్టు... ...కుర్చీలు. టేబుళ్ళు!.

అందాలు వెదజల్లుకుని ..పందేలు వేసుకుని ఏడుకుంటున్నారు అక్కడున్నా ఆదృష్టవంతులు!.

మనసుని చంపుకుని...వయసుని మర్చిపోయి-అహోరాత్రులు ఎదుటివారి సేవలకే అంకితమైనట్టున్న వేరర్లు...క్లీనర్లు...దురదృష్ట వంతులు!

నీలిమ చల్లని ఐస్‌క్రీమ్ మెల్ల మెల్లగా తింటున్నప్పుడు... రాజ్...వేడివేడి కాఫీ రెండు గుక్కల్లో త్రాగేసి...కుర్చీలో జార్లబడి...అప్పుడే వెలిగిన మెర్క్యురీ దీపాలని చూసేడు!

దీపాల్లాంటి పాపాయిలు దూరంగా ఉయ్యాలలూగుతున్నారు. ముద్దుగ బొద్దుగ...బంతుల్లా కొందరుంటే...బక్కగ...నల్లగ. విలువైన బట్టల్లో. లోపాలని దాచుకున్నట్టు కొందరున్నారు. ఆయాలు ఎత్తుకున్న పాపాలు. అమ్మ చేతులు పట్టుకున్న బాబులు.. రకాల వారీగ...రంగు బెలూన్‌లా వున్నారు.

రాజ్‌కి ఓ చిన్న ఊహ కల్గింది!

అందులో ఓ బాబో...పాపో.. తమ వాళ్ళైతే. ఎవరి పోలికలో వుంటారు!

తనలాగనా !!

నీలిమ లాగనా!!

సరిగ్గా ఆ సమయంలోనే. ఓ చిన్నకారు...ఆగింది అందులో నుంచి రేకులు విచ్చుకున్న గులాబీలాగ 'హేమ'దిగింది ఆమె ప్రక్కనే భర్త! భుజం మీద చేయివేసి జాగ్రత్తగా నడిపించుకుంటు- రాజ్ ప్రక్కనుంచే తీసుకువెళ్ళి... కాస్తదూరంలో ఖాళీ కుర్చీలో కూర్చోబెట్టేడు.

అ ప్రయత్నంగ అటుచూసేడు రాజ్!

అనుకోకుండా ఇటుతిరిగింది హేమ!!

ఓ క్షణం ఇద్దరి కళ్ళు సర్వ ప్రపంచాన్ని మర్చిపోయి...కొన్ని సంవత్సరాల వెనక్కి... తాము ఇంకా జీవితాన్ని స్వచ్ఛంగ... నిర్మలంగ-వెన్నెలంత నిజాయితీగ...సెలఏరంత అమాయకంగ.. మంచిగంధమంత కమ్మగ...నమ్మిన్నాటి రోజుల్లోకి వెళ్ళిపోయి నిల్చిపోయాయి।

కాసేప్పటికి తేరుకుని-భవిష్యత్తులోకి జారుకున్నాక...

ఇద్దరు పెదవులమీద పలుచని చిరునవ్వు కదలాడింది।

కానీ- 'గ్రీన్‌రూమ్' పగలబడి నవ్వింది!!

నాటకంవేసే వ్యక్తి వేషం వేసుకుని స్టేజి మీదికి వచ్చి నటిస్తారు! అప్పుడు వాడు రాజో, నౌకరో, ఆఫీసరో, గుమస్తానో జడ్జీగానో... డాక్టరో, ఎవరైనా కావచ్చు! ఆ భావంతో వాడు ప్రేక్షకులని నమ్మించేస్తాడు।

గ్రీన్ రూమ్‌లో వేషం తీసుకున్నాక-అసలు వ్యక్తి బయట పడతాడు, వేషానికి ముందూ, వేషానికి తరువాత- నిజమైన వ్యక్తిని. గ్రీన్‌రూమ్ చూస్తునే వుంటుంది!

మనిషి జీవితంలో అతను చేసే ప్రతి పనికి అంతరాత్మ గ్రీన్ రూమ్ లాంటిది।!

హేమ భర్త ఏదేదో తెప్పిస్తున్నాడు. అన్య మనస్కంగ హేమ తింటోంది. రాజ్ ఆమె భర్తని చూసేడు! యాభై ఏళ్ళదాటి వుంటాయి.

ముప్పైఏళ్ళ హేమకి యాభైఏళ్ళ భర్తా ?

అన్యాయం, ఎలా చేసుకుందీ?

నీలిమ రాజ్ చేతిమీద చేయివేసి చిన్నగ నొక్కింది.

"ఏమిటి పరధ్యాన్నం?"-ఉలిక్కిపడి చూసేడు.

ఛామనఛాయగ మేకప్ ఎక్కువగ. చిన్న కళ్ళకి కాటుక దిద్ది పెద్ద పెద్దగ కనిపించెలా తిప్పుతూ.-

గాజు పూసలు. చెమ్కీదండలు... ప్లాస్టిక్ పువ్వులు...గురుకు తెప్పించే ఈ నీలిమని తనెలా చేసుకున్నాడు? హేమని చూసేకనే- తను ఇలా అలా అనుకుంటున్నాడా ?- ఆపైన అక్కడ ఎక్కువసేపు కూర్చోలేదు. లేచి రాబోతూ హేమని చూడబోయాడు... కానీ నీలిమ ఎత్తుముడి అడ్డం వచ్చింది, శిఖరంలాగ !

వెళ్ళిపోతున్న రాజ్‌ని మరోసారి చూడాలనుకుని ప్రక్కకి చూసింది, హేమ, మంచినీళ్ళ గ్లాసు అందుకుందుకు ముందుకు వంగిన భర్త ముఖం అడ్డుతగిలి- మబ్బులా మూసేసింది. ఆమె చూపుని.

ఇంతకాలం-ఈ భర్తదుబ్బుజుట్టు... ఓ బంగారపు కట్టుడు పన్ను... మొటిమలవల్ల గుంటలు పడ్డ బుగ్గలు... ఎలా చూడగల్గుతున్నారా ? అనుకుంది హేమ, ఆ వెంటనే తమకారు... చిన్నసైజు బంగ్లా పల్లెటూరో పొలాలు...వరుసగ గుర్తుకొచ్చి...తమ ఆఫీసర్‌గారి భార్యగ, రెండవ భార్యఐతేనేమి-మొదటామె లేను కదా? ఆపైన ఆమె సంతానం మొగ పిల్లలిద్దరూ ఎక్కడో చదువుకుంటున్నారు. తనకేం బాధ?- అన్నీ గుర్తుకొచ్చి తృప్తి పడింది:-

కారులో ఇల్లుచేరిన రాజ్-ఆ రాత్రి దోమతెరలో బెడ్‌లైట్ వెలుగులో...నైట్ గౌను వేసుకొని పడుకున్న నీలిమలో- హేమని చూసుకుందుకు ప్రయత్నించేడు:- 'ఇంత మంచి డ్రస్సులో హేమ ఎంత అందంగ వుంటుంది. బహుశా ఇప్పుడు తనుకూడా ఇలాంటి గౌనులో వాళ్ళగదిలో ఓహ్ । వద్దు! నేనాలోచించ లేను ।।

అనుకుని చరాలున అల్మారా దగ్గరకు వెళ్ళి బాటిల్ ఓపెన్ చేసేడు ।।

చింతామణి పెటే... గడ గడ మాట్లాడే... కొనవూపిరి ప్రాణి లాగ ద్రవం గొంతులో జారగానే - గతం గిరగిర చక్రంలా తిరిగింది । బాటిల్ మీద సినీమా తెర । దానిలో రంగరాజ్ అనబడే బి యే స్టూడెంట్ - అతని క్లాస్‌మేట్ అందాల హేమ ।

హేమా! నువ్విలా నవ్వకు - నాకు పిచ్చెక్కుతోంది! ఆ తర్వాత ఏం చేస్తానో నాకే తెలియదు. మంచుపుంతల్లో పడితే భలేగా వుంటుందంటారుగానీ ప్రేయసి. నవ్వితే... వెన్నెల జల్లులా వుంటుం దని- నేనొక కావ్యం రాయనా?

'రంగా నువ్వు ఇప్పటికే పిచ్చివాడి వయ్యావ్! ఇంకా పిచ్చి ఎక్కడ మేమిటి? నేనంటే నీకు ఎంత ఇష్టం వున్నా మరీ ఇంత అల్లరా? నిన్న క్లాసులో చంద్రం నా మీద తగిలేలని వాడి వేళ్ళమీద రూళ్ళకర్రతో బాదేవుట గేటుదగ్గర పాపం! వేలుచిట్లి ఆస్పత్రికి వెళ్ళి కట్టేయించు కున్నాడు—

మాబాగా అయ్యింది! మరోసారి అలాంటి సాహసం చెయ్యడు లేకపోతే నా హేమ జడ తగులుతాడా? హేమంటే నా ప్రాణం!-

హేమ ఆరాధనగ చూసింది. రాజ్ దగ్గరగ రాబోయి ఆమె వారించేసరికి ఆగిపోయేడు.

'ఛ! నువ్వెప్పుడు ఇంతే హేమూ; హద్దులు పెద్దలు అంటు- దూరంగ వుంచి పూరిస్తావ్!

హేమ నవ్వులు.!!

'అదుగో... అదుగో! అలాగే! నవ్వవద్దన్నది వెన్నెలంతా పిచికారీలో నింపి...మీదకు చిందించినట్టు, షవర్‌బాత్ చేయించినట్టు ...అబ్బ! హేమూ నేనాగలేను?-

'హుష్ ఏమిటి రంగా మరీనీ డోస్ ఎక్కువైపోతోంది? ఖర్మంజాలక రేపు మన పెళ్ళయ్యాక ఎవరైనా నాతో మాట్లాడితే... వాళ్ళని అమాంతం పీకనొక్కి చంపేసేలాగ వున్నావు:- హేమ ముఖంలో నిష్ఠురపు సూచనలు...మూతి బిగింపులు...చిన్న అలక!

మెల్ల మెల్లగ ఆసీన్ కరిగిపోయి మరొకటి! ప్రియమిత్రుడు. సుబ్బుగాడు రాజ్ కాలేజీ గేటుప్రక్కగ- 'ఏరా ఫూల్! నీకు మతి

పోతోందేంట్రా? ఇంకొన్నాళ్ళు ఇలాగే నీ వ్యవహారం సాగిందంటే- అందరు నిన్ను పిచ్చాసుపత్రిలో పడేస్తారు;- తెలుసా? మనసుకాస్త అదుపులో పెట్టుకుంటువుండు. మొన్న అజాన్‌గాణ్ణి చింతచెట్టు కింద చావగొట్టేవుట? ఏం వచ్చింది?-

ఏం వచ్చిందా? వాడికి, ఆ జాన్ గాడికి, నల్ల భూతంగాడికి మాయరోగం వచ్చింది:- లేకపోతే హేమ అందాన్ని వర్ణించడానికి ఎన్నిగుండెల్రా వాడికి? అందుకే చావగొట్టేను;-

'ఉహూ! అయితే హేమని ఎవరూ మెచ్చుకో గూడదు...తాక గూడదు. మాట్లాడకూడదు...ఏం? అవునా? అందమైన వస్తువును ఎవరూ చూడకూడదుట్రా? అది నీ ఒక్కడికే సొంతమా?'-

'ఒరే సుబ్బిగా! స్నేహితుడివయ్యావుగనుక బ్రతికిపోయావ్' లేకపోతే- ఏం చేసేవాడినో:- హేమూ నాదిరా, నా కోసమే పుట్టింది, జన్మంతా ఆమె ఆరాధన నాకొక్కడికే పరిమితం, ఎవ్వడైనా పిచ్చి పిచ్చిగ వాగాలో...అంటుచూస్తారా?- జ్ఞావకం వుందా? ఆ పిల్లిగడ్డం రహీముగాడు ఓసారి నా హేమును చూసి వెకిలిగ నవ్వి- వెర్రిగ ఈలవేసేడు... అప్పుడాతను నోటిమీద బిగిడికిల గుద్దు విసిరేను, అందుకే ముందరి పన్ను వూడిపోయింది.

'బాగా వుందిలే నీ గొడవ! కనీసం నీ చదువు పూర్తయేదాకా- నీ హీరో ఫీట్సు ఆపు శతదినోత్సవాలు నడుపు కుంటున్నాయి!'- సుబ్బులు గాడి హెచ్చరింపు.

'చూస్తాలే! మరీ అంత ఉద్రేకం వచ్చినప్పుడు తప్ప, లేకపోతే నెలకి ఒకటో, రెండో చేసి కంట్రోల్ చేసుకుంటాను :- అని రాజ్ వాగ్దానం చేసేడు. ఆసీను కరిగి పోయింది.

ఆ తరువాత ఓ సారి తమవీథిలో వుండే హెడ్‌క్లార్క్- విశ్వనాథాన్ని తనెలా భయపెట్టేడో గుర్తుకు వచ్చింది.

మసక మసకగా బొమ్మలు కనిపించాయి. బాటిల్ మీద.

విశ్వనాథం ఇంటి ముందు భాగంలో రాజ్ మరొక ఇద్దరు కుర్రాళ్ళు .. 'ఒరేయ్! విశ్శిగా! ముసలినక్కా!'

ఒళ్లు దగ్గర పెట్టుకోరా! లేకపోతే నీ రోజులు దగ్గర పట్టున్నా యనుకో? పెళ్ళాం పిల్లలున్నారని వెనకాడుతున్నాను గాని లేకపోతే రేపీపాటికి నీ దహనక్రియలకి చందాలు వేయించేస్తాను!—ఎంత ధైర్యంరా నీకు? నీ వయసు మరచిపోతున్నావట్రా? పిల్లలుగల తండ్రివి గదరా? ఏంపోయే కాలంరా?— నా హేమానిచూసి... రాని దగ్గుని తెచ్చుకుని—ఘూతద్దాల కళ్ళజోళ్ళనుంచి...చాటుచాటుగా ఓరకంట చూస్తావా? పనిలేకపోయినా సందు చివరకు పచార్లు చేస్తావ్? జాగ్రత్త! బ్రతుకుమీద ఆశఉంటే-బుద్ధిగవుండు? అనిరాజ్ రంకెలు వేసేడు ఇరుగు పొరుగు కిటికీగుండా గోడలమీద నుంచి చూసేరు.

మళ్ళీ వారంలో విశ్వనాథంగారు ట్రాన్స్ఫర్ చేయించుకుని వెళ్ళిపోయారు. ఆవిధంగా రంగరాజ్ 'దిగ్రేట్' అనుపించుకున్నాడు. హేమ పేరు తలవటానికే అందరు భయపడిపోయేవారు... హేమ కేవలం రంగరాజ్ సొత్తు అనేవారు:

మరి ఇలా జరిగిలదేం?

అవును ఎందుకిలా జరిగింది!

బాటిల్ లో ద్రవం గ్లాసులోకి ఒలికి నోట్లోకి జారింది.

మస్తిష్కంలో..ఓమూల గత ఏడెనిమిది సంవత్సరాలక్రితం దాగిన 'ఫిల్మ్' బాటిల్ మీదకి దిగింది!

—ఆరోజు రంగరాజ్ తండ్రి వైకుంఠంగారు నిజంగా అర చేతిలో వైకుంఠం చూస్తున్నంత సంతోషంగ వున్నారు.

ఆయనతోపాటు తల్లి..నానమ్మ కూడా మురిసిపోతున్నారు.

'ఏమిటబ్బా ఈ ఆశ్చర్యం?'

అనుకున్నాడు రంగరాజ్.

'బహుశా చెల్లాయికి సంబంధం కుదిరిందేమో? లేకపోతే—

'నాన్న పెంక్షన్ కాయితాలు సవ్యంగ సంతకాలు చేయింకుని వచ్చాయేయో? అదీకాకపోతే

పాలెంలో మా పెంకుటింట్లో అద్దెకున్న పోస్టుమాస్టర్‌గారు ఆర్నెల్ల అద్దె ఒకేసారి పంపించేసి వుంటాడు'-అనుకుని అంతేనా? అని అడిగేడు.

''ఛస్! వూరుకోరా గడుగ్గాయి!'' అని అభిమానంగ నానమ్మ కసిరింది.

వాడి జాతకమే అంత!'' అని అమ్మ పొగిడింది.

ప్చా! ప్చా! వాణ్ణి పూరికే పూదర గొట్టేయంకండి! రేపు మనల్ని వినుకోగలడు'--అది నాన్న సంబరంగ-తనని పైఅంతస్థులో నిలుపుతూ అన్న డైలాగు.

''ఏమిటమ్మా ఇదంతా? ఉన్నట్టుండి మీరంతా ఎందుకిలా అయిపోయారు? ఇంతకుముందు మీరేమీ తిన్నారో...త్రాగేరో చెప్పండి! డాక్టరకి చూపిస్తాను'' రాజ్ అసహనంగ అరచేడు.

నాన్న నిండుగ నవ్వి సంగతి సందర్భం వివరించి,నీ అదృష్టం ఏర్పడిందిరా నాయనా? అంతటి లక్షాధికారీ సత్యమూర్తిగారు నిన్ను అల్లుణ్ణి చేసుకునేందుకు ఇష్టపడ్డారొ!''-అన్నారు.

''నాన్నా?! ఏమిటి మీరనేది?''

'అవునురా! నిజమే! లక్షల ఆస్థి నీది!!'

''నో!నో! నాకిష్టంలేదు: నా ప్రాణం ఉండగ హేమ స్థానంలో మరొకరుండరు!' ఆక్షణంలో తండ్రికి ఎంత కోపం వచ్చిందో?

అయినా రాజ్ చలించలేదు!

కానీ..కానీ హేమ స్థానంలో ఇప్పుడు సరిమ ఉంది!

ఎలా ఉంది?;

రాజ్ బుర్ర గిరగిర తిరిగింది.

తలక్రిందులుగ వంకరటింకరగ.. ముందర వెనుకగ...పాత స్మృతులు...తెగ అవస్థపడి ఓ రూపంలోకి వచ్చాయి..ఓలగ కొన్ని బొమ్మల ఆకారాలు...బాటిల్ మీద పడ్డాయి.

ఏనభై ఏళ్ళ నానమ్మ ప్రక్కగా వైకుంఠంగారు చెప్పాన్నారు.

ఒరే! రాజా..నువ్వు హేమని చేసుకుంటే నేను కాదంటానా? నీ ప్రేమ తిరస్కరించేటంత మూర్ఖుణ్ని కాదురా! ఎందుచేతంటే నేనూ మీ అమ్మని-ప్రేమించే పెళ్ళి చేసుకున్నాను! నిజమేరా ఏందుకలా ఆశ్చర్యపోతావ్? ప్రేమించడం నీ ఒక్కడి జన్మహక్కు అనుకుంటున్నావా?--కాకపోతే అమ్మని ప్రేమించి చేసుకునేంత గొప్పేముంది అనుకుంటున్నావా?-- ఇప్పుడలాగే ఉందిలే మీ అమ్మ! అయుగురు పిల్లల తల్లికదా? కానీ--ఇద్దరు పిల్లలు పుట్టేవరకే మీ అమ్మ అందం వసివాడిపోయింది--అది సహజంరా! టీన్‌ఏజ్‌లో ఉన్న నిగారింపు.. సేవశీకం..సౌకుమార్యం-పాతికదాటేక ఉండవు: అప్పుడు ఛీదరింపులు..ఎకసిక్కాలు .బాసుండవు: నేను ఆనాటినుంచి ఈనాటివరకు మీ అమ్మని ఒక్కలాగే ప్రేమిస్తున్నానురా! చిత్రం చాలక పోయినా..అవస్థలు పడుతున్నా...ఆరోగ్యాలు పాడవుతున్నా..నేను మీ అమ్మని ఇంకా కాపురానికి వచ్చిన కొత్తలో. చూసినట్టే చూస్తున్నాను నా ఫీలింగ్స్‌లో ఏం మార్పు రాలేదు.- కనుక నువ్వు కూడా మన స్ఫూర్తిగ ప్రేమించిన నీ హేమని-అందం తరిగినా..ప్రమాదవశాత్తు

రోగాలవల్ల వికారంగా తయారైనా. దీదరికం వవాలు చేసినా... దేవతలాగనే చూస్తానని నాకు మాట ఇయ్యి!! లేకపోతే-అతర్వాత ఆ పిల్లని నువ్వు కష్టపెడితే నేను సహించను!! ఎందుకంటే మనం సామాన్యులం--కష్టాలు, బాధలు, ఇబ్బందులు-మనం కోరుకున్న వరాలు!- అవి మన వెంటవెంటే ఉంటాయి! కనుక అన్యాయం మర్చిపోకుండా-నువ్వు హేమని పెళ్ళి చేసుకో...అంతటి అందమైన కోకిలను నేను మాత్రం ఎందుకు ఒప్పుకోనూ?!-''అనేసి చెప్పేసుకుని బయటికి వెళ్ళబోటగా ఉండే--

నానమ్మ ముఖం ముడుచుకుని-''ఒరేయ్‌వైకుంఠం! నా ఎదురుగుండా నువ్వా పిల్లని మెచ్చుకుంటే సహించనా లేయ్! నా కోడలు ఎంత అందంగ ఉండేదో-నా కళ్ళతో నేను చూసేను! నీ కోడలి అందం నా ముందు చెప్పకు నా కోడలితో పోలికేలేదు. ఆ పిల్లకి!'' అనేసి చక్కాబోయింది! ''అలాగేలేమ్మా! ఆ నిజం రాజ్‌కి తెలియదు గదా?! అని వైకుంఠంగారు వెళ్ళిపోయారు.

మిగిలిపోయిన రాజ్ దిమ్మరబోయి-'అమ్మ అంత అందంగా ఉండేదా? నిజమా?' అనుకున్నాడు!--

'జబ్బువల్ల ఊడిపోయిన జానెడు జుట్టు...ఎప్పుడో తగిలిన గాయం తాలూకు మచ్చ గడ్డం క్రింద..ఎండిన దవడలు,. కాంతి తగ్గిన కళ్ళు'...అమ్మ అందమైనదా?!--

'అమ్మని అమృతమయిగ, కరుణామూర్తిగ..త్యాగమూర్తిగ' మాత్రమే చూడగల్గే రాజ్...అమ్మ అందమైనదిగ హేమకంటె అందమైనదిగ ఊహించేసరికి...హేమపట్ల తన ప్రగాఢమైన ప్రేమని శంకించుకో వలసివచ్చింది! హేమకూడా కొన్నాళ్ళకి అమ్మలాగే.. తయారైతే!-ఆర్థిక ఇబ్బందులు...చికాకులు...బాధ్యతలు...వీటన్నిటి మధ్య హేమనిచూసి ఊరట పొందగలడా?-సామాన్య జీవితాలకి... ఆనందాలు అందుబాటులో ఉంటాయా!

సత్యమూర్తి రికి అల్లుడైతే!!

అయ్యాడు?-- మనసుని నొక్కి...ప్రేమని వెనక్కి జరిపి అంతరాత్మని జోగొట్టి..నీలిమ మెళ్ళో తాళిగట్టేడు.

ఆకాశమంత పందిట్లో...భూదేవంత అరుగుమీద పుర ప్రముఖులు...మంత్రులు..పెద్దలు...నేల ఈనినంత జనంమధ్య రంగరాజ్ ప్రక్కన నీలిమ స్థానం పొందింది!--ఈ అదృష్టం...ఈ ఘనత. కేవలం తనకోనమే అనుకున్నాడు!- ఆ సమయంలో హేమసంగతి గుర్తు రాలేదు.

కానీ...కానీ...

ఈ రోజు...హోటల్లో హేమ కనిపించింది.

అజంతా బొమ్మలా ఉంది.

వయస్సు మళ్ళిన భర్తతో కూడా వచ్చింది.ఆనాటి విశ్వనాథం చంద్రం..రహీం.,జాన్..కనిపించి నవ్వినట్లయింది.

సుబ్బులు గాడు అదోలా నవ్వినట్లయింది.

అన్నింటికన్నా మించి...దోమ తెరలో నీలిమ తన సొగసును చూపిస్తుంటే ఏమూలో వెగటులాంటి భావం కదలుతూ ఉంటే-

బ్రతికిఉన్నా చచ్చినట్టేఉన్న ఆ మనిషిని చూసి-గ్రీన్‌రూమ్ పగలబడి నవ్వింది.



# దుపహారం

(ఈ కథ 'వంశీ బర్కిలీ' వారి పోటీలో మొదటి బహుమతి గెలుచుకుంది. 'వంశీప్రియ' పత్రికలో ప్రచురితమైంది.)

తెల్లవారి చాలాసేపైంది!

కాంపౌండులో సందడి ఎప్పుడో మొదలైంది! పంపు దగ్గర నీళ్ళు పట్టుకుంటున్న వాళ్ళూ...వరండాలో పేపర్లు చదువుకుంటున్న వాళ్ళూ, తీగలమీద బట్టలారేసుకుంటున్న వాళ్ళూ... కూరలబండి చుట్టూ మూగినవాళ్ళూ, రకరకాల పనులతో సినీ రీళ్ళలా...ఎవరెడీ బొమ్మలా, తిరిగిపోతున్నారు, ఆ కాంపౌండులో జనం!

ఎవరిపనులు వాళ్ళవి. ఎవరి తొందర్లు వారివి, గోరంత తేడాలో దాటుకుంటూ రవ్వంత పలకరింపులు చికరించుకుంటూ టివిలో చిత్రాల్లా,.ఆ కాంపౌండులో ఉదయ ప్రసారం ప్రారంభమైంది.

ఆడ, మగ చాలామంది ఉద్యోగస్థులు కాపురమున్న లోగిలి అది. రేపో మాపో రిటైర్ కాబోతున్న వృద్ధులూ, కొత్తగా జాబు

దొరికిన యువతీ యువకులూ, సగం సర్వీసులో ఉన్న నడివయస్సు గృహిణులు, తీరుతీరున, అనేక మనస్తత్వాలతో బ్రతుకులు సాగిస్తున్న మానవులంతా ఉన్నారు ఆ ఆవరణలో..ఎంత తొందరలో ఉన్నా మాటి మాటికీ అందరిచూపూ ఆ కిటికీమీదే నిలుస్తోంది. తలుపు మీదే పడుతోంది.

గేటువైపుగా ఉన్న ఇండిపెండెంట్ రూమ్ అది.

ఆ గదికి ఉన్న ఒకే ఒక్క కిటికీ.

అయితే భిన్నత్వంలో ఏకత్వం, ఎవరి పనుల్లో వాళ్ళు వేరైనా ఒక విషయంనా మాత్రం అందరిదీ ఒకేదృష్టి'

ఆ దృష్టి..ఆ రోజు మరింత సమైక్యతా భావంతో..పటిష్టమై పోయింది.

అందుకే ఎవరెన్ని పనుల్లో ఉన్నా మిగిలిన వాటాలకి అభి ముఖంగా ఉంది. తలుపు కూడా డిటోయే.

'ఆ కిటికీ రెక్కల్లో ఓ రెక్క తెరిచి ఉంది' తలుపు వేసిఉన్నా తాళం వేసిలేదు,

ఆ రోజు అందరి దృష్టిని ఆకర్షించిన కారణాలు ఆ రెండే! అయినా ఆ రెండు కారణాలకి 'ఆర్నెల్ల చరిత్ర ఆ కాంపౌండులో రూపు దిద్దుకుని-అమిత ప్రధానాంశాలై, ఈ రోజు అందరి చూపుల్ని ఆకట్టుకున్నాయి.

ఆర్నెల్లక్రితం-వేసవికాలపు సాయంకాలం చల్లగావీచే సూచన లిస్తూ-చెట్లు చేమలు కదలడం మొదలెట్టేయి. మూడో ఇంటి అరవ మామీ తన వాటాముందు వేసుకున్న ముద్దమందార కొమ్మ తెగ ఊగుతుండగా ఐదో పోర్షన్‌లోని పంతులమ్మ పార్వతీబాయి పెరటి గుమ్మంలో ప్రాణంలా దాచుకున్న తెల్ల గులాబీ, కుండీలో రెపరెప లాడుతూ ఉండగా. రెండోఇంటికి కిరాయిదారుడైన హెడ్‌క్లర్క్

సాంబమూర్తి అపురూపంగా పెంచుతున్న చిక్కుడు తీగ తెగ కొట్టుకుంటోంది...అలాగే మిగిలిన వాటాలలో ఎవరి అభిరుచుల మేరకు వారు నాటిన వృక్షసంపద...ఆ సాయంత్రం ఆనందలహర్లలో తేలుతున్నాయి.

సరిగ్గా ఆ సమయంలో సదరు ఆ ఇంటిఓనరు (అతను మెయిన్ బజారులో) ఉన్న మరొక స్వంత మేడలో ఉంటాడు) ఒకాయన్ని వెంటబెట్టుకుని వచ్చి-గేటు పక్కనే ఉన్న రూమ్ తాళం తీయటం, గదంతా చూపించి మళ్ళీ తాళం వేయటం, వెంటనే ఇద్దరు కలిసి యమ అర్జెంటుగా వెళ్ళిపోవడం చాలా త్వరత్వరగా వివరాలు తెల్సుకునే వ్యవధి లేకుండా జరిగిపోయింది.

'సరేలే? ఎటూ అద్దెకి వచ్చే బాపతే! ఈ ఆవరణలో మనతో పాటు మనుగడ సాగించాల్సిన వాళ్ళే! తెలియకపోతుందా ఆ కుటుంబాన్ని గురించీ ' అనుకుని సరిపెట్టుకున్నారు ఆ కాంపౌడువాసులు. అయినా అవతల విసురు ఎక్కువైన గాలి, 'మీ మొక్కల్ని చూసుకోండోయ్' అని హెచ్చరించటంతో ఆ విషయం అంతటితో వదిలేశారు!

మూడోరోజు రాత్రి—ఆ గది తాళం తెరచి, పెట్టె, బెడ్డింగు, పగ్గెరాలతో ఆ గది పావనంచేసి మళ్ళీ వెళ్ళిపోయేడు...ఇక ఆ మర్నాటినుంచి అతని కార్యక్రమం—మిగిలిన వాళ్ళకి అంతు పట్టటం లేదు!

తెల్లవారగట్ల నాలుగింటికే ఆ గది కిటికీ తెరుచుకుంటుంది. లోపల లైటు వెలుగుతూ ఉంటుంది. ఆ వెలుగులో అటూ ఇటూ తిరుగుతూ వచ్చుటి తెర వెనుక ఓ మానవాకారం కన్పిస్తుంది. అప్పటికింకా ఆవరణలో అందరూ లేవరు...లేచిన కొందరు మాత్రమే ఈ దృశ్యాన్ని గమనించగల్గుతారు.

ఆ ఆకారం తలుపు తెరచుకుని బయటికి వచ్చి గబగబా కాలకృత్యాలు తీర్చుకుంటూ వుంటుంది: పంపు దగ్గర ముఖం కడిగి

స్నానంచేసి, లుంగీ, బనియను, డ్రాయరు ఉతికేసుకుని టవల్ చుట్టుకుని తడిబట్టలు, చెంబు, వగైరాలు అందుకుని హడావిడిగా రూమ్‌లోకి వెళ్ళి తలుపు వేసుకుంటుంది.

ఏడుగంట అవుతున్నప్పుడు కేడీరోడ్‌లో వాచ్‌మెన్‌లు వచ్చే వేళకి లైటుతీసి కిటికీ రెక్కలు మూసి గది తలుపులు తెరుచుకుని, బయటికి వచ్చి తాళం వేసి చేతిలో బ్యాగ్‌తో గేటుదాటి చకచకా వెళ్ళిపోతుంది ఆ ఆకారం! అలా వెళ్ళిన ఆ మనిషి మళ్ళీ రాత్రి తొమ్మిందింటికే గదికి చేరుతాడు. తాళంతీసి లోపలం తలుపు వేసుకొన్నాక లైటువేసి పదినిముషాల్లో బట్టలు మార్చుకుని మళ్ళీ తలుపు తెరచి, కూజాలో ఉన్న నీళ్ళతో కాళ్ళూ చేతులు, ముఖం గబగబా కడిగేసుకుని గబాల్న లోపలికెళ్ళి తలుపు వేసుకుంటాడు. పదో ఐదో నిముషాల్లో లైటు తీసేస్తాడు. ఇక అంతే మళ్ళీ తెల్లవారు ఝామునే వెల్గుతుంది ఆ లైటు.

గత ఆర్నెల్లనుంచి అతని కార్యక్రమంలో మార్పులేదు. ఆదివారం ఐనా సరే. పండగ రోజైనా సరే.

వర్షం పడుతున్నా వడవడ వణికించే చలిలోనైనా అతని రొటీన్‌కి అంతరాయం కలుగటంలేదు.

మొదటి వారం రోజుల్లో...'ఇంకా ఫామిలీ తీసుకొస్తాడని' ఎదురు చూసేరు కాంపౌండులో ఆడవాళ్ళంతా. నెల దాటిపోయినా తీసుకురాక పోయేసరికి పుట్టింటికి వెళ్ళింది కాబోలని సరిపెట్టుకున్నారు అయినా ఈ రోజుల్లో ఇన్నాళ్ళు పుట్టింట్లో ఉంటారా? అని విసుక్కున్నారు ఒకవేళ ఆవిడ పుట్టింటినుంచి వచ్చినా ఆ ఒక్కరూము ఎలా సరిపోతుందీ! అని చింతించేరు. ఏ విషయం అడగటానికైనా వీలే కావటంలేదు. ఆడకూతురు లేని ఇంటివంగతులు మరొక ఆడదానికి ఎలా తెలుస్తాయి. అంతకీ మగవాళ్ళద్వారా... అలా...అలా... కొంత తెలిసింది.

అతనిపేరు విష్ణుమూర్తి గృహస్థే కాని ప్రస్తుతం బ్రహ్మచారి, ఒకానొక గవర్నమెంటు ఆఫీసులో ఉద్యోగం. ఇవీ ఆ పర్టిక్యులర్స్.

ఇక అతనికి దగ్గర దగ్గర యాభై సంవత్సరాలుంటాయి. చామన చాయగా ఓ మోస్తరు పర్సనాల్టీతో అక్కడక్కడ నెరసిన జుట్టుతో. కాస్త వల్చబడుతున్న క్రాపుతో-అతి గంభీరంగా ఉంటాడు. ఇవన్నీ అతన్నిచూసి గ్రహించిన-'విజిబుల్' డీటేల్స్.

అంతకుమించి అవగింజంతైనాకొత్త సమాచారం రాబట్టగలిగే అవకాశం వాళ్లెవరికీ సాధ్యంకాలేదు. అతనువచ్చి ఆర్నెలలైనా!

*　　　*　　　*

మామీ పూజ ముగించుకుని మడిశారు కట్టుతో సిగలో ముద్ద మందార పువ్వుతో స్టీలుగ్లాసునిండా కాఫీపోసి, వరండాలో పేపరు చదువుకుంటున్న శ్రీమాన్ వెంకటాచార్యులుగార్కి ఇవ్వడానికి వచ్చింది. ఆవిడ చూపులు గేటుపక్కగా ఉన్న ఆ గదిమీద నిలిచేయి

"చూస్తిరా, ఈ దినం అయప్పసంగతి విచిత్రంగా ఉండిందే, రూమ్‌నుండి బయిటపడినట్టు లేదే, పాపం, ఏమైందో ఏమో! ఒకసారి చూసిరాకూడదా మీరు!"

పేపరులోనుంచి తల బైటికిపెట్టిన ఆచార్లుగారు కాఫీగ్లాసు అందుకుంటూ—"నిజమే ఈ దినం టూమ్‌లో లైటు వెలిగిన జాడ లేదు. ఉద్యోగముగాని చేసిందో ఏమో, ఛ, ఛ, ఎంత ఒంటరిబ్రతుకు పాపం, ఆర్నెల్లుగా చూస్తున్నామే ఎవ్వరూ వచ్చినట్టు కనబడలేదు. అయినా ఇదేం మనిషి, ఎవ్వరితో సరిగా మాట్లాడడే? ఒక్క ఇంటిలో ఉంటిమిగదా, ఎంత కలిసిమెలిసి ఉండాలే." అంటూ తెగ నిట్టూర్చి వేడి కాఫీ నోటిదగ్గర పెట్టుకున్నారు.

తెలుగు కుటుంబాలతో కలిసిపోయి ఎక్కువగా, అరవయాసతో తెలుగే మాట్లాడుతూ ఉంటారు. ఆ దంపతులు ఐదో పోర్షన్‌లోని

పార్వతమ్మకి, మామీకీ మధ్య అయిదు నిముషాలైనా సామరస్యభావం నిలబడదు! చివరి వాటాలోని సుదర్శనంగారంటే ఆచార్లుగారికి అరికాలి మంట నెత్తికెక్కుతుంది? అయినా...అవన్నీ మరిచిపోయి ఆవరణలో అందరు కలిసిమెలిసి ఉన్నామనే చెప్తుంటారు.

''సరేలెండి! అంతా బాగుంటే అనుకునేదేముందీ? ఇంతకూ ఆ భార్యామణికి ఈ భర్త సంగతి పట్టినట్టులేదే? అదెంత గయ్యాళో? హోటల్ భోజనం తింటూ ఈ తీరున మనిషి అవస్థపడుతూ ఉంటే వచ్చి వంటచేసి పెట్టొద్దూ? కట్టుకున్న వాణ్ణి వదిలేసి పిల్లలకి చేసి పెట్టుకుంటుంది కాబోలు. ఛీ ఛీ! బుద్ధిలేని మనిషి.'' మామీకి కోపం ఎక్కువైతే ముఖం వికారంగా మారిపోతుంది. పెదవులు, చెంపలు అదిరిపోతున్నాయి.

''ఊరుకుండు అందరూ నీ మాదిరి ఉంటారేమి! ప్రేమలు ఒకళ్ళు చెబితే రావు.'' ఆచార్లుగారి మెచ్చుకోలుతో మామీ శాంతించింది. కొడుకు ఉద్యోగం చేస్తున్న ఊరునుంచి వచ్చిపొమ్మని ఉత్తరం రాసినా వెళ్ళలేదు మామీ. రేపో మాపో రిటైరైపోతున్న భర్తని చెయ్యికాల్చుకోమని నేను వెళ్ళలేను—అంటుంది అందరితో. నిజానికి ఆ కోడలితో నెగ్గలేదన్న అనుమానం అందరికీ ఉంది.

''ఏమోనబ్బా! ఇంతమంది ఆడవాళ్ళని చూసివుంటిగానీ ఇంత మొండి ఆడదాన్ని చూడలేదు. చూస్తూ చూస్తూ తోటిమనిషిని కష్టంలో వదిలేస్తామా, ఆ కాఫీ తాగినవెనుక మీరు వెళ్ళి యేమి సమాచారమో విచారించిరండి.'' ఆవిడ కళ్ళనిండా జాలి నిండిపోయింది. ఆ గది లోపల ఒళ్ళు తెలియకుండా పడివున్న (ఉండే ఉంటాడన్న) పెద్దమూర్తిని మనసులోనే దయగా పలకరిస్తూ..వంటింట్లోకి వెళ్ళింది మామీ.

ఆ సమయంలో పంపుదగ్గర ఫ్లాస్కు కడుగుతున్న పార్వతీబాయి ఓ క్షణం ఆగి ఆ గదివైపు చూసింది.

—ఇవాళ ఈ విష్ణుమూర్తికి ఏమైందీ, మనిషన్నాక ఏదైనా అవుతుంది. పేరు పెట్టుకున్నంతమాత్రాన దేవుడై పోడుగా. కానీ పాయింటు అదికాదు. మనిషన్నవాడికి ఏదైనా తేడాపాడాలు వస్తే తోడునీడగా నిలవాలనే కదా ఈ పెళ్ళిళ్లు.. సంసారాలు...వాటితో ఏర్పడే అనురాగాలు, అనుబంధాలూ కానీ ఈవిష్ణుమూర్తిని చూస్తుంటే ప్చ్! పాపం అనిపిస్తోంది. ఏమిటీ వయసులో ఇలా ఏకాంత జీవితం. పోనీ ఆవిడగారు ఉద్యోగం చేస్తోందేమో అనుకున్నా సెలవుమీద ఒక్క వారంరోజులైనా వచ్చి వెళ్ళొచ్చునే. తనుమాత్రం చేయటంలేదూ. ఒకసారి తనభర్త వేరేచోటికి ట్రాన్స్‌ఫర్ అయితే, వెంటనే లీవ్ పెట్టించి నానా యాతనపడి మళ్లీ ఇక్కడికే ట్రాన్స్‌ఫర్ చేయించుకో లేదూ! ఏదో అలాంటి ఉపాయం చూసుకోవాలిగానీ బొత్తిగా భర్త పట్ల శ్రద్ధఉన్నట్లు లేదు. యవ్వనపు పొంగులు బిగువు సలపులు వయస్సు మీరేక సడలిపోవచ్చునేమోగానీ-ఆపేక్షలూ, అభిమానాలూ అంతరించి పోతాయా, ఆవిడకి ఉద్యోగముంటే ఉండుగాక, ఆర్థిక స్వాతంత్ర్యా నికి లోటు లేకపోతే పోవచ్చుగాక. కానీ భర్తకంటే ఎక్కువా. నేను మాత్రం జాబ్ చేయటంలేదా. అవసరమైతే సెలవు పెట్టుకోటంలేదా. తనొకర్తే ఉద్యోగస్థురాలైనట్టు (అయ్యేఉంటుందన్నట్టు) ఆ వున్న ఊరునుంచి ఊడిపడదేం. రేపు ఈ విష్ణుమూర్తికి ఏమన్నా అయితే, ఛ. ఛ. మధ్య ఈయన్ని చూపించడం దేనికీ: ఇప్పటికే నానా తంటాలు పడుతున్నాడు పాపం. ఎంత చలిలోనైనా ఈ పంపుక్రింద స్నానం చేస్తుంటే...లోపల రగ్గులో ముడుచుకు పడుకున్న మాకే నీళ్ళు మీద పడుతున్నట్లు వణుకుపుట్టేది. ఆ మానవుడు ఎలా భరించేవాడో, ఏం చేస్తాడూ. వేడినీళ్లు కాచిఇచ్చే భార్య ఇక్కడ లేదుగా. ఏమిటో ఈ దిక్కుమాలిన ఉద్యోగాలవల్ల సంసారాల్లో సుఖాలు హరించి పోతున్నాయి. మేము మాత్రం చచ్చినా వేరువేరుచోట్ల బతకలేము బాబూ. అనుకుని దీర్ఘంగా నిశ్వసించి ఫ్లాస్కు మళ్ళీ కడగటం మొదలెట్టింది. ముప్ఫైఏళ్ళ పార్వతీబాయి.

ఆమె పనిచేస్తున్న స్కూలు పెద్దిపేటలుది. ట్రాన్స్‌ఫర్లుండవు.

సాధారణంగా ఆలుమగలు ఉద్యోగస్థులైతే ట్రాన్స్ఫర్లవల్ల ఎడబాటు తప్పదని కొందరి దృఢ నమ్మకం. అలాంటి నమ్మకాన్ని ...పమూపా లన్న పట్టుదల పార్వతీబాయిలో పాతుకుపోయింది అందుకే తను ప్రైవేటు స్కూల్లో ఉన్నానన్న సంగతి మరచిపోయి వాదిస్తుంది. ప్రభుత్వ సంస్థ అయినా 'చేయిస్తూ...పని సాధించగలమన్న ధీమాతో ఉంటుంది.

విష్ణుమూర్తి భార్య కావాలనే-భర్త ట్రాన్స్ఫర్ కోసం తొందర పడటంలేదనీ-అందుకే అసలు ఆమె ఒకసారైనా భర్తని చూడటానికి రావటంలేదనీ-పార్వతీబాయి అభిప్రాయం.

గేటోకి నేరుగా వచ్చేస్తుంది కూరలబండి. దాన్ని చుట్టుకుపోయి కూరలు కొంటున్న వాళ్ళలో - నాల్గోవాటాలోని రంగనాధంగారి అమ్మాయి కుసుమ ఉంది కూరలు కొనేసి బుట్ట తీసుకుని ఇంటిలోకి వెళ్ళబోతూ అప్రయత్నంగా చూసింది ఆ...

ఈ మానవుడి రొటీన్లో ఇవాళ మార్పు వచ్చిందే. రాదూ వయస్సుమరచి కుర్రాళ్ళా-మిలిట్రీమేన్-లా ప్రతాపం చూపించేవారు రోజు. అయ్యిందివాళ. ఏ రోగమో వచ్చి ఉంటుంది ...తో ...లవు పెట్టి ఊరికి చెక్కేస్తాడు కాబోలు. నవ్వుకుంది కుసుమ. ఈమధ్యనే జాబ్ వచ్చిన కుసుమకి మేకప్ చేసుకుని, అది చెదరకుండా ఆఫీసు చేరుకునేసరికి-ఆఫీసర్గారి దీవెనలు చాలా ఘాటుగా తగులుతున్నాయి. ఎవరైనా టంచన్గా ఆఫీసుకెళ్ళినా, మిషీన్లా పనులు చేసుకొం టున్నా ఆ అమ్మాయి సహించలేదు-తప్పకుండా వాళ్ళు అలిసిపోతారని ఆ పిల్ల నమ్మకం.

సరిగ్గా ఆ సమయంలోనే మొట్టమొదటి పోర్షన్లోని కామేశం తమ్ముడు-రమేష్ గేటుబయటికి వెళ్ళి చాటుగా పొగ వూదేసుకుని మళ్లీ ఇంటిలోకెళ్ళబోతూ-సన్నగా ఈలవేస్తూ-ఠక్కున ఆగేడు.

అతని ఈలపాటకి హుషారిచ్చిన కుసుమ చూపులు పక్కకి

సారించడం గమనించి నోటిలో పాటఆగి దృష్టి ఆ గదిమీద పడింది 'ఓహో,' అన్న ఆశ్చర్యంతో అలా ఉండిపోయాడు.

'నాయనా విష్ణుమూర్తీ, ఏమైందివాళ. 'సిరికిన్ చెప్పడు' అన్న భంగిమలో రోజూ పరుగులెత్తి పోయేవాడివే, ఇవాళ ఏ భక్తుడూ మొరపెట్టుకోలేదా? అయినా ఎందుకయ్యా నీకీ అవస్థ? ఎటూ నీకు యాభై ఏళ్ళు ఉండనే ఉన్నాయి. మహా అయితే మరో ఎనిమిదేళ్ళ సర్వీసుంటుంది, దానికోసం ఇంత ఆరాటపడటమా అసలు ఈ గవర్నమెంటువారు, ఇలా రిటైర్‌మెంట్ ఏజ్‌ని పెంచడమే శుద్ధ పొరపాటు. మీలాంటి వాళ్ళంతా సీట్లు ఖాళీచేస్తేగానీ మాకు చోటు దొరకటంలేదు. నేను ఎంతకాలం నిరుద్యోగభారాన్ని మోసేనో తెలుసా? ఇప్పటికి కదా ఓ ఆఫీసు జీవిని కాగలిగేనూ. ఇంకా ఎంతో మంది నాలాంటివాళ్ళున్నారు. సో మెడియర్ ఓల్డుమేన్ వెంటనే రిజైన్‌చేసి హాయిగా ఇంటికి వెళ్ళిపో. 'మీ ఆవిడేనా సుఖపడేదీ?

–ఈ భావాలన్నీ రమేష్ మనసులో కదిలిపోయేయి అతనికి ఈ మధ్యనే జాబు పర్మినెంట్ అయ్యింది. తనూ ఎన్నటికైనా రిటైర్‌మెంటుకి వస్తాననీ.. అప్పుడు రిటైర్‌మెంటు ఏజీని పెంచినందుకు సంతోషపడాల్సి వస్తుందేమో అన్న ఆలోచన అతనికిప్పుడు రాదు. జీవితపు దొలిదశలోని మత్తు అది.

ఆరోజు ఆ కాంపౌండులో అన్ని మనస్తత్వాలని తనవైపుకి ఆకర్షించుకోగలిగిన ఆ గది కిటికీ రెక్కా తాళంలేని తలుపు తొమ్మిదైనా అలాగే ఉన్నాయి!

అప్పటికే ఇద్దరు ముగ్గురు ఏకాభిప్రాయానికివచ్చి తలుపుదగ్గరికి వచ్చారు–ఇక లాభంలేదు. లోపల ఆ విష్ణుమూర్తి ఏ ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్నాడో చూసి గట్టిగా చీవాట్లు పెట్టాలి, 'మీ వాళ్ళు నిన్ను వర్తించుకోకపోయినా మేమంత లేముటయ్యా? మనుష్యులంకామా? మానవత్వం లేదా మాకు?'—అనాలనుకుంటూ తలుపుమీద తట్టేరు శ్రీమాన్ వెంకటాచార్యులుగారు.

తలుపు తెరుచుకుంది.

కానీ లోపల ఎవరూ లేరు! ఖాళీగా వుంది! షాక్ తిన్నట్టు నిలబడిపోయేరు పెద్దలంతా.

అప్పుడే గమనించేరు-కిటికీకి ఉండే పల్చటి తెర లేదు! అంటే ఆ విష్ణుమూర్తి గది ఖాళీచేసి రాత్రే వెళ్ళిపోయేడన్నమాట! మరి ఈ సంగతి ఓనరుకి తెలుసా! అతగాడెప్పుడూ అద్దెల వసూళ్ళకైనా రాడు గుమాస్తాని, రశీదుబుక్‌తో పంపిస్తాడు. మరి ఈ విష్ణుమూర్తి మోసం చేసేడన్నమాటే!

హమ్మ! హమ్మ! ఎంత దొంగ! నంగనాచి వెధవ...ఎన్ని నెలలు బకాయిపెట్టి మకాం ఎత్తేసేడో! తక్షణం ఇంటి యజమానికి తెలియపర్చాల్సిందే-అని ఉరుకులు పరుగులుగా మెయిన్ బజారుకి ఆటోలురిక్షాలు చేసుకుని దూసుకుపోయేరు పెద్ద మనుష్యులంతా!

క్షణాలమీద వార్త అవరణంతా పాకగానే మిగిలినవాళ్ళ గుండెలమీద చేతులేసుకుని, ముక్కున వేలానించుకుని ఏపతీరుగా విష్ణుమూర్తిని విమర్శించేస్తున్నారు...

ఇంటి యజమాని, అంతా విని ఫక్కున నవ్వేడు.

*  *  *  *

అదే సమయానికి రైల్లో విశాఖపట్నం చేరుకుంటున్న విష్ణుమూర్తి హాయిగా కళ్ళు మూసుకున్నాడు. అతని మనసు దూదికన్నా తేలికైనట్టు మబ్బులకన్నా ముందుగా పరిగెత్తుతున్నట్లు రిలీఫ్‌గా ఉంది.

—'అబ్బ! అన్నెళ్లు నేనెలా ఉండగల్గేనో? తెల్లవారుఝామున నాల్గింటికే లేచి గబగబా కాలకృత్యాలు తీర్చుకోకపోతే కాంపౌండులో అన్ని వాటాల వాళ్ళూ లేచేస్తారు. ప్రతిచోట క్యూప్రకారం నడవా లంటే-ఏడుగంటల లోపులో తయారవలేను. కనీసం ఏడుగంటల

క్కైనా వేడిగా కాఫీ తాగకపోతే నేనుండలేను. హోటల్లో కాఫీ తాగక పోతే కాస్సేపు పేపరు చూసి తొమ్మిదింటివరకు అక్కడే గడిపి ఏకంగా భోంచేసి ఆఫీసుకెళ్లేవాణ్ని మళ్లీ సాయంత్రం. ఆఫీసునుంచి హోటల్‌కి ఆ తర్వాత కాస్సేపు తిరగటం, రాత్రి భోజనం ముగించు కుని రూమ్‌కి చేరుకోటం ఎంత యాంత్రికంగా బతికేను. ఇదంతా వసుమతికి చెప్తే ఎంత బాధపడుతుందీ? అసలు మీరు డెప్యుటేషన్ మీద ఆర్నెల్లయినా సరే-హైద్రాబాదు ఎందుకు వెళ్ళాలీ? అది కూడా నేను లేనప్పుడే వెళ్ళాలా!' అని కోపగించుకోదూ?

అవును, వసుమతి కోపగించుకోడంలో ఎంతైనా అర్థంఉంది. ఈ ముప్పైఏళ్ళ దాంపత్య జీవితంలో ఎన్నెన్ని అనుభూతులు సృష్టిం చిందీ! నాకోసం ఎన్ని అవకాశాలు వదులుకుందీ? సంసారం ఎంత సుఖమయం చేసిందీ? పిల్లలు ఈనాడు అభివృద్ధిలోకి వచ్చారంటే అది వసూదీక్ష, నేనింత పొజిషన్‌లో ఉన్నానంటే వసూ పట్టుదల, కృషే కారణం, ఆఖరికి ఈ ఆర్నెల్లు నేను ఏ ఇబ్బందీ పడకుండా అన్ని సదుపాయాలు కల్పించింది. కానీ నేను నానా ఇబ్బందీ పడి ఓ రకమైన అజ్ఞాతవాసం చేసి వచ్చానంటే...ఉహూ, క్షమించదు. నాకు తెల్సు. కానీ వసూని ఎలా ప్రసన్నం చేసుకోవాలో నాకే తెల్సు.

విష్ణుమూర్తి పెదవులమీద లాస్యమాడిన చిరునవ్వులో ముప్పై సంవత్సరాల దాంపత్య జీవితపు రహస్యాలన్నీ తొంగి చూసేయి.

*    *    *    *

"విష్ణుమూర్తి నాకు బాగా తెలుసును! మా ఇంటిలోనే ఉండ మంటే—వినలేదు. అందుకని ఆ రూము ఇచ్చాను. అద్దె నేనే వద్ద న్నాను ఆఫీసర్ పైగా మరో ప్రమోషన్ కూడా రాబోతోంది!

వాళ్ళావిడ ఫారిన్ వెళ్ళింది-కొడుకులున్నారు అక్కడ. కోడలికి డెలివరీ టైమని ఇండియా రావడానికి వీలుకాదంటే - ఈవిడే వెళ్ళింది! ఎం.కామ్ ఫస్టుక్లాసులో ప్యాసైనా ఉద్యోగం సద్యోగం, అంటే ఇష్టం లేదని-భర్తని పిల్లల్నీ పంచప్రాణాలుగా చూసుకుంటుంది ఆవిడ..''

ఇంటి యజమాని మాటలు సాగుతూనే వున్నాయి...వింటున్న వాళ్ళ చెవుల్లో మాత్రం ఏదో హోరుగాలి దూసుకుపోతున్నట్టు... దిబ్బెళ్ళు పడుతున్నాయి.



# "దేవుడు కనిపించడు"

(1986 సం॥లో వనిత మాస పత్రికలో బహుమతి పొందినది.)

కమాన్ బాబ్జీ కమాన్!...ఓహో! పై డిలే? ఇట్స్ నౌ ఎయిట్ థర్టీ! బస్ విల్ బి కమింగ్" వందన కంగారు పడి పోతోంది?

"కమింగ్ మమ్మీ..." ఏడేళ్ళ పసిగొంతు బదులు పల్కుతూ బెడ్‌రూమ్‌లోనుంచి బయటికి వచ్చింది.

సిమెంట్ కలర్ నిక్కర్, తెల్లని షర్టు–గంజిపెట్టి ఇస్త్రీతో వికసించిన చేతుల్లా నిక్కబొడుచుకుని మోయలేని పుస్తకాల బ్యాగ్‌ని గుంజెల కట్టుకుని బయటికి వచ్చాడు బాబ్జీ.

గబుక్కున అందుకుని బ్యాగ్‌లో పుస్తకాలు సర్దుతూ, చేతికి తగిలిన ఓ ప్లాస్టిక్ సంచీని పైకి లాగి 'వాటీస్ దిస్?' అంటూనే చేయి పెట్టి చూసి, "ఎక్కడివి ఈ కలర్ చాక్‌పీసులు," మీ ఫ్రెండ్స్ దగ్గర అడుక్కున్నావా, అలా అడగకూడదని చెప్పేనా, నీకేమైనా కావాలంటే ఇంటిలో అడగాలి. డాడీ కొనితెస్తారు. లేదా నేను కొనితెస్తాను. అంతేకానీ ఇలా మీ ఫ్రెండ్స్ దగ్గర తెచ్చుకోకూడదని చెప్పేనా,' తన్నుకొస్తున్న కోపాన్ని పళ్ళలో బిగించింది.

'నో మమ్మీ, ఐ డింట్ ఆస్క్, 'బట్లర్' గేవ్‌మి' చిన్నారి చేతులు గబగబా తిప్పేస్తూ, చెప్పేడు బాబ్జీ భయంగా చూస్తూ.

చప్పున చల్లారిపోయింది వందన.

బాబ్జీ అడగలేదని కాదు.

చక్కగా ఇంగ్లీషులో చెప్పాడు.

బాబ్జీని దగ్గరకు లాక్కుని, 'మై గుడ్‌బోయ్, దట్సాల్‌రైట్,' అంటూ ముద్దుపెట్టుకుంది.

చకచకా బ్యాగ్ సర్ది రాత్రి చేసిన హోంవర్క్ మేడమ్‌కి చూపించమని చెప్పి త్వరత్వరగా సాక్సు, బూట్సు వేసి బ్యాగ్ బాబ్జీ వీపుకి తగిలించింది. టేబుల్‌మీదున్న బాస్కెట్ తను అందుకుంది. అందులో చిన్న టిఫిన్‌బాక్స్, వాటర్ బాటిల్, చేయి తుడుచుకుందుకు నాప్‌కిన్ ఉన్నాయి. చెప్పులు తొడుగుకుంటూ 'ఏమండీ, మేము వెళ్తున్నాము,' అంది.

ఫైళ్ళమీద నుంచి అరక్షణం తలఎత్తి 'సరే' అన్నట్టుగ తల ఊపి మళ్ళీ తలవొంచుకున్నాడు ఉమామహేశ్వరరావు. ఆఫీసు అంత అర్జెంటుగ చూస్తున్న ఫైళ్లు ఆఫీసులో చూసుకోవచ్చును. కానిఅక్కడ నిదానంగ చూసే వారంరోజులు పడుతుంది. ఇంటికి తెచ్చుకునిచూస్తే నాల్గురోజుల్లో పూర్తి చేయవచ్చును. దానివల్ల...

వచ్చేనెలలో ప్రమోషన్లు రావాల్సిన, వాళ్ళలిస్టులో మహేశం పేరు వుంటుంది. అదిగాకుండా డిపార్టుమెంటల్ టెస్టు కూడా రాయబోతున్నాడు. రాబోతున్న పదవిమీదా, పెరగబోతున్న జీతంమీద మహేశం, వందన ఎన్నో రోజులముందు నుంచే పునాదులు త్రవ్వుకుని అంతస్థులకి రూపాలు దిద్దుకుంటున్నారు.

మెయిన్‌రోడ్ దాటించి బస్సు స్టాపులో నిలబెట్టింది బాబ్జీని. వందన. అప్పటికే అక్కడ బిలబిలమంటూ పదిహేనుమంది అదా,

మగపిల్లలు,జూ పార్కులో పక్షుల్లా రంగురంగుల స్కూలు డ్రస్సులో మహా సందడి చేస్తున్నారు.

వందనకి రోజూ ఈ దృశ్యమ్ము కన్నుల పండుగగా వుంటుంది. వాళ్లు గలగల ఇంగ్లీషులో మాట్లాడుకుంటే వీనులవిందుగ వింటుంది.

బాబ్జీని ముందువరసలో కూర్చోబెట్టి, బాస్కెట్టు అందించి, జాగ్రత్తలు చెప్పి.. టా...టాలుచెప్పి, బస్సు కదిలాక మెల్లగా ఇంటికి వచ్చింది వందన.

అప్పటికి మహేశం ఫైళ్లు సర్ది ఆఫీసుకి తయారవుతున్నాడు.

'వందనా వడ్డించేయ్ త్వరగా. బాబ్జీవాళ్ళ బస్సు వెళ్ళిందా' వెళ్ళకుండా ఆమె రాదని తెలిసినా, అలా అడగం అలవాటు.

'ఆ, వెర్రి నాయన, చేసిన హోమ్‌వర్క్ చూపిస్తాడో మర్చిపోతాడో..బాక్సులో చపాతి పెట్టేను. తింటాడో, ఆ బబ్లూగాడికి పెడ్తాడో.'

'అబ్బా, చూడు వందనా, వాడు 'ఏం చేస్తాడో' అని ఇప్పుడే దిగులుపడకు. వాడు వెరీగుడ్ బాయ్. అన్నీ సక్రమంగా చేస్తాడనే అనుకో...ఊఁ, ఊఁ, నాకు వడ్డించు..." అన్నాడు.

"అవును. వాడు నిజంగా గుడ్‌బాయే," అనుకుంటూ టేబులు మీద పళ్లెంలో కూరలు...చపాతీ..అన్నం పెట్టింది. "నువ్వుకూడా తినేయరాదూ? మళ్ళీ మీ ఫ్రెండ్స్ ఎవరైనా వచ్చారంటే మధ్యాహ్నం దాకా వదలరు. అహాఁ, అలా కోపంగా చూడకు. మీది సత్కాలక్షేపమే అనుకో. అయినా నువ్వు భోజనం చేయకుండా వుండాల్సి వస్తుందన్న బాధ నాది:అదీగాక కలిసితింటే బాగుంటుంది కదా?" చివరిమాటలు మంద్రస్థాయిలో అనేసరికి, వందన ముఖంలో చిరుసిగ్గులు దోబూచులాడేయి. "ఊఁ, కబుర్లు కేం? ముందు పెట్టు సంగతి చూసుకోండి.

మొన్న మా పద్మావతిగారి భర్తకి-అసిస్టెంట్ సెక్రటరీ పోస్టు వచ్చింది మనం త్వరగా పైమెట్టు కెక్కాలి.' అంది.

''ఆయన సీనియర్ మోస్ట్, రాకేం చేస్తుంది? ఆ వయస్సు దాకా ఆగితే నాకు కూడా...''

'సరేలెండి అప్పుడు తీరిగ్గా నత్యారపు కళ్ళజోళ్లోనుంచి నేను మిమ్మల్ని చూసి ఆనందిస్తాను జుట్టంతా రాలి బట్టలతో మీరు నన్ను'

'అంటే? ఇంక ఆ వయస్సులో భార్యాభర్తలకి ఏమీ అనురాగాలు వుండవంటవా?' మహోత్సం కవ్వింపుగా అడిగేసరికి పక్కుమంది వందన.

'ఉంటాయి ఉంటాయి మన పెద్దాళ్ళకేమో? అలాగే మనం కూడా.'

'మీ పద్మావతిగారో?'

'వాళ్ళకేమండీ? ఆయనకి ఈ ప్రమోషన్ వచ్చినా రాకపోయినా ఇబ్బందిలేదు వాళ్ళబ్బాయి డాక్టర్. వాళ్ళమ్మాయి లెక్చరర్. ఆవిడ జర్నలిస్టు. వాళ్లెంత అప్ టు డేట్‌గా ఉంటారనీ? వాళ్ళ ఆలోచనలూ వాళ్ళ విధానాలూ అన్నీ హైలెవల్లోనే వుంటాయి. మొదట్లో ఆవిడతో నాకు స్నేహమేమిటా?' అని సందేహించేను. కానీ పద్మావతిగారే స్వయంగా వచ్చి 'నేటితరం మహిళ' అన్న శీర్షికకి నన్ను ఇంటర్వ్యూ చేసి ఫోటోలు తీసుకెళ్లేక ధైర్యము వచ్చింది. నా ఆశయాల్ని ఆవిడ ఎంతగా మెచ్చుకుందో? నన్ను ఎంత ప్రోత్సహిస్తారో ఆవిడ.'

'ఓ.కే. ఒప్పుకున్నాను. పద్మావతిగారి భర్తగారు అసిస్టెంట్ సెక్రటరీ (పెద్దవాడయ్యాక) అయినా నేను మాత్రం త్వరలో ప్రమోషన్ తెచ్చుకుని ఆఫీసర్‌రాంక్‌లో చేరాలంటావ్? నిజమే నా పట్టుదల కూడా అదే వందనా! అందుకేకదా ఇంత దీక్షగా చదువుతున్నాను' భర్త కంఠంలోని నిజాయితీకి వందన గర్వంగా చూసింది.

* * *

మధ్యాహ్నం పనిమనిషి ముత్యాలు అంట్లు తోముతూ వుంటే దాని కళ్లెందుకో ఎర్రగా ఉబ్బి ఉన్నట్టు గమనించింది వందన.

'ఏమిటే ముత్యాలు? మీ ఆయన మళ్ళీ కొట్టేడా! ఏడ్చినట్టున్నావేం?' అనడిగింది.

'ఏదోలెంటమ్మా! ఈ ఏడ్పు నా బతుకంతా ఉండేదే! ఆడికి బుద్ధిరాదు. నేను యాడికీ పొలేను' అంది విరక్తిగా.

'అదిగో అదే వద్దన్నాను. వాడికి నీవే అలుసు ఇచ్చుకున్నావు. నువ్వు అణిగిమణిగి పడివున్నంతా కాలం వాడు అలా పొట్లగిత్తలా తంతూనే ఉంటాడు. నువ్వా సంపాదిస్తున్నావు. వాడేమి నిన్ను పోషించడములేదు. నిన్ను కొట్టే హక్కు వాడికిలేదు.

'ఏమోనమ్మా హక్కులు హద్దులు మాకేటి తెలుస్తాయి?"

"అదే అదే మీ అమాయకత్వం! అక్షరము ముక్క లేకపోవడమే ఇందుకు కారణము! పిచ్చిమొద్దూ నేను చెప్తూనేఉన్నాను సరేలే ఈసారి వాడు చెయ్యి చేసుకుంటే ఊరుకోవద్దు తెల్సిందా?

ముత్యాలు "ఊరుకోను" అనలేకపోయింది మౌనంగా తనపని చేసుకుంటోంది.

వందన మాత్రము ముత్యాల్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చుంది. దాని జీవితాన్ని బాగుచేయాలనీ దుర్మార్గుడైన దానిభర్త నుంచి దానిని కాపాడి రక్షించాలనీ ఆ బాధ్యత తను తీసుకోవాలనీ ఆ భారము తనదే అని గట్టిగా అనుకున్నది. రెండు రోజులక్రితము పద్మావతిగారూ, స్రవంతిగారు తమ ఇంటిలో చెప్పిన విషయము గుర్తు వచ్చింది—'వచ్చే నెలలో మనము నగరము అంతా తిరిగి ఈ దశాబ్ద వనిత'ని గురించి మేటర్ సేకరిద్దాం! అందులో బీదా గొప్ప చిన్నా పెద్ద అన్న భేదము వుండకూడదు" అన్నారు.

నిజమేకదా! ప్రతి గృహిణియొక్క ఆలోచనా సరళి, ఆచరణలు, జీవిత విధానము తెలియాలి! సగటు ఇల్లాలి దృక్పథము మారనంతవరకు ఈ సమాజము బాగుపడదు! సామాన్య స్త్రీ హృదయస్థమందూ కలలా మిగిలిపోతోంది. ఇక పాటక జాతి స్త్రీల గురించి విచారించి లాభమేమిటి? దీనికంతకీ కారణము నిరక్షరాస్యతే: అందుకే తను ఈ మధ్య వయోజన విద్యని గురించి ప్రచారము చేస్తోంది. ముందు ముందు బాగా ఉత్సాహము ఉనవాళ్ళు దొర్కితే తను స్వయంగా విద్యాదానం చేయాలి. ముఖ్యంగా ఈ ముత్యాలుకి ముందు నాల్గు అక్షరం ముక్కలు నేర్పాలి.

కుర్చీలో వెనక్కి వాలి అలా ఊహాలోకాల్లోకి వెళ్ళిపోతోంది వందన.

మధ్య తరగతి కుటుంబములో ఒక చట్రములో కొట్టుకు పోతున్న అత్తవారిల్లు గుర్తు వచ్చింది. పెద్దగా, గొప్పగా లేని సామాన్య జీవితాలు! తను బి.య్యే చదువుకొని ఆ ఇంటి కోడలుగ వెళ్ళిందంటే, కేవలము మహేశాన్ని వదలుకోలేకనే! అయినా తన అదృష్టం! వారికి పెళ్ళికి ముందే హైదరాబాదులో ఉద్యోగమువచ్చి ఉండటము వలన—ఆ ఊళ్లో వాళ్ళదగ్గర ఉండాల్సిన అవసరము లేక పోయింది. కన్నందుకు పెంచి పెద్ద చేయుటము.. ఒకరిదారినవారిని పంపించేయడము...అదే గొప్ప ఘనకార్యము కాబోలు! వయస్సుడిగి అత్తా మామా, అలారొటీన్ బ్రతుకు బ్రతికేస్తూ ఏ విధమైన వ్యాపకము పెట్టుకోకుండా ఎలా ఉండగలరో అని ఆశ్చర్యపడ్తూ వుంటుంది.

అంతే! కొందరి జీవితాల్లో ఏ గొప్ప ఉద్దేశ్యాలూ వుండవు. సామాన్య బ్రతుకులు అనుకుంది ముత్యాలు పని చేసుకుని వెళ్ళిపోయేక మామూలు ప్రపంచములో పడింది వందన.

* * *

వారంరోజుల తర్వాత బాబ్జీ ప్రోగ్రస్ కార్డు తెచ్చాడు.

చూసింది వందన. మొదటి ఐదుగురిలో లేడు. ఎనిమిదో రాంక్ వచ్చాడు.

అనుకోని అవాంతరము ఇది.

బాబ్జీని బాగా చదివించి ఇప్పటికి ఫస్ట్ రాంక్ వచ్చేలా చేయాలనీ, ఆ తర్వాత ఏన్యువల్ పరీక్షల్లో ఫస్టు రాంక్ రావాలనీ వందన మహేశం కూడా ఆశించేరు. కానీ ఇదేమిటీ? ఎనిమిదో స్థానం వచ్చిందా? పైగా ఆ బబ్లూగాడు ఫోర్త్ రాంక్ వచ్చేడని చెప్తున్నాడు.

ఇంక వందన సహించలేకపోయింది. రాత్రింబవళ్ళు బాబ్జిని రుబ్బేయడం మొదలుపెట్టింది. సాయంత్రం స్కూలు నుండి రాగానే అరగంట మాత్రమే విశ్రాంతి అ తర్వాత పుస్తకాలు ముందేసుకుని వాణ్ణి కూర్చోబెట్టుకుని రెండు మూడు గంటలు చెప్తోంది. చదువు. వాడు బయటికి కదలడానికి వీల్లేదు. పనికిమాలిన వెధవలతో ఆటలాడి నేర్చుకున్న విద్యంతా మర్చిపోతున్నాడు. 'ఒరేయ్ బాబ్జి ..నీకు ఒక్క తెలుగు పద్యము కూడా రాదా?' అని ఒకరు...'నీకు తెలుగు అక్షరాలే రావా?' అని మరొకన్నాసి. వాణ్ణి అడిగి వచ్చిన ఇంగ్లీషంతా మర్చిపోయేలాగా అంతా తెలుగులోనే మాట్లాడిస్తున్నారు. ఛీ! ఛీ! వాళ్ళ దగ్గరికి పంపించకూడదు. అయినా తెలుగు మీడియం పిల్లలతో వీడికి స్నేహమేమిటి?—వీళ్ళ తాత, వీళ్ళ నాన్నని ప్రభుత్వ పాఠశాలలో తెలుగులో చదివించబట్టే. ఇదిగో ఈనాడు ఇలా ప్రమోషన్ల కోసం టెస్టులు రాయాల్సి వస్తోంది. మొదట్లోనే డైరెక్టుగ ఏ ఆఫీసరో అయింటే ఈనాటికి ఎంత పెద్ద పొజిషన్లో ఉండేవాళ్ళమో? బాబ్జీని రోజు బస్సులో పంపించే-ఖర్మేమిటి? చక్కగా కార్లో తీసుకెళ్ళి స్కూల్లో దింపి అక్కడనుంచి అటు ఆఫీసుకి వెళ్లేవారు ఆయన! ప్చ్! ప్చ్! చిన్నప్పటినుంచి, తాతా నాన్నా గారి వాటుగ పెంచితే పిల్లలు ఏం అభివృద్ధిలోకి వస్తారు? ఉహూ! బాబ్జిని అలా పెంచము! ఫస్టురాంక్ వచ్చితీరాలి! ప్రతిజ్ఞ పూనింది...వందన. ప్రతిరోజు నూరిపోస్తోంది [illegible] !

ఓ రోజు సాయంత్రం బాబ్జీకి శ్రద్ధ పాఠం చెప్తున్న సమయములో ముత్యాలు తన పని ముగించుకుని వెళ్తూ, 'అమ్మగారూ!' అని పిల్చింది. 'ఏమిటన్నట్టు' చూసింది వందన.

అది చిరునవ్వులు చిందిస్తూ, 'మా మొగోడు కూడా ఒప్పుకున్నాడండీ. అమ్మగారి కాడ నాల్గు అచ్చరం ముక్కలు నేర్చుకో మన్నాడండీ? ఇకనుంచీ పెతీరోజు సాయంత్రం నేర్పిస్తా రాండి? పలకా బలపము తెచ్చుకుంటానండి.' ముచ్చటైన ముత్యాలు నల్గురు బిడ్డల తల్లి-అలా సరదాపడి అడుగుతుంటే, వగిరి గంటేసి అప్పటి కప్పుడే 'అ ఆ'లు దిద్దబెట్టేది వందన. కాని పరిస్థితి వేరుగ వుంది. ఈ సాయంకాలము సమయాన్ని బాబ్జీకి తప్ప మరొకరికి వినియోగించ డానికి కుదరదు.

అందుకే—'చూద్దాంలే! నా పీలు కూడా కావాలనుకున్నాక!' నిరాసక్తిగా అని బాబ్జివైపు తిరిగింది.

ముత్యాలు 'సరేలెండి' అంటూ నవ్వుతున్న ముఖము వెంటనే చిన్నబుచ్చుకుని మెల్లగా వెళ్ళిపోయింది.

మర్నాడు మహేశం భోజనము చేస్తున్నప్పుడు ఓ సంగతి చెప్పాడు.

'వందనా! ఆఫీసుకి రోజు లేటుగానే వెళ్తున్నాను. డిక్కుమాలిన బస్సులు దొరకటము లేదు. ప్రతిరోజు ఆటో ఎక్కాలంటే కష్టంగదా? అందుకే మా ఫ్రెండ్ సంపత్ చెప్పాడు. వాళ్ళ బావాయ్ స్కూటర్ అమ్మేస్తాట్ట! సెకండ్‌హాండ్ అయినా చాలా మంచి బండట. తెల్సున్నవాళ్ళము కనుక తక్కువలో వచ్చేటట్టు చూస్తాను అన్నాడు. ప్రస్తుతం అంతా డబ్బు ఇయ్యలేకపోతే సగము ముందు ఇచ్చేసి మిగతా డబ్బు రెండు వాయిదాల్లో నట్టమంటున్నాడు. ఇంతటి అవకాశము మళ్ళీ వస్తుందా? అందుకని కొనేద్దామనుకుంటున్నాను.'

'అనుకోడమేమిటండి? కొనేయండి! అమ్మో ఎంచక్కటి ఫ్రెండో? అసలు మనము ఎప్పుడో కొనాల్సింది. కానీ ఏదీ? కొత్తది కొనాలంటే బుక్ చేయించి వచ్చేదాకా ఎదురుచూడాలి. ఈ లోపులో ఈ అవస్థలు ఇలా పడుతున్నాము! నేను మొన్ననే అనుకున్నాను. బాబ్జిని కూడా బస్సులో పంపించడము కష్టంగా వుందని! ఇప్పుడు ఇప్పుడు స్కూటర్ కొంటే ఏ బాధా వుండదు. మీరు వాణ్ణి స్కూల్లో డ్రాప్ చేసి, ఆఫీసుకెళ్ళిపోవచ్చును. ఇవాళే బ్యాంక్ బాలెన్సు ఎంత ఉందో, చూసి తీసేయండి. మళ్ళీ ఎవరికీ మాట ఇవ్వొద్దని చెప్పండి. వందనకి ఆనందముతో, హృదయము ఎగిసిపడుతోంది!! ఇంత త్వరలో తన కోరిక ఈవిధంగా తీరుతుందనుకోలేదు. ఇలాగే భవిష్యత్తులో కారు కూడా కొంటామేమో?

'అవును బాబ్జిని కూడా తీసుకెళ్తూ ఉండొచ్చును. ప్రతిరోజు నువ్వు వాణ్ని తీసుకుని వెళ్లే తీరు నాకూ బాధగానే ఉంది. అవసోపాలు ఉరుకులు పరుగులు అన్నీ తప్పుతాయి!" మహేశం భోజనము ముగించి ఆఫీసుకెళ్ళిపోయేడు. వందన ఇల్లంతా సర్దుకుని తీరిగ్గా కూర్చుని రాబోయే స్కూటర్‌ని ఎక్కడ ఎలా పెట్టాలా అని ఆలోచిస్తోంది.

అనుకున్న ప్రకారము, పదిరోజుల్లో స్కూటర్ కొనేశాడు మహేశం. తొమ్మిదింటికల్లా బాబ్జినీ, భర్తనీ స్కూటర్‌మీద సాగనంపడము ఎంతో తృప్తిగా ఉంది వందనకి! సాయంత్రము ఇంటికి రాగానే బాబ్జిని కాస్త రిలాక్స్ కానిచ్చి మొదలెట్టుంది పాఠాలు, అగా చాలక రెండుసార్లు స్కూలుకి వెళ్ళి 'బాబ్జీ ఏమైనా ప్రామిసింగ్‌ది కనిపిస్తాడా?' అని అడిగి తెలుసుకుంది.

ఓ రోజు మహేశం, అప్పటికి డిపార్ట్‌మెంటల్ టెస్టు రాసేసి హాయిగా ఊపిరి పీల్చుకున్నాక—ఇంటికి వచ్చి, "మా నాన్నదగ్గర్నుంచి లెటర్ వచ్చింది వందనా?" అన్నాడు డ్రస్సు మార్చుకుంటూ.

'ఏమిటట?' అనడిగింది బాబ్జీకి [illegible]..

'ఏంలేదు? ఈమధ్య యాత్రా [illegible] తోచినట్లు [illegible] క్షేత్రాలన్నీ చేయాలనుకున్నారుట 'కానీ వీలుకాలేదు [illegible]!' అని మనము కులాసాగా ఉన్నట్టూ బాబ్జీ బాగా చదువుతున్నట్టూ తెలుస్తోందని రాసేరు!"

"యాత్రలకి వెళ్ళడానికి వీలుకాలేదా? [illegible] మనిషికి కార్యదీక్ష ఉండాలండీ? అసలు [illegible] అనుకుంటే [illegible] వెళ్ళలేరూ? పోనీయండి" నిర్లక్ష్యంగా అది [illegible] లీనమయింది! తెల్లవారితే వాడికి [illegible] ఉంది.

వందన పడిన శ్రమకి ఫలితము దక్కింది.

బాబ్జీ ఆర్నెల్ల పెట్టుంటప్పటిలో బాగా మార్కులు తెచ్చుకుని ఫోర్తు రాంక్ రాగల్గేడు.

"హమ్మయ్య చూసేరా ఎలా సాధించేనో [illegible]?" అన్నట్టుగా చూసింది మహేశం పైపు. సరిగ్గా ఆ సమయములోనే తను టెస్టు ప్యాసైనట్టు మళ్ళీ నెలలో ప్రమోషన్ రాబోతున్నట్టు చెప్పేడు.

"నిజంగానా?" ఉప్పొంగిపోయింది వందన.

"నిజమేనోయ్! కానీ జాగ్రత్త! కింద చూసుకుని నడువు. మరీ అలా గాలిలో తేలిపోకు!"

"చాల్లెండి! ఇదేమన్నా లాట్రీలో గెలుపా? కష్టపడినదానికి ప్రతిఫలమండీ? మనిషి తల్చుకుంటే ఏదైనా చేయవచ్చునని ఋజువు చూపే సాక్ష్యమండి! మనోధైర్యాన్ని పెంపొందించే టానిక్కేనండి.'

"బాబోయ్ చాలు చాలు, ఝాన్సీరాణీ, రుద్రమాంబల్ని తలపిస్తున్నావ్! అన్నట్టు మర్చిపోయేను. మీరంతా ఏదో సర్వే చేయా

లనుకున్నారు గదా ఏమైంది ఆ కార్యక్రమము?'' ఆమె ఊపు తగ్గించే ప్రయత్నంలో ఆ ప్రశ్న వేసేడు మహేశం.

నవ్వింది! 'ఏదీ నాకు తీరిక లేకపోయింది—బాబ్జిని చూసుకోడము తోటే సరిపోయింది, ఆ పద్మావతిగారూ స్రవంతిగారే వెళ్ళి వచ్చారుట। ఇవాళో రేపో వెళ్లి ఎన్ని విషయాలు సేకరించుకుని వచ్చారో చూస్తాను' అంది.

ఆ మర్నాడే పద్మావతిగారింటికి వెళ్ళింది. ఆవిడ అప్పటికే కొన్ని యదార్థగాథల్ని ఫోటోలనీ ప్రముఖ పత్రికలకి పంపించేసేరు. మిగిలినవాటిని వివరించి చూపెట్టేరు.

'చూడమ్మా వందనా నువ్వు రాలేదుగానీ, వెరీ ఇంట్రెస్టింగ్ కేసులు కొన్ని చూసేమమ్మా! అఫ్‌కోర్స్ కొందరు అసలు బిగ్రదిగునుకుని మాట్లాడలేదనుకో! అది వేరే సంగతి! ఒకావిడ తనని గురించి చెప్తూ ఎంత గొప్పగా ఫీలైందో నిజంగా చూడాల్సిందే! ఆ వ్యాసమే ముందు పంపించేను. ఇక కొందరు అసలు ఈ దశాబ్దానికి ఏమిటి విలువ? ఎందుకింత ప్రాముఖ్యము, ప్రచారం? మీకేం పని పాటా లేదా? వెళ్ళండని దులిపిపారేసేరనుకో ఏమిటో ఆడ్వానులు.'

'అంతేనండి! ఎన్నాళ్ళైనా అలా చీకటి కోణాల్లో మగ్గిపోతారు తప్ప వెలుగు చూడరు' అని నిట్టూర్చింది వందన. వాళ్ళింట్లో ఉన్నంతసేపూ వందన అర్ధనిమీలిత నేత్రాలతో తాము ముందు ముందు ఎక్కబోయే ప్రగతి ఘనపు మెట్లని ఊహించుకుంటూ ఉంటుంది. అందులో కొన్ని సోపానాలు ఎక్కేస్తున్నట్టు భావిస్తుంది.

*　　　　*　　　　*

'హాయ్! కంగ్రాట్యులేషన్! రండి రండి మీరు హాల్లోకి మాకెంతో చాలా ఆనందంగా వుంది! డైరెక్టర్ మన అసిస్టెంట్ డైరెక్టర్ ఇవాళ సెలవులో వున్నారు. గనుక మీరూ మేమూ ఆట్టే

వాళ్ళు విరుచుకోనక్కర్లేదు. టీలో టిఫిన్లు తెప్పించుకుని ఇక్కడే ఆరగించవచ్చును' అంటూ గలగల నవ్వేడు ఆ హాల్లోనే వున్న మరో సెక్షన్ హెడ్! మహేశానికి ప్రమోషన్ వచ్చిన సందర్భంలో జరిగిన సన్నివేశము అది! రెండు సెక్షన్ల హెడ్లూ ఆ హాల్లోనే చెరొక కుర్చీల్లో కూర్చుంటారు. ఆ రెండు సెక్షన్ల ఎ.డి. గారు ఒక్కరే!

సమాన హోదాల్లో ఉన్నవారు గనుక చనువుగా ఎక్కిరిస్తూ జోక్స్ విసురుతూ ఉంటాడు అతడు.

మహేశం నవ్వి ఊరుకుంటాడు.

బాస్ మీద రకరకాల వ్యాఖ్యానాలు చేస్తుంటాడు. అలాంటివి విన్నప్పుడు అచ్చెరవునొంది మళ్లీ సర్దుకుంటూ ఉంటాడు మహేశం. ఒకరోజు ఎ,డి. గారు మహేశాన్ని రూములోకి పిలిచి, ఎంతో ఆప్యాయంగా మాట్లాడి ఇంటి అడ్రస్ అడిగి తెలుసుకున్నారు. మహేశానికి అయోమయంగ అనిపించినా ఏమీ ప్రశ్నించలేదు.

స్కూలు దగ్గర బాబ్జీని రిసీవ్ చేసుకుని ఇంటికి వచ్చాడు.

సరిగ్గా ఆ సమయములో వందన చేతిలో ఒక వారపత్రిక పట్టుకుని ఆత్రంగ చదువుతోంది.

మహేశం, బాబ్జీ లోపలికి వచ్చి పలకరిస్తున్నా ఆమె పట్టించుకోలేదు.

'ఏమిటోయ్! మరీ అంతలా అతుక్కుపోతున్నావ్ పుస్తకం లోకి ఏముందేమిటి?' అన్నాడు నవ్వుతూ. ఇంతసేపటికి తన వైపు చూడకపోయినా బాబ్జీని చూడకుండా ఉండలేదే? అన్న విభ్రమంతో ..

ఆమె తలఎత్తి, కళ్ళింతింతచేసి 'చూడండి ఇది? మీరూ చదవండి!' అంది.

మహేశం వారపత్రిక అందుకున్నాడు.

ఇంతలో బయట కారు ఆగింది. తమ ఎ.డి.గారు అందులో నుంచి దిగడముచూసి, తెగ కంగారు పడిపోయేడు. 'మా ఎ.డి.గారు మా ఎ. డి. గారు... ఆ సోఫా, నర్దు, కాఫీ వట్రా...అయ్యో ఇదేమిటి ఇలా వచ్చేసేడు...' అంటూ మళ్లీ గబగబా ప్యాంటు తగిలించి, షర్టు వేసుకోబోతుంటే ఆయన అప్పటికే లోపలికి వచ్చేసేడు!

'కూర్చోండి సార్, మీరిలా...'

'కంగారు పడకు మిస్టర్ మహేశ్. నేను కూర్చుంటాలే. మీ బాబా? వెరీ నైస్. ఆ, చూడూ అలా కూర్చో మహేశం, చిన్నప్పుడు నువ్వు అచ్చం ఇలాగే ఉండేవాడివి. మీ అమ్మగారు నీ క్రాపు దువ్వి చొక్కా లాగూ వేసి, బుగ్గమీద గట్టిగా ముద్దెట్టుకునేవారు. 'బళ్లో తినమ్మా' అని చక్కిలాలు పొట్లంగట్టి ఇచ్చేవారు. మీ అన్నయ్యా, అక్కయ్యా కొంచెం పెద్దాళ్ళం గనుక దులపరించుకుని వెళ్ళిపోయే వారు. మీ నాన్నగారు నీ వేలు పట్టుకుని స్కూలుదాకా తీసుకెళ్ళి, దింపి ఆయన ఆఫీసుకి వెళ్ళిపోయేవారు.'

'సార్. సార్. ఇవన్నీ మీకు...

"'తెలుసు మహేశం. నేను అప్పుడు మీ ఇంట్లోనే ఉండేవాడిని నువ్వు చాలా చిన్నవాడివి. నీకు గుర్తులేదు. కానీ, మీ ఇంటిలో మీ నాన్న ఓ అనాథ బాలుడికి భోజనము పెట్టుతుండేవారు. గోదావరి వరదల్లో మా అమ్మా నాన్నా కొట్టుకుపోతే దూరపుబంధువులు పట్టించు కోకపోతే...మీ నాన్నగారు కేవలము మా నాన్నతో ఉన్న పరిచయము తప్ప మరేవిధమైన బాంధవ్యం లేకపోయినా నన్ను దగ్గరికి తీసుకుని ఆదరించేరు। మీ అన్నయ్య అప్పుడప్పుడు నాతో దెబ్బలాటి 'ఫో'మ్మనే వాడు. కానీ మీ నాన్నగారు, తమ్ముడు తిడితే బాధపడకూడదు బాబూ' అని లాలించేవారు. మెట్రిక్ పరీక్ష కట్టించి, పాసయ్యాక చిన్న

ఉద్యోగంలో వేయించి, నా కాళ్ళమీద నన్ను నిలబెట్టేట్టు చేసేరు. ఆ తర్వాత పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడ్డాక కూడా నాన్నగార్కి ఉత్తరాలు వ్రాస్తుండేవాడిని— నేనూ పెద్దవాడి నవుతున్నాను, బాధ్య తల్లో మునిగిపోతున్నాను. ఏమిటో ఒక్కసారి వెళ్ళి అమ్మగార్ని, నాన్నగార్ని చూడాలనివుంది గానీ కుదరటములేదు. వాళ్ళు కులాసాగా ఉన్నారు కదూ?...నువ్వు ఇక్కడ ఉన్నట్టు నాకు తెలియను సుమా... మొన్ననే తెల్సింది..."

'ఆ, ఆ, కులాసాగానే ఉన్నారు.'

కాఫీ తీసుకువచ్చిన వందనని 'రామ్మా' అని ఆప్యాయంగ పిల్చేరు. 'మీ మామగారు అత్తగారు నాకు తల్లిదండ్రులాంటి వారమ్మా! నా లాంటివారి నెందరినో ఆయన ఆదుకున్నారు. కానీ ఎప్పుడూ ఎవ్వరికీ చెప్పేవారు కాదు. మీ అత్తగారూ అంతే! ఇంటికి వచ్చే చుట్టాంకి లేదనకుండా చేసి పెట్టేవారు. తనకంటూ ఏదీ కోరిక ఉన్నట్టు కన్పించేవారు కాదు. ఏదైనా అనుకున్నది జరగకపోతే, ఆవిడ చింతపడేవారే కాదు. 'పోనీలే!' అని సమాధానపడేవారు. అమ్మా! ఎప్పుడైనా ఇక్కడికి వస్తుంటారా? వస్తే మా ఇంట్లో తప్ప కుండా నెల్లాళ్ళు ఉంచుకుంటాను. చెప్పండి నాకు." ఆయన కంఠంలో ఆప్యాయం సుళ్ళు తిరిగిపోతోంది!

"ఆ, ఆ, అలాగే తడబడింది వందన. ఆమె కాళ్ళు నిలవటం లేదు. మనసు ఏదోలా అయిపోతోంది. చటుక్కున టేబుల్ మీద పత్రిక అందుకుని,' ఇది చూడండి ఇందులో ఆవిడ్ని మీరు సుర్తు పట్టగలరా! చదవండి ఆ వ్యాసం.' అని ఎ.డి.గారి చేతికి వారపత్రిక అందించింది వందన.

ఆయన రెండు నిముషాలు దీర్ఘంగా చూసి, ఆ తర్వాత చదివేక 'నేను ఆ ఊరునుంచి వచ్చేసాక జరిగిఉంటుంది. మీ మామగారు తనకు తానుగా ఏదీ చెప్పుకోరుకదా! అయితే ఈ "సుందరి" అన్న

అమ్మాయిని ఆత్మహత్యా ప్రయత్నం నుంచి కాపాడి సేవాసదనంలో చేర్పించేరన్నమాట। ఇదిగో అన్నీ విపులంగా రాసేరు కదా।' అని పైకి చదివేరు.

'ఆనాడు దిక్కుతోచని స్థితిలో ఆత్మహత్యకి సిద్ధమైన నన్ను దయామయుడు, ఆపత్‌బాంధవుడు, పురుషోత్తమరావుగారు కాపాడి జీవితం మీద ఆశ కల్పించి, నన్ను మనిషిగా నిలబెట్టేరు. తండ్రి ఎవరో తెలియని నా కొడుకుని ఈనాడు సమాజంలో ఓ పరిపూర్ణ వ్యక్తిగా తీర్చిదిద్దగల్గేను ఇదంతా ఆ మహనీయుని చలవ। జీవితాంతం పోషించనక్కర్లేదు. నీటికి కొట్టుకుపోయే తరుణంలో గట్టుకులాగే ప్రయత్నము, చేయూత చాలు॥ అలా ఇవ్వగల్గేవాళ్ళే సమాజములో వెలసిన దేవుళ్ళు। ఈనాడు నాకు దేనికీ భయపడని ఆత్మవిశ్వాసం ఉంది. సాటి వారికి సానుభూతి చూపగల మనసుంది. నిజాయితీగా బ్రతుకుతున్న సంతృప్తి ఉంది. పురుషోత్తమరావుగార్కి ఎల్లవేళలా నా భక్తి సుమాంజలులు అర్పించుకుంటాను."

'అవునమ్మా మీ మామగారు మహనీయులే. చూడమ్మా ఆశయాలు అందరికీ ఉండవు. ఉన్నా, సాగవు. ఒకవేళ ఆ ఆశయాన్ని నెరవేర్చుకోవాలన్నా ఎన్నెన్ని స్వార్థాలో అడ్డువస్తుంటాయి. ఆశయాల సెలయేళ్ళు గలగలా పారాలంటే స్వార్థపు అడ్డురాళ్ళు దారికడ్డం పడితే ఆ ఏరు అందంగా పారదమ్మా! ఆ మహేశం...నాకు చాలా ఆనందంగా వుంది. ఇలా పత్రికలో పడ్డ వ్యాసం వల్లనేనా కొందరు కరుణామూర్తులు బయటికి వస్తారు. ఇవాళ మిమ్మల్ని చూస్తుంటే మీ నాన్నగార్ని అమ్మగార్ని చూసినంత ఆనందంగా వుంది. వస్తాను మరి' అంటూ బొబ్బి తలనిమిరి బయటికి నడిచేరు.

వారు వెళ్ళిపోతుంటే స్థాణువులా నిలబడ్డ మహేశం, వందన తేరుకుని నమస్కారం పెట్టేరు.

తమని అమ్మా నాన్నంతో సమంగా చూడ్డం...గట్టిగ ఫీలై ఒకరి నొకరు చూసుకుని ఒకేసారి, అత్తగార్ని మామగార్ని తలుచుకుని ఇద్దరూ దండం పెట్టారు.

ఎదురుగా ఏ దేవుడి బొమ్మా లేకుండా ఎవరికి నమస్కారం పెట్తున్నారో అర్థంగాక బాబ్జి వింతగా చూశాడు.

ఏ.డి.గారు చెప్పినదేమీ వాడికి తెలియదేమో. పత్రిక చదవాలంటే తెలుగురాదు' మరివాడు తెల్లబోక ఏం చేస్తాడు?



# "ఉషోదయాన తుషార బిందువులు"

(ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో 1973 సం॥లో ఈ కథ ప్రచురించబడినది.)

అసలే వేసవి కాలం!

అందులో మిట్ట మధ్యాహ్నం॥

తారు రోడ్డు అట్ల పెనంలా ఆవిర్లు కక్కుతూంది. వీధంతా నిర్మానుష్యంగా ఉంది. కాని కాంపౌండు గోడమీదికి వంగిన జామ చెట్టు నీడలో చెవి తెగిన కుక్కపిల్ల ఒకటి నాలుక జాపి వగరుస్తూ, ఆశగా చెత్తకుండీవైపు చూస్తూంది. చెత్తాచెదారంతో నిండి, మచ్చుకి ఒక్క విస్తరాకైనా లేని చెత్తకుండీ పిచ్చి మొద్దులా నవ్వుతూంది.

గడుసుతనం నేర్చిన పెద్ద కుక్క ఒకటి పెరటిగోడ గెంతింది.

*　　　*　　　*　　　*

భుక్తాయాసం తీర్చుకుంటూ వరండాలో పట్టెమంచం మీద కూర్చున్నారు పరదాచార్యులుంగారు.

తీర్చిదిద్దిన పట్టెనామాలు, గోష్పాదమంత పిలక, తెలుగు పండితుడుగా పదహారు సంవత్సరాల అనుభవం, ఆపైన అందమైన

కూతురు రంగనాయకి, మరొక నలుగురు సంతానం, అందం తక్కువైనా ఓపిక ఎక్కువున్న భార్య చూడామణి—ఇవన్నీ ఆయన ఆస్తి లేదా గర్వకారణాలు అనుకుంటే...

అంద మునప్పటికి పెళ్ళిసంబంధాలు కుదరక పోవడం, మెట్రిక్ మంచి మార్కులతో పాసైనా కాలేజీలో చదివించలేక ఊరుకోవడం వగైరా వగైరాలు—ఆయనకి అప్పులు, లేదా పెద్ద మైనస్ పాయింట్లు!

వారం రోజులక్రితం తప్పిపోయిన సంబంధం గురించి ఆలోచిస్తూ, భుక్తాయాసం ఒకపక్క, విచారం ఒకపక్క చుట్టుకుని, "అమ్మా, రంగా! కాసిన్ని మంచినీళ్ళు తీసుకురా, తల్లీ" అని ఇంటిలోకి కేక వేశారు వరదాచార్యులుంగారు.

వంటింట్లో తల్లిపక్కను కూర్చొని, ఆవిడ భోజనం చేస్తుంటే కావలసినవి వడ్డిస్తూ, కబుర్లు చెబుతున్న రంగనాయకి తండ్రి పిలుపు విని, "వస్తున్నా నాన్నా" అని లేచింది.

నిజానికి రంగనాయకి సంబంధాలు తిరిగి పోతున్నందుకు బాధ పడటంలేదు, పైగా సంతోషిస్తూంది! ఆ పిల్ల మనసు మరొకరికి ఇచ్చేసుకుంది. సమయము, సందర్భము కలిసి రావాలనీ, అప్పుడు తండ్రికి, తల్లికి చెప్పాలనీ, ఈ లోపులో ఏ సంబంధము కుదరకూడదనీ ఎంతగానో భగవంతుణ్ణి కోరుకుంటూంది. గ్లాసుతో చల్లటి నీళ్ళు తీసుకుని వెళుతూంది రంగనాయకి వీధి వరండాలోకి. మధ్యగదిలో చాపమీద పడి దొర్లుతున్న చెల్లాయిని, తమ్ముళ్ళని "చదుకోండర్రా" అని కోప్పడి తండ్రికి గ్లాసు అందించింది.

సరిగా అప్పుడే గోడ గెంతింది కుక్క!

*         *         *

మీనాక్షమ్మ వంటింట్లో పని చేసుకుంటూంది. కాని ఆవిడదృష్టి

అంతా వీథి వరండాలో కూర్చున్నా వరదాచార్యులుగారిమీద కేంద్రీకృతమై వుంది.

రెండు వాటాలకీ ఉమ్మడి వరండా అది.

వరదాచార్యులుగారు వరండాలో కూర్చునప్పుడల్లా పక్కవాటా మీనాక్షమ్మకి ఒళ్లు మండిపోయి, ఆ తరవాత అది చల్లార్చుకునేందుకు నానా తంటాలు పడుతుంది. భర్త శివశంకరశాస్త్రి మధ్య గదిలో నిద్రపోతున్నారు. ఒక్క సెలవురోజున తప్పమిగతా రోజుల్లో ఆయనకి పైలు కట్టలు, రాబోయే ప్రమోషన్, ఇంక్రిమెంట్లుతప్ప మరొకగొడవ అక్కర్లేదు. సెలవురోజు మాత్రం హాయిగా ఆదమరిచి నిద్రపోతారు.

అదే నచ్చదు మీనాక్షమ్మకి.

ఆ సెలవురోజైనా ఇంటి గొడవలు పట్టించుకోరేం ఖర్మ? అని వాపోతూ ఉంటుంది. ఆవిడ దృష్టిలో 'ఇంటి గొడవలు' అంటే- పెరట్లో చూడామణెమ్మ గొంతువినిపించినా 'ముఖం' కనిపించకుండా అడ్డు కట్టిన తడిక ఊడిపోతూంది కనక మళ్లీ గట్టిగా కట్టడం, మధ్య గదిలో తలుపు సందుల్లోనుంచి చూసుకోకుండా అతికించిన కాగితాలు చిరిగిపోతున్నప్పుడల్లా మళ్లీ దళసరి కాగితాలు అంటించడం; ఉమ్మడి వరండాలో వరదాచార్యులుగారు కాని, ఆయన కుటుంబ సభ్యులుకాని కూర్చుంటే—ఆ హక్కు తమకు కూడా ఉన్నట్టు ఋజువు చేయడము గేటుపక్క దామచెట్టు కాయలు, పిందెలతోసహా చెరి సగం పంచుకోవడము. ఇరువైపు సందుల్లో ఇంటివాళ్ళు వేసిన ముద్ద మందారం, నందివర్ధన, మల్లి, పారిజాతాలు వంతుల వారీగా కోసుకోవడం... ఇత్యాదివన్నీ అతిశ్రద్ధగా చేయమంటుంది మీనాక్షమ్మ.

శివశంకర శాస్త్రిగారికి చిరాకు,

'అద్దె కొంపలో అధికారాలు, హక్కులు ఏమిటే' అని విసు

కుక్కుంటారు. 'అంతగా అయితే మన గోపాలానికి ఉద్యోగం దొరకనీ. మనం వేరే పెద్ద ఇల్లు తీసుకుందాము' అంటాను.

"గోపాలం బి.ఎ. టైప్ అండ్ షార్ట్‌హాండ్...' మీనాక్షమ్మగారి పెద్ద కొడుకు. కొన్ని నెలలుగా ఉద్యోగాన్వేషణలో చెప్పులు అరిగేలాగ తిరుగుతూనే ఉన్నాడు.

ఆ రోజుకూడా అతను అందమైన క్రాపును మరింత అందంగా దువ్వుకుని, అరిగిపోయిన చెప్పుల్ని తొడుక్కుని, పన్నెండవసారి ఇంటర్వ్యూకి వెళ్లాడు. పట్టువదలని విక్రమార్కుణ్ని గుర్తుచేసుకుంటూ

ఈసారి ఎలాగైనా ఉద్యోగం వచ్చేస్తుందని. అప్పుడు తాము పెద్ద ఇంట్లో హాయిగా ఒక్కళ్ళే—మరొకళ్ళ పొత్తు లేకుండా ఉండవచ్చుననీ మీనాక్షమ్మ వంటింట్లో పని చేసుకుంటూ కలలు కంటోంది. ఆ సమయములో వరదాచార్యులుగారు వసారాలో 'తన స్వంత ఇల్లులా?' మంచం వాల్చుకుని కూర్చోవడం మీనాక్షమ్మకి నిలువెల్లా దహించుకు పోతూంది. ఆ పిలక పట్టుకుని పీకి పారేయాలన్నంత కోపం వచ్చింది. కానీ ఆ కోపం తీరే విధానం తెలియటంలేదు.

అదిగో, సరిగా ఆ సమయములో పెరటి గోడ గెంతి వస్తున్న కుక్క కనిపించింది. మీనాక్షమ్మ బుర్రలో మెరుపు మెరిసింది.

* * * *

రంగనాయకి అందించిన నీళ్ళగ్లాసుపట్టుకుని కూతుర్ని ఒకసారి అదోలా చూసి, 'పిచ్చితల్లీ, నీ అందచందాలు ఎందుకూ పనికి రాకుండా పోతున్నాయిగదా. చదువు చెప్పించలేక, పెళ్లి చేయలేక పిల్లని ఎలా ఎదగబెట్టేస్తున్నానో' అనుకుని బాధగా నిట్టూర్చుకుని గ్లాసు పైకి ఎత్తి త్రాగబోతున్నారు. తండ్రిని జాలిగా చూసింది రంగనాయకి.

'పిచ్చినాన్నా, ఎందుకు బాధపడతావు. ఈ ఇరవైఏళ్ళ రంగ

మనస్సులో ఏముందో నీకు తెలియదు కదా ఒక వార్త కోసం ఎదురు చూస్తున్నాను, నాన్నా. ఆ వార్త అందగానే నీ బాధ తీరిపోయేలా చేస్తాను నాన్నా.' అనుకుంది.

"ఛీ. దిక్కుమాలిన కుక్క. ఇంట్లోకి జొరబడతావుటే. ఇదేం నీ స్వంత ఇల్లనుకున్నావా. మేమే అద్దెకున్నామే. అయినా, చూస్తూ చూస్తూ ఊరుకుంటారా మనుష్యులు పాడు బుద్ధులు. తమ ఇంట్లోకి దూరకపోతే చాలనుకోవడమే. కుక్క ఇంటిలోకి వస్తూంటే కాస్త కొట్ట కూడదూ.' అక్కడే ఉండి కూడా పట్టనట్టు ఊరుకోవడం—ఛీ పాడు బుద్ధులు..." జోరుగా మాటలతోపాటు బయటికి కుక్క పరుగెత్తుకు రావడం, రంయ్‌మని రూళ్ళకర్ర దూసుకురావడం రెప్పపాటులో జరిగింది. ఆ కర్ర వెంట్రుకవాసిలో వరదాచార్యులగారి తలకి తగలకుండా తప్పిపోయింది. ఎత్తిన మంచినీళ్ళ గ్లాసు ఎత్తినట్టే ఉంచేసి. నీళ్ళు చింది మీదపడ్డా గమనించనంత నిర్ఘాంతపోయారు ఆయన.

ఢభేలుమని మీనాక్షమ్మ తలుపేసుకున్నాక తేరుకుని, "అమ్మా రంగా, ఆ కుక్క నిజంగా వీథిలోనుండే వచ్చిందా? నేను గమనించనే లేదమ్మా. చూస్తే ఊరుకుంటానా? అంత పాడు బుద్ధులెందుకుంటాయమ్మా?" అని ఆయన కూతురు ముఖంలోకి చూస్తూ అడిగారు.

"మీరు ఊరుకోండి, నాన్నా. ఆవిడ మాటలకేం లెండి. కుక్కల్ని రానిచ్చే బుద్ధి ఎవరికి ఉందో తెలుస్తూనే ఉంది. పొరుగు పచ్చ చూసి ఓర్వలేని వాళ్ళు ఏదో వంక దొరికితే చాలు.' అంటూ మంచం పక్కపట్టె కర్రను తీసుకుని వరండా పక్కనే ఇంకా ఒదిగి నిల్చుని కుక్కమీదికి విసిరి కొట్టింది.

మొదటిసారి దెబ్బ తప్పించుకున్నప్పటికి రంగనాయకి చేత దెబ్బ తట్టుకోలేక 'కుయ్యో' మని గేటు బయటికి పరుగెత్తింది కుక్క.

భళ్లున తలుపులు తెరుచుకుని [illegible] బయటికి వచ్చింది.

'అయ్యో, పిచ్చి ముండా! ఎంత [illegible]త్తున్నావే!' అంటూ వరండా దిగి కర్ర తీసుకుని వచ్చి తలుపు[illegible]ంది.

రంగనాయకి ఫక్కున నవ్వబోయి ఆగింది.

గేట్లోనుంచి సైకిల్ నడిపించుకుంటూ [illegible]లం వస్తున్నాడు.

చెమట కారుతున్న ముఖం, ఎర్రగా [illegible] పాపలు, అలిసిపోయిన కళ్లు—నీరసంగా సైకిల్ నడి[illegible] గోపాలాన్ని ఒకక్షణం దీక్షగా చూసి, ఈ రోజు ఇం[illegible]. కాయా తేల్చుకోలేక, మంచినీళ్ళ గ్లాసు తీసుకుని [illegible], తండ్రి ఇంకా తాగకపోవడంచేత మళ్లీవచ్చి [illegible] ఇంట్లోకి వెళ్లిపోయింది రంగనాయకి.

ఈ గొడవకి మెలకువవచ్చిన [illegible] గొడవ? అని బయటికి వచ్చినా, గోపాలాన్ని చూడగానే [illegible] సంగతి గుర్తు వచ్చి 'ఏమైందిరా' అంటూ అడిగారు.

గోపాలంఅలసటగా సైకిల్ ఇంట్లోకి తీ[illegible]గానే [illegible]నాక్షమ్మ దభీమని తలుపులు వేసుకుంది, [illegible]గారి [illegible] ఎర్రగా చూస్తూ. ఆయన పిలకని ఎడంచేత్తో [illegible], కుడిచేతిలో గ్లాసు నీళ్ళు ఎత్తి గటగట త్రాగి లేచి ఇంట్లోకి నడిచారు. [illegible] చేయి కడుక్కుని ఆత్రంగా కూతుర్ని అడిగింది: 'మళ్లీ ఏమిటే గొడవ?'

'ఆఁ ఏముందీ? మామూలే! ఈమధ్య వారం [illegible]ంది కదూ ఏ గొడవలు లేకుండా? అందుకని అవిడకి వేడి ఎక్కువైంది. అసలే ఎండాకాలం కదా?!' అని నవ్వింది. [illegible] నిట్టూర్చు కున్నది.

* * * *

నీరెండలో సాయంత్రం పూల మొక్కలకి నీళ్ళు పోస్తోంది రంగనాయకి. చిరుగాలికి ముంగురులు తేలి తేలి ఆడుతున్నాయి. కుచ్చెళ్ళు పైకి దోపింది. అడుగున తెల్లని లంగా, దాని తాలూకు జాలు అందంగా తొంగి చూస్తున్నాయి అడుగున మడమలపైకి ఉన్న చీర అంచులు తడిసి. అడపాతడపా రంగనాయకి నడకకి బంధాలు వేస్తున్నాయి. చీర కొంగు నడుం చుట్టు తిప్పి బిగించింది. ఆ బిగింపులో మరి బిగుతుగా కనిపిస్తున్న ఒంపులు, నీరెండలో మెరుస్తున్న మెడలో ఒంటిపేట గొలుసు...

రంగనాయకిని ఓరగా చూస్తూ పంపుదగ్గర ముఖం కడుక్కునే ప్రయత్నంలో ఉన్నగోపాలం—'ఎంతకాలం తను ఇలా దూరంనుంచే చూసి ఆనందించాలా,' అని చింతిస్తున్నాడు.

ఎర్ర ప్లాస్టిక్ బకెట్ తీసుకుని పంపు దగ్గరకి వచ్చింది రంగనాయకి.

సబ్బు నురుగు రెండు చేతులనిండా పులుముకుంటూ 'చాలా బాగుంది' అన్నాడు గోపాలం.

'ఏమిటి ఆ సబ్బు నురుగా, లేకపోతే ఈ బక్కెటా.' అని చిన్నగా నవ్వింది.

గోపాలం నిటారుగా నిలబడి 'ఇందాక మీ అందం. ఇప్పుడు ఆ చిరునవ్వు' అన్నాడు చిలిపిగా.

'అంతే తీరిగ్గా ఆనందిస్తూ కూర్చోండి' చిరుకోపంగా అన్నది

'అందుకేగా నా ఆరాటం. తీరిగ్గా కూర్చుని, ఎదురుగా కూర్చోపెట్టుకుని జన[illegible] చాలనే నా కోరికంతా, కాని ప్చ్. ఏదీ. మొన్న ఇంటి[illegible] [illegible]న్న చెప్పింది. మళ్ళీ దేనికైనా ప్రయత్నం చేయాలిగదా. [illegible]...తమరి 'సంబంధం' కూడా తప్పిపోయిందిటగా. నిన్నరాత్రి అమ్మ మహా సంతోషంగా చెపుతుంటే నేనూ

సంతోషించాను...ప్చ్. పాపం, నాకు ఉద్యోగం రాకనట్టే మీకూ సంబంధాలూ తప్పిపోతున్నాయని ఆవిడ ఆనందం. తన కొడుక్కంటే ముందు మీకు పెళ్ళి కుదిరిపోకూడదని ఆవిడ పంతము. కాని, మీకు పెళ్ళే కనక స్థిరపడితే తన కొడుకు ఇక ఉద్యోగ ప్రయత్నం చేయడనీ అసలు ఇంటిలోనే ఉండడనీ ఆవిడకేం తెలుసు.' గోపాలం సూటిగా చూశాడు రంగనాయకి కళ్ళలోకి.

క్రిందికి వాలిపోయాయి రంగనాయకి కనురెప్పలు.

'ప్లీజ్. అలా వాల్చేసుకోకండి.' చిన్నగా, మరీ చిన్నగా అన్నాడు ఒక అడుగు ముందుకు వేస్తూ.

రంగనాయకి మెల్లగా నవ్వి తల పైకి ఎత్తి ఒక అడుగు వెనక్కి వేసింది దూరాన్ని అతిక్రమించరాదన్నట్లు.

'అన్నీ కబుర్లు. లేకపోతే ఏమిటీ. మీ అమ్మగారికీ, మా నాన్న గారికీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. నన్నయితే అమాంతం నమలకుండా మింగేయాలన్నంత కోపం ఆవిడకి. ఇంకా మనం ఎలా కలుస్తాం.'

'అందుకే గదా ఉద్యోగ ప్రయత్నం? అది దొరికితే మనము మన దారిన పోతాం. వాళ్ళ కోపతాపాలన్నీ చల్లారిన తరవాతనే రావడము. చిక్కల్లా—మీరీలోపున మరో సంబంధము కుదరకుండా చూసుకోవడం వరకే. అయినా గుడ్డి వెధవలు. వాళ్లెం పెళ్ళికొడుకు లండీ. రెండు కళ్ళతో చూడటంలేదా మిమ్మల్ని. లేక నా అదృష్టాన్ని చెరపడము ఇష్టములేక భగవంతుడు వాళ్ళ కళ్ళకి మసకపొరలు చుట్టేస్తున్నాడా.''

గలగల నవ్వింది రంగనాయకి.

తన్మయత్వంతో కళ్ళు మూసుకుని తెరిచాడు గోపాలం.

'మీరు బి.ఎ. ఎలా పాసైనారండీ. అందుకే ఈ రంగనాయకి అందం మీకు నచ్చింది మీరు ఉత్త పిచ్చివారు. వస్తాయండీ. ఆ వచ్చినవాళ్లు అడిగిన రేటు మా నాన్నగారు ఇవ్వగలిగితే ఈ రంగనాయకి అందం వేనోళ్ళ పొగడబడేది'. చేతిలో బక్కెట్ గిరగిరా తిప్పింది.

'పోనీలెండి. మీ నాన్నగారు వాళ్లడిగిన 'రేటు' ఇచ్చుకోలేక పోవడము కూడా నా అదృష్టమే.'

'ఏం. మీకు రేటు లేదా?' రంగనాయకి గోపాలాన్ని చిలిపిగా చూసింది.

'ఎందుకు లేదూ. ఉంది. ఎటొచ్చీ ఆ రేటు పెళ్ళి అయ్యాక చెపుదామని ఉంది.'

''ఏమిటో'' కళ్ళు వెడల్పు చేసుకుని అడుగుతూ ఉంటే గోపాలం ముచ్చటగా చూస్తూ, ''అమ్మో—అది ఇప్పుడే చెప్ప కూడదు'' అన్నాడు ఊరిస్తున్నట్టు.

మూతి సున్నలా చుట్టి, 'దాచుకోండి. ఆ తరవాత తీరిగ్గా విచారించుకో వచ్చును. మా నాన్నగారు ఈ రాత్రి ఊరి కెళుతున్నారు, మరేదో సంబంధము చూస్తారట. ఒకవేళ అతగాడికి మీలానే రేటు చెప్పకుండా పెళ్ళి చేసుకుని ఆ తరవాత చెప్పాలనిపిస్తే...' అంది.

'నిజమా?' గోపాలం కంగారుగా అడుగుతూ ఉంటే రంగనాయకి నవ్వింది.

'అఁ పచ్చినిజం! మీ చేతుల్లో సబ్బు నురుగు ఎండిపోయినంత పచ్చి నిజం. మా నాన్నగారు, అమ్మగారు ఇప్పుడు ఇంట్లో లేరు. అవతల బజార్లో ఉన్న బంధువుల ఇంటికి వెళ్ళారు. ఆ సంబంధం విషయాలేవో కనుక్కొని వస్తారుట. సరే, మీ చెల్లాయిలు, మా చెల్లాయిలు, తమ్ముళ్ళు కలిసి ఆటలకి పోయారు, మీ నాన్నగారు...'

'తెలుసు, తెలుసు—షరారు [illegible]. మా అమ్మగారేమో గేటుదగ్గర సైకిల్ బండి వాడి దగ్గర కూరలు [illegible]ంటోంది. కనకనే మనము ఇంతసేపు స్వేచ్ఛగా మాట్లాడుకుంటున్నాం. [illegible] చదువుకోండి. ఆ సంగతి వదిలివేయండి. ఇంతకీ మీ నాన్నగారు నిజంగానే ఈరాత్రి ఊరి కెళ్లుతున్నారా?' చేతులు రెండూ! పంపు క్రింద కడిగేసుకుంటూ అడిగాడు,

'చెప్పానుగా—నిజమేనని' నవ్వు [illegible]పోతుంది. మళ్ళీ మీ అమ్మగారు లోపలికి వచ్చే[illegible] గాలివాన మొద లవుతుంది' అంటూ బకెట్ పంపు కింద [illegible].

'అయితే, నేను వెంటనే [illegible]లోకి [illegible]సిందే!' మరీ దగ్గరగా నించునే చెప్పాడు గోపాలం

'ఊహుఁ! దూరం. అదుగో, మీ అమ్మగారి [illegible] పూర్తి అయినట్టుంది. ఇలా మనిద్దర్నీ చూశారా—[illegible] ఎగిరిపోతాయి!' నవ్వింది.

'అదెటూ ముందు ముందు జరగవలసిందే! కాని, ఇప్పుడు నేను ఏదో ప్రయత్నం చేయాలి.' సీరియస్‌గా [illegible] చూస్తూ, 'ఏం చేస్తారూ?' అనడిగింది.

'ఏముందీ—ఏదో ఒకటి! గజరాజు చెప్పిన సలహానే పాటిం చేస్తాను." భుజం మీద టక్కీ టవల్ సవరించుకుంటూ చెప్తుంటే ఉలిక్కిపడింది.

'ఏమిటీ! కిళ్ళీ కొట్టు గజరాజుని సలహా అడిగారా? [illegible]గా వాడిలాగే మీరు కూడా ఓ సోడా బడ్డీ తెరుస్తారా!" కళ్ళింతింత చేసు కుని అడిగింది.

'ఏం చేయను మరి! మనింటి పరిస్థితులు అలా ఉన్నాయి మరి! మనకి ఏదో ఒక ఆధారం లేకపోతే మనవాళ్ళని ఎదిరించడం కష్టం!

పకపక నవ్వింది రంగనాయకి. బకెట్టులో పడుతున్న నీళ్ళ చప్పుడులో కలిసి ఆ నవ్వు వింతగా ధ్వనించింది.

'ఎంత అమాయకులండీ! మీ టైపు, షార్ట్‌హాండ్ క్వాలిఫికేషన్లు సోడా బుడ్డీలు కొట్టడానికీ, కిళ్ళీలు కట్టడానికీ వినియోగిస్తారా!' గోపాలాన్ని ప్రేమగా చూస్తూ అడుగుతూ ఉంటే—'తప్పదు మరి, దేవిగారి అనుగ్రహం కోసం ఎన్ని పాట్లైనా పడాలి!' అని ఒకింత ముందుకు వంగి చెప్పబోయాడు గోపాలం.

'ఒరే, గోపాలం। ఎంత సేపట్నుంచీ కడుగుతున్నావురా ముఖం' అంటూ వీధి గదిలోనుంచే గావుకేక పెడుతూ కూరల బుట్టతో వస్తోంది మీనాక్షమ్మ.

పంపు కట్టేసి, 'చూశారా? డేంజర్ లైటు వెలిగింది। మరి నేను తప్పుకుంటున్నా' అంటూ రంగనాయకి గబగబ బకెట్ తీసుకుని సందులోకి వెళ్ళిపోయింది।

*　　　　*　　　　*

కిళ్ళీకొట్టు గవర్రాజుకి రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో మహా బిజీగా ఉంటుంది.

టైట్ పాంట్లు, పూల బుష్‌కోట్లు, మల్లు లుంగీ పంచెలు, సిల్కు లాల్చీలు, జులపాల జుట్లు, నమ్మర్ క్రాపులు, లాపీ గుండ్లు చుట్టూ చేరి ఉంటాయి.

ఒక్క సిగరెట్ పెట్టె కొనేవాళ్ళు, సిగరెట్ పెట్టెతోపాటు అగ్గిపెట్టె కొనేవాళ్ళు, ఒకే ఒక్క సిగరెట్ మాత్రమే కొనేవాళ్ళు. జర్దాపాన్ కొందరికి, మీఠా పాన్ కొందరికి, వక్కపొడి మాత్రమే కొందరికి, మాగజైన్లు కొందరికి. అందులో సినిమా బొమ్మలు చూసేసి వెళ్ళిపోయేవాళ్ళు కొందరు. రంగు సోడాలు కొందరికి, నీళ్ళ సోడాలు కొందరికి.

రోడ్డు మీద రిక్షాలు మాట్లాడేవాళ్ళు, అమ్మాయిల్ని చూసేవాళ్ళు కొందరైతే, దుకాణాల్లో పెట్టిన షోకేసు బొమ్మల్ని తనివితీరా చూసే వాళ్ళు కొందరు. ఇలా రకరకాల వాళ్ళతో గవర్రాజుకు బోల్డు బిజీ!

భోజనం చేశాక గోపాలం గవర్రాజు రిక్షాకొట్టుకు బయలు దేరాడు. కొట్టు చుట్టూ ఉన్న బృందాన్ని చూసి ఆగిపోయాడు.

గోపాలానికి ఆ బృందంతో కలిసే పనిలేదు. కేవలం గవర్రాజుతో మాట్లాడే పని మాత్రమే.

వెనక్కి తిరిగి వచ్చి, సగం కట్టి వదిలేసిన ఒక బిల్డింగ్ గోడ మీద, లైటు స్తంభం వెలుగు పడని నీడలో కూర్చున్నాడు, కర్చీఫ్ వేసుకుని. సిగరెట్ అలవాటు లేని గోపాలానికి పుల్లపెడ్డలు ఏరుతూ కూర్చోవడము విసుగనిపించింది.

'రంగనాయకికి పెళ్ళి సంబంధం కుదరక ముందే తనకి ఉద్యోగం దొరకాలి లేదా ఏదైనా బ్రతుకు తెరువైనా చూడాలి. లేక పోతే తల్లిని, తండ్రిని ఎదిరించి పెళ్లి చేసుకోటం ఎలా వీలవుతుందీ? రంగని వదులుకుని తను లైఫ్‌లో సుఖపడలేదు. అమ్మా, నాన్నా తన మీద బోలెడు ఆశలు పెట్టుకుని ఉండవచ్చు. కట్నంతో వచ్చే మరో మంగో, గంగో తన భార్య కావచ్చు. కాని, రంగలా కనిపించరు వాళ్ళు!

మొట్టమొదటిసారిగా రంగనాయకి వాళ్ళ పక్క వాటాలో దిగిన రోజు...ఆ రోజు రంగనాయకి తన కెలా కనిపించిందో, తన మనస్సెలా ఉప్పొంగిందో గోపాలం ఎప్పుడూ మరిచిపోలేదు! అందుకే, గోపాలం కట్నాల గొలుసులకి లొంగటం లేదు. కాని, తల్లితో పెద్ద చిక్కు వచ్చి పడింది. ఏ క్షణంలో రంగనాయకిని తను చూశాడో తన మనస్సులో ఆమెనే నిలుపుకున్నాడో అదే క్షణంలో మీనాక్షి రంగనాయకి మీద విపరీతమైన క్రోధం పెంచుకుంది! జంటగాపూసిన

ముద్ద మందారం కొమ్మ వంచి రెండు పువ్వులు వేరు చేయకుండా కొంచెం కొమ్మతో సహా కోసి స్టీలు పళ్లెంలో పడేసుకుని, పారిజాతలు ఏరుకుంటున్న రంగనాయకి గోపాలం కళ్ళకి అత్యద్భుతంగా కనిపించింది! బ్రష్ నోట్లోనే ఉంచేసుకుని, ఆమె రూపాన్ని మరొక బ్రష్‌తో హృదయ ఫలకం మీద గబగబ చిత్రించేసుకుంటున్నాడు. సరిగా ఆ సమయంలోనే మీనాక్షమ్మ వచ్చి రంగనాయకితో—'చూడమ్మాయ్! ఆ మందార పువ్వులు ఈవేళ రెండే పూశాయి. అందుకని ఆ రెండిటిలో ఒకటి మా కిచ్చి, ఒకటి మీరు తీసుకొండి' అని, ఒక చెయ్యి నడుం మీద, మరొక చెయ్యి వేళ్ళన్నీ మూసి చూపుడు వేలితో సూచిస్తూ చెపుతున్న ఆ భంగిమని చూసి రంగనాయకి వింతగా చూసింది.

గోపాలం వెంటనే హృదయ ఫలకం మీద వ్రాసేసుకున్నాడు 'ఆ అమ్మాయి వింతగా చూసినప్పుడు మహా అందంగా ఉంటుంది!' అని.

ఆ తరవాత రంగనాయకి చిన్నగా నవ్వి "చూడండి. ఇది జంటగా పూసింది. కోసేశాను! ఇలాగే ఎంతో బాగుంది! కనక రేపు మీరు పూసిన పువ్వులన్నీ కోసుకుందురు గానీ. అదీగాక మీరు రెణ్ణెల్ల ముందు నుంచీ ఉంటున్నారుగదా? మేము నిన్న సాయంత్రమే కదా వచ్చాం? అందుకని ఈ వేళ ఈ పువ్వు మేం తీసుకుంటాం" అని చెబుతుంటే ఆ అమ్మాయి కళాత్మక హృదయానికి (జంట పూలు విడదీయ కూడదన్న మాటకి) మురిసిపోయిన గోపాలం—'ఆ అమ్మాయి అందం బాహ్యానికి మాత్రమే కాదు, ఆంతర్యం కూడా బహు అందమైనది' అని చిత్రించేసుకున్నాడు.

కాని, మీనాక్షమ్మ ఉరిమినట్టు చూసి, 'అందుకే చెబుతుంట. మేము ఇన్నాళ్ళ నుంచీ కోసుకుంటున్నాము గదా? మీరు నిన్న వచ్చారో, లేదో—అప్పుడే ఈవేళ వంతులా కోసేసుకుంటారా? ఆ

మొక్కలన్నీ మేము వచ్చేనాటికి మూరెడు. జానెడు లేవు, నీళ్ళు అవీ పోసి అంతెత్తు పెంచాను. మీరు అప్పుడే కోసేస్తే ఎలాగ?' అని అథారిటీ చూపించింది.

రంగనాయకి ఫక్కున నవ్వింది,

గోపాలం వెంటనే హృదయములో వ్రాసేసుకున్నాడు— 'చెల్లాయి ముత్యాల దండలో ముత్యాలు నకిలీవీకానీ. ఆ అమ్మాయి నవ్వులో ఒకటవరకమైన ముత్యాలు ఏరుకుని దండ కట్టుకో వచ్చును అని.

'చూడండీ, రెణ్ణెల్లలో మూరెడు, జానెడు మొక్కలు. ఇంతెత్తు పెరిగాయా?' అని మళ్ళీ చిన్న నవ్వు ఒకటి విసిరి 'ఎందుకండీ చెప్తారు మాటలు? రేపు మీరు కోసుకుందురు గాని లెండి. కానీ, చూడండి. ఇక మీదట ఈ ఇంట్లో మీకు, మాకు సమానమైన హక్కులే ఉంటాయి. ఎందుకంటే, మనిద్దరం అద్దెకున్న వాళ్ళమే గానీ, ఇంటి స్వంతదారులం మాత్రం కాము' అని చెప్పేసరికి మీనాక్షి చిర్రు బుర్రులాడుతూ తమ వాటాలోకి చక్కా పోయింది.

ఇంతలో రంగనాయకిని వాళ్ళమ్మ 'రంగనాయకి!' అని పిలవ గానే—'ఆఁ వస్తున్నానమ్మా' అని గబగబ వస్త్రం తీసుకుని వెళ్ళబోతూ గోపాలన్ని చూసింది. బ్రష్ నోట్లోను, చేయి కుళాయిమీద చూపులు రంగనాయకి మీద నిలిపేసి నిలుచుండిపోయిన ఆ రూపం ఎందుకో రంగనాయకికి గమ్మత్తు అనిపించి, చిన్నగా నవ్వింది.

గోపాలం ఉలిక్కిపడి రెప్పలు అలా అలా కదిల్చి, బదులుగా చిన్నగా నవ్వాడు. ఆ తరవాత రంగనాయకి ఇంట్లోకి వెళ్ళిపోయింది. గోపాలం ముఖం కడుక్కుని ఇంట్లో కొచ్చాడు. మీనాక్షమ్మ కాఫీ గ్లాసు తీసుకుని వస్తూ, "ఆ పిల్ల పొగరు చూశావట్రా? ఉత్త పెంకి ఘటం!" అని చెప్పింది.

కాఫీ తాగుతూ గోపాలం హృదయంలో వ్రాసేసుకున్నాడు--

'రంగనాయకి లాంటి అందమైన పిల్లకి కాస్త పొగరు, పెంకితనం ఉంటే మరీ బాగుంటుంది—స్వీట్ పక్కన హాట్‌లాగ! కనక చేసు కుంటే రంగనాయకినే చేసుకోవాలి'—అని.

ఆ సమయంలోనే మీనాక్షమ్మ చెప్పింది—''ఈ పిల్లతో కష్ట మేరా?! నసేమిరా ఈలాంటి పొరుగు పక్కన ఉండకూడదు!' అని.

కాని, గోపాలం ఎప్పుడో నిశ్చయించుకున్నాడు—

'రంగనాయకి లాంటి పిల్ల పొరుగు ఇంట్లో ఉండటమేమిటీ? స్వంత ఇంట్లో ఇల్లాలైపోవా'లని ఈవిధంగా గోపాలం మొదటి చూపు లోనే ప్రేమించాడు. ఆ పిల్లని. ఇంటర్మీడియేట్లన్నీ ఇంటూ గుర్తుల్లోకి మారిపోతూ తనకీ, రంగనాయకికి మధ్య దూరాన్ని పెంచేస్తున్నాయి.

అయినా, రంగనాయకికి కూడా వచ్చిన సంబంధాలన్నీ తప్పి పోయి, తనకీ, ఆమెకీ మధ్య లైన్‌క్లియర్ చేస్తున్నాయి. కనుక ఇప్పటి వరకు గోపాలానికి ఇమ్మీడియట్‌గా సంపాదనని గురించి ప్రయత్నించ వలసిన అవసరము రాలేదు. కానీ. ఇప్పుడు రంగ తనకి మరొక సంబంధము చూస్తున్నారనీ, అది కుదరవచ్చునీ అనేసరికి గోపాలానికి గుండె గొంతులోకి వస్తూంది.

సాధారణంగా గోపాలానికి ఇరుకాటకం వచ్చినప్పుడల్లా గవ ర్రాజు సలహా లివ్వడం, ఒక్కోసారి సర్దుబాటుగా డబ్బు ఇవ్వటము కూడా కద్దు. ఇంతకీ కిళ్ళీకొట్టు గవర్రాజుకి, గోపాలానికి స్నేహమేమి టని అనుకోవచ్చును? కానీ, సదరు కిళ్ళీ కొట్టు గవర్రాజు గోపాలానికి ఒకటవక్లాసునుంచి హైస్కూలు చదువువరకూ, క్లాస్‌మేట్. హైస్కూలు చదువు డింకీ కొట్టాక గవర్రాజులో వివేకము తన్నుకొచ్చింది. చదు వులు, డిగ్రీలు శుద్ధ దండగనీ. బ్రతకటానికి పనికివచ్చేవి కావనీ తెలుసుకుని, చేతి గడియారం, ఉంగం, సైకిల్ అమ్మేసి చిన్న బడ్డీ కొట్టు తెరిచాడు. ఇంట్లో తండ్రీ, పిల్లనిచ్చే మేనమామా-ఇద్దరూ

కలిసి ఎడాపెడ చీవాట్లు పెట్టారు. 'ఇలాంటి జులాయి వెధవకి నా పిల్ల నివ్వను ఫో' అన్నాడు కానీ, ఆ పిల్ల గవర్రాజును అతి చక్కగా ప్రేమించేసింది గనక గవర్రాజులో పౌరుషం తలఎత్తింది. రెండవ కంటివాడికి తెలియకుండా రిజిస్టర్ మారేజి చేసుకుని కొత్త కాపరం పెట్టారు. రెండు మూడు నెలలో గవర్రాజు కొట్టు అభివృద్ధి చెందింది. తండ్రి, మేనమామ కొంచెం కొంచెం మెత్తబడిపోయారు. మరొక నాలుగు నెలలో స్వంతంగా కొట్టు తయారు చేయించుకున్నాడు. ఇప్పుడు తండ్రీ, మేనమామా గవర్రాజును పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లమని ఆశీర్వదించి, రాకపోకలు జోరుగా సాగించి, అప్పుడప్పుడు డబ్బు, సర్దుబాటు చేయమని వంకర నవ్వులు నవ్వుతున్నారు.

కనక గవర్రాజంటే యువక జనానికి గురి! గురువు లాంటి వాడు. అందులోనూ ప్రేమించుకుని, ఉద్యోగము లేక అవస్థపడే గోపాలం లాంటి వాడికి ప్రైవేటు క్లాసులు పెట్టి పాఠం క్షుణ్ణంగా చెప్పగల గురూజీ! అందుకే గోపాలం రాత్రిపూట సలహా అడగాలని వచ్చాడు.

చేతులు నొప్పులు పుట్టి మట్టి బెడ్డలు ఎరడం ఆవుచేసి ఒళ్లు విరుచుకున్నాడు గోపాలం. గవర్రాజు కిళ్ళీ కొట్టు దగ్గర జనం పంచబడ్డారు. ఒకటీ అరా ఉన్నా ఫర్వాలేదనుకుని, మెల్లగా కొట్టువైపు నడక సాగించాడు. 'ఏమోయ్, గోపాలం. ఇంటర్వ్యూ ఏమైందీ?' నవ్వుతూ అడిగి ఒకవక్క పొడి పొట్లం అందించాడు గవర్రాజు.

'ఏముందీ—మామూలే!' బదులు నవ్వుతూ పొట్లం అందుకున్నాడు.

'నాకు తెలుసులే!' బైదిబై...మీ...సారీ రంగనాయకమ్మ ఏం చేస్తున్నారు?"

'చేయడానికి ఏముందీ? నాకేదైనా ఉద్యోగం దొరకాలి కదా?' అరచేతిలో వక్కపొడి రాల్చుకుంటూ అన్నాడు.

'ఈ లోపులో అమ్మాయిలకి పెళ్ళయి అత్తారింటికి వెళ్ళి పోతారు. ఆ తర్వాత మీ అమ్మగారికి నచ్చిన పిల్లని చేసుకుందువు గాని."

'రేయ్, గవర్రాజూ?' గోపాలం కోపంగా పిప్పరమెంట్ల డబ్బా మీద గుద్దాడు.

'ఎందుకొచ్చిన కోపం? పనికిరాక పోయాక కోపం కూడా చెత్త కుండీలో కాగితం ముక్క విలువ చేయదోయ్?!' గవర్రాజు సీసా మూత సరిచేసుకుంటూ గోపాలాన్ని ఓరగా చూశాడు.

గోపాలం గవర్రాజుని చురుగ్గా చూసి, అటు తిరిగి బట్టల దుకాణంలో తగ్గిపోతున్న పెట్రొమాక్స్ లైట్ కాంతిని, ఆ కాంతిలో మెరవలేక వెలవెలపోతున్న బట్టల దొంతర్లని చూస్తూ నిలబడి పోయాడు.

'ఈ గవర్రాజుగాడు ఎంత షైనై పోతున్నాడు! చదువుకునే రోజుల్లో కాపీ కొట్టడానికి వీలు చిక్కకపోతే గిలగిల తన్నుకునేవాడు చదువు రాని చవటలా తిరిగి, ఈనాడు నాకే (బి. ఎ., టైప్ అండ్ హార్ట్ హాండ్) పాఠాలు చెప్పేస్తున్నాడు! ఒళ్ళు మండిపోతున్నా ఏదైనా బోడి సలహా ఇవ్వకపోతాడా' అని నా తాపత్రయం.'

'ఏమిటోయ్ ఆలోచన? ఆ దుకాణంలో ఏదైనా నౌకరీ ఇప్పించమంటావా! ఆ ఓనర్ నాకు తెలుసులే!" భుజం మీద తట్టి నవ్వుతూ అడిగాడు.

గోపాలం హృదయం భగ్గుమన్నది. కానీ, దాని వెనకాల రంగనాయకి రూపం "తళుక్' మన్నది. అందుకని ఏ ఉద్యోగం అయినా సరే ఒప్పేసుకోవా లనుకున్నాడు.

'చూడు గోపాలం, నాకు తెలుసునోయ్! చూస్తూ చూస్తూ బట్టల కొట్లో, హోటల్లో నువ్వు చేయకూడదులే. కానీ, నీకు ఏదో

ఒకటి రెండు రోజుల్లో ఆ అమ్మాయిగారిని మీ అమ్మని మంచి చేసుకోమని చెప్పు. మీ అమ్మగారు కనక ఆ అమ్మాయిని మెచ్చిందా-నీకు ఉద్యోగం తొందరలేదు. ఆ అమ్మాయికి పెళ్ళి సంబంధాల గొడవ లేదు. ఆ తరవాత మీ రిద్దరు—ఇన్ ఎడ్వాన్స్‌గా డ్యూయెట్లు, సినిమాలు, పార్కు షికార్లు ఫూమ్ అంటూ సాగించవచ్చును. చిన్న నవరణ—మీ ఇద్దరి మధ్య మీ తమ్ముళ్ళు, వాళ్ళ చెల్లాయిలు—ఒకరో ఇద్దరో తప్పదనుకో. తరవాత నీ పాకెట్ మనీ, నా దగ్గర అప్పు తీసుకుందువు కాని వడ్డీ లేకుండా" అని చిన్నగా కన్ను గీటాడు గవర్రాజు

గోపాలం మనసు గిలిగింతలు పెట్టినట్టు పులకించింది.

రంగనాయకికి అలా చెప్పాలని ఆరాట పడ్డాడు.

*　　　　*　　　　*

వారం రోజుల తరవాత ఒకరోజు సాయంకాలం—ఆ రోజు వరదాచార్యులుగారు, చూడామణెమ్మగారు బజారుకెళ్ళిన సందర్భంలో రంగనాయకి వంట ప్రయత్నంలో ఉంది.

ఎన్నాళ్ళనుంచో చూస్తున్న అవకాశం—చేతికి అందివచ్చినట్లయింది మీనాక్షమ్మకి! భర్త శివశంకరంగారిని బయటికి షికారుకెళ్ళకుండా ఆపుచేసి చకచక వంటింటి పనులు పూర్తి చేసుకుని, వరండాలో చాప వేసి, కుర్చీ వేసి భర్తని కూర్చోపెట్టి, తను పక్కను కూర్చుంది.

వరండాలో తమకున్న సమాన హక్కు నద్వినియోగం చేసుకున్న గర్వం ఆమె ముఖం నిండా అలుముకున్నది. తమలపాకుల ఈనెలు తీసి చిలకలుచుట్టి ఇవ్వాలనిఉన్నా, అది సాయంత్రం సమయం కనక ఆ కోరిక స్థానే బత్తాయిపండు వలిచి తొనలుతీసి, ఒక్కొక్కటే అందిస్తూంది.

శివశంకరంగారికి అసలు బత్తాయి తొనలు ఇష్టంలేదు. పళ్ళ సందున పిప్పి ఇరుక్కుని పన్ను సలుపుతుందని ఆయన బాధ కాని, మీనాక్షమ్మ నంజుకుంటే ఆ సలుపే నయమనుకుని కిక్కురుమన కుండా తింటున్నారు. మనసు మాత్రం బయట పార్కులో ఉంది. అదేమి గమనించని మీనాక్షమ్మ తెగ సంబరపడిపోతూ, 'చూడండి-- ఆ గోడల నిండా ఎలా వస్త్రం మరకలు పూశారో? అబ్బే! అడివి మనుష్యులు! ఒక్క పిసరు అంటచంటాలు ఎరగరు! ఎంచక్కా మనం ఉన్న రెండు నెలలు ఈ పరిసరాలా ఎలా కలకలలాడిపోయేదో! వాకిలంతా కళ్లాపి చల్లి ఎలా ముగ్గులు పెట్టేదాన్ని! అందుకే అంటారు పొరుగు మంచివాళ్ళు కావాలని. అయినా, మన గోపాలానికి ఉద్యోగం దొరి కిందంటే ఘనంగా పైన ఇల్లు చూసుకుని చక్కా పోతాం. ఈ వెధవ పొత్తు మనకెందుకు చెప్పండి!'

శివశంకరంగారికి అసలు సాయంత్రంపూట ఇంట్లో కూర్చుం టేనే చికాకుగా ఉంది. ఆపైన బత్తాయి తొనలు తినడం అతికష్టంగా ఉంది. ఇంకా అది సరిపోనట్టు పక్క వాళ్ళమీద నేరాలు, ఇంకా ఉద్యోగంమీద కలలు వింటుంటే ఆయనకి ఒళ్ళు మండి పోతూంది.

రంగనాయకి వంటింట్లో వెలిగించిన స్టవ్వూ మండిపోతూంది. పత్తులు పెద్దవి! రంగనాయకి వాటిని తగ్గించే ప్రయత్నం చేయలేదు. అసలు ఆ అమ్మాయి దృష్టి దానిమీద లేదు. మీనాక్షమ్మ మాటలు చెవుల్లో దూసుకుపోతున్నాయి.

'వెధవ పొత్తుట!? మంచి పొరుగు కాదుట?! గోపాలం వాళ్ళ మ్మని మంచి చేసుకోమన్నాడు కనక నిగ్రహించుకుంటూంది. కాని అంతరంగంలో నుంచి ఎగదన్నుకొస్తున్న కోపం ఆపుకోవడం మహా కష్టంగా ఉంది. ఇంకొక్క మాట దొరిందా? చూస్తాను' అనుకున్నది రంగనాయకి.

బత్తాయి తొనల పిప్పిని గోరుతో తీసుకోలేక అప్పటివరకు

మింగి విసుగెత్తి, 'ఇంకోటి ఇస్తే చెపుతాను' అనుకున్నారు శివశంకర శాస్త్రిగారు.

ఎన్నాళ్ళనుంచో ఎదురుచూచిన అవకాశం ఈనాటికి దొరికింది గదా అన్న సంతోషంలో మీనాక్షమ్మకి ఒళ్ళు తెలియటంలేదు. ఆ స్థితిలో ఆవిడ భర్త చిరాకునుగాని, కోపాన్ని గాని గమనించేటట్టు లేదు.

మరొక రెండు తొనలు వలిచి అందిస్తూ, ''అన్నట్టు విన్నారా? మొన్న వచ్చిన సంబంధం కూడా తప్పిపోయిందట ఆ పిల్లకి! పోదు మరీ? అంత పొగరా? అంత విర్రవీగడమా? అయినా, ఆ తండ్రి ఏమి కట్నం ఇచ్చుకోగలడండీ?" అని మీనాక్షమ్మ చెప్పుకుంటూ పోతూనే ఉంది.

రంగనాయకి సహనం హద్దులు దాటిపోయింది!

రివ్వున లేచి దూసుకు వస్తూంది వరండాలోకి!

శివశంకరశాస్త్రిగారి పన్ను కలుక్కు మన్నది!

ఒక్క ఊపున కుర్చీలో నుంచి లేచి నించున్నారు.

గుమ్మంలో రంగనాయకి వీర రుద్రమ దేవిలా నించుంది.

''చూడండి—నా పెళ్ళి సంబంధం తప్పిపోతే మీకేం ఎస్టేటులు కలిసి రాలేదు, మా నాన్న కట్నం ఇవ్వలేకపోతే కట్నం అక్కర్లేని వాడే దొరుకుతాడు. ఇప్పుడు నేను పెళ్ళికోసం గంగవెర్రులెత్తి పోవడము లేదు గాని, ఇకమీద నా విషయం అనవసరంగా ఎత్తారంటే-- తప్పకుండా గంగవెర్రులే ఎత్తుతాయి! అది సరే-- ఇంత పెద్దవారు కదా, మీ కెందుకంత వెర్రి? ఈ సాయంత్రం పూట ఇలా నలుగురు నడిచే వరండాలో ఈ సరదాలు, ముచ్చట్లు ఏమిటీ? పోనీ అంత మనసు ఉంటే గప్‌చిప్‌గా కూర్చొని గోడలమీద మరకల్ని విమర్శించటం, పొరుగుని గురించి ఆడిపోసుకోవడం దేనికి? మీకు మరొక

ముచ్చటైన మాటే దొరకలేదా? మా ఇటావైపు పూసుకున్న మరకలు మీకు అసహ్యంగా ఉన్నాయా? మరి మీ రిప్పుడు విసిరిన ఆ బత్తాయి తొక్కలు, ఆ సిగరెట్ బూడిద ఎంత వికారంగా ఉన్నాయో చూశారా? మీరు బస్తీ మనుష్యులు మేము అడివి మనుష్యులమా? తెలియటం లేదూ? ఎవరి సంస్కారం ఎంతటిదో? ఎప్పుడూ ఏదో ఒక వంక దొరుకుతుందా అని చూడటమే గాని. మీ పని మీరు చూసుకోవడం లేదన్న మాట?'

రంగనాయకి చులువులకి నిర్ఘాంత పడిపోయి లేచి నించుంది మీనాక్షమ్మ. అంతకు ముందే నించున్న శివశంకర శాస్త్రిగారు తాను ఏదో అనే లోపులేవచ్చిన ఉప్పెనని వింతగా వింటూ ఉండిపోయారు

ఇంతలో బయటికివెళ్ళి వరదాచార్యులుగారు, చూడామణెమ్మ గేటు తీసుకుని వస్తుంటే రంగనాయకి లోపలికి చక్కా పోయింది.

మీనాక్షమ్మ తేరుకునేలోపల శివశంకర శాస్త్రిగారు కుర్చీ ఎత్తి లోపలికి పట్టుకెళ్ళిపోయారు. ఆ తరవాత మీనాక్షమ్మ చాప చుట్టి విసురుగా ఇంట్లోకి వచ్చేసి దిః పోయిగా శివశంకర శాస్త్రిగారు చెప్పులు వేసుకుని పార్కు కెళ్ళిపోయారు.

ఇంట్లోకి వచ్చిన చూడామణెమ్మ రంగనాయకిని--'ఏమైనా గొడవ జరిగిందా? ఆవిడ ముఖం అలా ఉందేమిటీ?' అని చిన్నగా అడిగింది,

'మామూలేలే' అని నవ్వేసింది రంగనాయకి.

కాని, రంగనాయకి ఆ రాత్రంతా బాధ పడింది--గోపాలం చెప్పిన మాటకి కట్టుబడి ఉండలేకపోయానే? అని.

ఆ తరవాత రంగనాయకికి మరొక రెండు పెళ్ళిచూపులు,

గోపాలానికి రెండు మూడు ఇంటర్వ్యూలు వెక్కిరించి వెళ్ళిపోయాయి కాని, మీనాక్షమ్మకి, వరదాచార్యులుగారికి రెండు జగడాల నిరాఘాటంగా సాగి, ఇంకా సాగుతూ ఉన్నాయి.

*　　　　*　　　　*

ఆ రోజు శుక్రవారం,

రంగనాయకి అభ్యంగస్నానం కోసం దిట్టంగా కట్టెలుపెట్టి పొయ్యి అంటించి నీళ్ళకాగు పడేసింది.

ఎర్రని మంటతో చెట్టాపట్టాలు వేసుకుని తెల్లనిపొగ ఎంచక్కా డాన్సుచేస్తూ, రెండిళ్ళకి మధ్య కట్టిన తడికను లెక్కపెట్టకుండా, అవతల భాగంలో కూడా స్వేచ్ఛావిహారం చేసింది. దానితో మీనాక్షమ్మ వంటిల్లు వదిలి ఇవతలికి వచ్చి ఎర్రగా, గుర్రుగా చూసి, నాలుగు చెణుకులు విసిరింది, తడికవతలవాళ్ళకి వినిపించేలాగ.

రంగనాయకి పెరటిలోకి వచ్చి ఫెళ్ళున నవ్వింది.

అంతలో గోపాలం టర్కీటవెల్ చుట్టుకుని స్నానార్థం వంపు దగ్గరకి వచ్చాడు. తల్లి చూడకుండా రంగనాయకికి కనుసైగ చేశాడు 'ప్లీజ్। ఆవిడతో కయ్యం పెట్టుకో'వద్దని,

కాని, రంగనాయకి చిలిపిగా చూసి నాలుక ఆడించి, కను రెప్పలు అలవోకగా మూసి తెరిచి, తలకొద్దిగా విసిరింది--ఏం ఫర్వా లేదన్నట్టుగా అర్థం చేస్తూ. అదీగాక తనకి వచ్చే సంబంధాలు ఎటూ తప్పిపోతూనే వున్నాయి. గోపాలానికీ ఉద్యోగం రావటంలేదు. వస్తే ఇక ఏ బాధా లేనేలేదు. అందుకని మీనాక్షమ్మ అరుపులకి రంగనాయకి వెనక్కి తగ్గాలనుకోలేదు,

''చూడండి! మీనాక్షమ్మగారూ! నన్ను కట్టి పడేయడం ఇంత వరకు ఎవరూ కనుక్కోలేదండి! పోనీ, చావగొట్టి చెవులు మూద్దా

మన్నా-వెధవది అందకుండా పోతోంది నేను మీకు దొరికితే కట్టిపడేసి మీ ఇంట్లో దూళ్ళ కర్రతో చావగొట్టండి' అంది.

మీనాక్షమ్మకి ఒళ్ళు కుతకుతలాడి పోయింది.

'చెప్తాగా? చెప్తా నుండు నీ పొగరు నీ సంగతీని!' అంటూ దభాలున అక్కడున్న నీళ్ళ బక్కెట్టుఎత్తి పక్కరాయిమీద నిలుచుండి తడికె మీదనుండి గభీమని నీళ్ళపొయ్యిమీద దిమ్మరించింది! పొయ్యి 'చుంయ్' మని ఆరిపోయింది.

వరదాచార్యులుగారు రంగంలోకి ప్రవేశించేరు.

మీనాక్షమ్మ వాటాలోనుంచి తమ వాటాలోకి రాబోతున్న అనపకాయని కత్తిపీట పెట్టి 'సర్రు' మని తెగ్గోశారు! మీనాక్షమ్మ వెంటనే రంగనాయకి కొత్తగా పెంచిన జాజితీగ తమ వాటాలోకి పాకినంత మేరకు వెళ్ళి కొమ్మ లుంచేసింది.

వరదాచార్యులు-రంగనాయకి ఊరుకోకుండా మీనాక్షమ్మ వాళ్ళ వాటాలోకి ఊడిపోతున్న పంచను దోపుకుంటు వెళ్ళి వాళ్ళ మెంతినారంతా కాళ్ళతో తొక్కేశారు.

వరండాలోనుంచి చూడామణెమ్మ-వంటింట్లోనుంచి శివశంకర శాస్త్రిగారు కంగారుగా పరిగెత్తుకొచ్చారు.

మాటా మాటా పెరిగింది. ఉన్నవన్నీ సమూలంగా పీకలేక పోయారు. చేతనైనంతవరకు ధ్వంసం చేసుకున్నారు. తిట్టుకున్నారు- హోరాహోరీ పోట్లాడుకున్నారు. ఇరుపక్షాలవార్ని ఇరుగు పొరుగువారు గోడలెక్కి-చెట్లెక్కి కొందరు గేటు తీసుకుని వచ్చి కళ్ళారా చెవులారా విని--చూసి ఆనందించేరు. బొమ్మల్లా నిలబడిపోయిన రంగనాయకి, గోపాలం ఉలిక్కిపడి చుట్టుపట్ల అందర్ని చూశాక సిగ్గుపడిపోయారు. ఆ తరవాత అనుమానం ముంచుకొచ్చి, ఆయిన వాళ్ళమీద కోపంకి పొంగిపోయింది.

గోపాలం తల్లి చెయ్యి పుచ్చుకున్నాడు. రంగనాయకి వరదాచార్యులుగారి రెక్క పట్టుకుని ఇంట్లోకి లాక్కెళ్ళింది.

ఎక్కడి వాళ్ళక్కడికి మెల్ల మెల్లగా వెళ్ళిపోయారు. వాతావరణమంతా నిశ్శబ్దంగా నిలిచిపోయింది!

ఆ మరునాడు...

రంగనాయకి, గోపాలం చెరొక రిక్షాలో ఆస్పత్రి గేటులో దిగారు. ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకుని బాధగా నవ్వుకున్నారు.

ఎదురుగుండా వరండాలో బుజానికి ఫ్లాస్కు తగిలించుకుని శివశంకరశాస్త్రిగారూ, పాల మరచెంబు పట్టుకుని చూడామణెమ్మ నిలుచుని ఉన్నారు.

చూడామణెమ్మ కొంచెం వణుకుతున్న స్వరంలో--'అన్నయ్యగారూ! ఏమిటో మా వారికి తొందరెక్కువ! అనవసరంగా పోట్లాట పెంచారు. వదినగారు కోపగించుకున్నారు. పాపం! కోపంలో స్టవ్ నిర్లక్ష్యంగా అంటించేసరికి ఇళ్ళు అంటుకుంటెట కదూ? ఎలా ఉంది ఇప్పుడు ప్రమాదమేమి లేదు గదా?' అని అడిగింది.

'చెల్లెమ్మా! తప్పు మీ వారిది కాదమ్మా. మా ఆవిడకి దురుసు ఎక్కువ. మామూలు విషయానికి అంత రాద్ధాంతం చేస్తుందా' పాపం బావగారు పెద్దవారు! కోపంలో కంట్రోలు తప్పిపోయారు. హై బ్లడ్ ప్రెషర్ వచ్చిందిట కదూ! ఇప్పుడు ఫర్వాలేదన్నారా? ఏమిటో నిన్నటి నుంచి ఇంటి ఆవరణలో ఆయన తిరగకపోతే ఎలాగో ఉంది సుమా'" అంటూంటే ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

'మాకు మాత్రం! వదినగారు పెరట్లో కనిపించకపోతే ఏంత

చిన్నబోయిందో! మాకేం తోచటం లేదండీ!" చూడామణెమ్మ కంఠం నిండా బాధ సుళ్ళు తిరిగింది.

వరండా మెట్లు ఎక్కి వస్తున్న రంగనాయకి, గోపాలం మరొక సారి ముఖాలు చూసుకున్నారు.

శివశంకరశాస్త్రిగారు అన్నారు. "చూడు, తల్లీ! మా ఆవిడకి దురుసుతనం ఉందిగాని, అంతకుమించి మరే ద్వేషంలేదు. నిన్నరాత్రి బెడ్‌మీద పడుకుని మాటిమాటికి బావగారిని తలుచుకుని పాపం, ఎలా ఉన్నారో అని చింతిస్తూనే ఉంది.''

చూడామణెమ్మ కళ్ళు టపటపలాడించి చెప్పింది: 'నిజం!? అన్నగారూ, సరిగా మా వారూ అంతే! ఏం మనిషో! తొందరన్నమాటే గానీ, మళ్లీ ఎంత పరితాపమో! రాత్రి సరిగా ఆయనా అలాగే విచారించారు--వదినగారికి ఆరోగ్యం ఎప్పుడు బాగుపడుతుందా అని '

తక్కున రంగనాయకి దగ్గరికి జరిగి వచ్చాడు గోపాలం.

'విన్నారా! మా నాన్న, మీ అమ్మ ఏమంటున్నారో వెరీ! గుడ్ న్యూస్!'

'అదే అనుకుంటున్నాను. సమస్య పరిష్కారమైనట్టుంది, ఏమంటారు.' కళ్ళు వింతగా మెరుస్తుంటే అడిగింది.

'కాదూ మరీ. ఇంకా సంశయిమా! ఎంత చక్కని ఉషోదయంలో--అహా! చల్లని మంచు బిందువులు పడ్డట్టు అనిపిస్తుంది' అంటూ మరికాస్త దగ్గరికి జరిగి, 'డియర్ రంగా! ఇంక మనం హాయిగా జీవితం అనుభవించేయ వచ్చును' అన్నాడు గోపాలం.

రంగనాయకి నవ్వి 'అబ్బా, ఆశ! మీ అమ్మ బెడ్ దిగేసరికి మళ్ళీ ఏం బుద్ధి మారిపోతుందో.' అన్నది.

'అయితే, సాయంత్రమే మనం దండలు మార్చేసుకుందాం' అని నవ్వాడు.

శివశంకరశాస్త్రిగారు వాళ్ళని చూసి, 'ఏమిట్రా రహస్యాలూ రండి రండి.మాకు కూడా చెప్పండి. అమ్మాయ్, అన్నట్టు మీఅత్తమ్మ నిన్ను చూడాలనుకుంటోంది. రా వెళదాం' అన్నారు

రంగనాయకి బుగ్గలు ఎరుపెక్కేసరికి, గోపాలం కళ్ళు చిలిపిగా నవ్వాయి.



# ముత్యపు చిప్పలు

(విజయ మాసపత్రిక ప్రారంభంలో...ఎన్నుకున్న కథల్లో నెగ్గి—విజయలో ప్రచురితమైనది!)

అప్పటివారకా వీచిన హోరుగాలి ఆగిపోయి, సన్నగా చిన్నగా చినుకులు పడటం మొదలైంది.

రైల్వే ప్లాట్‌ఫారం అంతా జనం త్రొక్కిసలాడుతూ....నానా గందరగోళంగా వుంది. మరొక పావుగంటలో వర్షం పెద్దదైంది.

ఆ రోజు రైలు గంటన్నర లేటు.

కామేశ్వర్రావుగారు..అసహనంగా రెండు మూడుసార్లు చేతిలో గొడుగును అటూ ఇటూ మార్చుకుని 'ఇంతకీ ఈ ఉమాపతి ఎందుకు వచ్చినట్టు?" అన్నారు తన నమ్మిన బంటులాంటి భీమరాజుతో..

బీడీ ఆఖరిదమ్ము గట్టిగా పీల్చి క్రిందపడేసి చెప్పుతో నొక్కి... "ఇలాంటి వాళ్ళంతా ఎందుకొస్తారు? అందని ద్రాక్ష పళ్ళకోసం! ఆ తరువాత ఎదుటివాడి బాగు చూసి ఓర్చలేక!—'అన్నాడు. పది గజాల దూరంలో రైన్‌కోటు వేసుకుని దర్జాగానించొని...సిగరెట్టు తాగుతున్న ఉమాపతిని చూస్తూ—

'అంతేనంటావా? అసలు వాడికెలా తెల్సుంటుందీ సంగతి।" కామేశ్వర్రావుగారు గొడుగు భుజానికి తగిలించుకుంటూ అడిగేరు.

'ఏదో మామయ్యేగదా అని వారికి ఓ కార్డుముక్క రాసి పడేసి ఉంటారు మీ అల్లుడుగారు అందుకని గంతులు వేసుకుంటూ పరిగెత్తుకొచ్చినట్టున్నారు. స్టేషన్‌కి...' అని పలచగా వ్యంగ్యంగా ఓ నవ్వు నవ్వేడు!

కామేశ్వర్రావు నవ్వలేదు।

అతనికి లోపల అసంతృప్తిగా ఉంది! నిజంగా అతనికి కూడా కార్డు వ్రాసేఉంటాడా? అలా రాయకుండా ఉండి...ఈ ఉమాపతి మరెందుకో ఏవరి కోసమో...వచ్చిఉండవచ్చును. అలా జరిగితే బాగుండును। అనుకున్నాడు.

ఆ ఉమాపతి కామేశ్వర్రావుకి రక్తం పంచుకు పుట్టిన తమ్ముడు.

అయితే ఇద్దరికీ మధ్య పచ్చగడ్డి వేస్తే 'భగ్గు' మంటుంది—

ఆస్తి పంచుకునేటప్పుడు భేదాభిప్రాయాలు వచ్చి...పీకలు పిసుక్కునే వరకు వచ్చారు ..సరిగ్గా అప్పుడే పెద్దక్కగారు వెంకటలక్ష్మి అర్థాంతరంగా విధవరాలై...నెలల పసిగుడ్డుతో తమ్ముళ్ళింటికి వచ్చింది। అప్పటికే పెళ్ళికావల్సిన చెల్లెలు...తల్లి ఉన్నారు ఇంట్లో.

ఇదంతా బాగా ఆలోచించుకుని, ఆ బాధ్యతలు...అన్నగార్కే వదిలేసి...తన బి.ఇ. డిగ్రీతో బయట పడ్డాడు ఉమాపతి.

ఈనాడు ఉమాపతిగారు పెద్ద పలుకుబడిగల ఉద్యోగి! మేడా, కారులాంటి ఆధునిక హంగులన్నీ అమర్చుకున్నారు.

కామేశ్వర్రావుగారు కూడా తక్కువ తినలేదు! అక్కగారి ఎకరమున్నర పొలం తనతో కలిపేసుకుని...చెల్లెలికి పెళ్ళి చేసి

పంపించేసి. .అమ్మ పైలోకాల కెళ్ళిపోగానే అక్కని వంటలక్కగా చూస్తూ...భార్యాపిల్లల్ని వట్టువరుప్పుల మీదే నడిపిస్తున్నాడు!

వర్షపు ధారలు వెండితీగల్లా...నింగినించి తెగి పడుతున్న జల తారు పోగుల్లా కన్పిస్తున్నాయి దీపాల కాంతిలో! పెద్ద చప్పుడుతో ఉరిమింది పిల్లలు పెద్దలు ముసుకుసేలాగా, అరగంట దాటిన వర్షం ధాటీ తగ్గలేదు!

'ఈ వర్షంలో రైలు సరిగా వస్తుందా?' అని అందరికీ అను మానమే! ఆ రైలు చిదాప్పట్టేషన్లు వె క స్పీడు తగ్గించుకుని మెల్లగా వస్తోంది. కంపార్టుమెంటులో కిటికీ దగ్గర అద్దం తలుపు పక్కన... వెచ్చని స్వెట్టర్‌లో మరీ వెచ్చని కోరికలతో, ఆలోచనలతో తల మునకలవుతున్నాడు ప్రసాద్! పాతిక సంవత్సరాలక్రితం-నెలల పసి గుడ్డుగా, అమ్మతో కలసి పెద్ద మామయ్య ఇంటిలో కాలు పెట్టేడు! ఎస్. ఎస్. సి చదువుతో ఆపేసి. 'హైద్రాబాదులో ఉన్న చిన్న మామయ్య దగ్గరికి వెళ్ళి ఏదైనా ఉద్యోగము చూసుకుని అమ్మని పోషించుకో' అని సలహా ఇచ్చేసు పెద్దమామయ్య! సబబుగానే తోచింది! ఆ తరువాత చెప్పిన మాటకే ఒళ్ళు మండిపోయింది! ఈ నాటికీ మండిస్తూనే ఉన్నాయి ఆ మాటలు.

'ఓరే ప్రసాద్-రాధ మీద ఆశ పెట్టుకోకు. చిన్నప్పట్నుంచి పెరిగినంత మాత్రాన మేనరికాలు చేసుకు తీరాలనే రూలేమీ లేదు! పైవాళ్ళైతే ఓ ముద్దు ముచ్చట!! ఇంట్లో ఏం భోగము పేరుస్తుందీ'?

ఆ మాటలన్న వెంటనే ఈడ్చి లెంపకాయ కొట్టాలనిపించింది! కానీ తనకప్పుడు వయస్సు స్తోమత లేవు! అవి సంపాదించుకుని ఈనాడు మామయ్య లిద్దరికీ కార్డు ముక్కలు రాసి పడేసేడు! ఇప్పుడు వాళ్ళ బుద్ధులు, ముఖాలు ఎలా ఉంటాయో! ప్రసాదు ఆలోచనలకి అంతులేదు.

స్టేషన్‌లో ఉమాపతిగారు సిగరెట్ పెట్టి ఖాళీ చేసి మరొకటి కొనుక్కునేందుకు...స్టాల్ వైపు నడిచారు.

'హల్లో! ఉమాపతి! ఏమిటిలా వచ్చావ్?'—సదానందంగారు పలకరించారు వాళ్ళిద్దరూ ఎన్నాళ్ళుగానో, ఎన్నో విషయాల్లో మిత్రులు!

ఉమాపతిగారు ఆశ్చర్యంగా చూసి, 'నువ్వేమిటిలా వచ్చావ్?' అనడిగేరు.

'మన సంగతి తెలుసుగా నీకు! మన పని జరగాల్సి ఉందని ఒకరిని 'కాకా' పట్టి పంపించేస్తే! ఇలా స్టేషన్‌లో వాన తగ్గేవరకు ఆగేను. మరి నీ సంగతో!''

'ఉందిలే!' అని గర్వంగా నవ్వి, ఓ సిగరెట్ ప్యాకెట్ కొని తనొకటి తీసుకొని, అతని కోటి ఆఫర్ చేసి, సిగరెట్ వెనకవైపు, పెట్టె మీద కొడ్తూ. 'ఇప్పుడు రాబోయే రైల్లో ప్రసాద్ వస్తున్నాడు అన్నాడు తల కొద్దిగా వంకిస్తూ.

''ప్రసాదా? మీ మేనల్లుడు గాడేనా? అయితే వాడి కోసం నువ్వు ఈ వానలో ఎదురు చూడాల్సిన ప్రత్యేకత ఏమిటోయ్?!'' అంటూ తెగ ఆశ్చర్యపోయారు.

''ఊఁ ఉంది మరీ! ఆ ప్రత్యేకత ఈనాడు ప్రసాదుకి ఇవ్వాలి. ఇప్పుడు ప్రసాదు ఎవరో తెలుసా? బొంబేలో ఓ పెద్ద కంపెనీలో జనరల్ మేనేజర్‌గారికి పర్సనల్ సెక్రటరీ!! మనిషి ఎంత ఎత్తుకు పెరిగేడో, ఎంత పలుకుబడో తెలుసా?!'' సిగరెట్ పెదాల మధ్య బిగించి, లైటర్‌తో వెలిగించారు.

''ఐసీ!? అయితే ఇప్పుడు ప్రసాదుగారు నీకాబోయే అల్లుడు! అంతేనా?'' అని అర్థవంతంగా నవ్విన సదానందంగారితో శ్రుతి కలిపేరు ఉమాపతిగారు.

''కాని ఓ అష్టపుల్ల పానకంలో పుతకలాగనుకో! అక్కడటు వైపు చూస్తూ, మా బ్రదర్! తన అసిస్టెంట్‌తో సహా కావలా కాస్తున్నాడు ప్రసాదు కోసం! ఈ రాత్రి వాడిం తీసుకుపోతాడు కాబోలు'' అన్నారు పొగవదులుతూ.

''ఓ! ఆయన కూడా వచ్చాడా? అయినా అసలు ఈ సంగతి ఆయనకీ నీకూ ఎలా తెలిసింది?''

''ప్రసాద్ స్వయంగా నాకు రాసేడోయ్! సరే వాళ్ళమ్మకి కూడా రాసుంటాడు కనుక, మా బ్రదర్‌కి తెలిసి ఇప్పుడు బండిమీదో బస్సు మీదో వచ్చేడన్న మాట!''

అంతే మరి! అయినా ప్రసాద్ నీకు స్వయంగా రాసేడంటే' ఇప్పుడు మీ ఇంటికే వస్తాడు! అనవసరంగా మీ బ్రదర్ శ్రమపడు తున్నాడు!" అన్న సదానందంగారి మాటకి ఉమాపతిగారు కొండంత ధైర్యం తెచ్చుకున్నారు! మిత్రులిద్దరు బాతాఖానీలో పడ్డారు.

*　　　　*　　　　*

రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది. ప్రసాదు అద్దం పైకెత్తి వర్షం తగ్గిందో లేదో చూసేడు! -చాలా వరకు తగ్గింది. ఎదురుగా వున్న టీస్టాల్ వైపు చూసేడు... కెటిల్‌లో నుంచి పొగలు క్రక్కుతున్న టీ చల్లారుస్తున్నాడు ఓ కుర్రాడు. పొట్టనిక్కరు-చిరుగుల పాతకోటు-అదీ మోకాళ్ళవరకు వుంది... అన్నీ చిరుగులే. .చలిలో వాడు అందరికీ టీలు అందిస్తూ తిరుగుతూవుంటే... దుకాణంలో నిప్పుల కుంపటి ఎదురుగా రగ్గు కప్పుకుని, తలపాగా చుట్టుకుని.. ఓ భారీ విగ్రహం ఉంది వాడు ఈ కుర్రాడికి ఏమైనా ఉంటాడు.—

ఏ మేనమామో అయ్యుంటాడు? వెర్రి వెధవ! ఆ మామ చేతిలో నానా కష్టాలు పడుతున్నాడుకాబోలు! ఫర్వాలేదురా అబ్బాయ్!

మంచిరోజులు వస్తాయి. అప్పుడు మీ మామకి నీ తడాఖా చూపుదు గానిలే అని మనసులోనే దీవించాడు.

'ప్లీజ్. మీరు కొంచెం ఆ సీటు మా కిస్తారా,'--ఎదుటి సీట్లో ఉన్న యువకుడు అర్థింపుగా చూసేడు--

ప్రసాద్ ఆ యువకుడి ప్రక్కన్నే వున్న యువతిని చూసేడు. కొత్తగా పెళ్ళైంది కాబోలు. ఇందాకట్నుంచీ తెగ కబుర్లు చెప్పుకుని చుట్టుపట్ల వున్న జనాన్ని మరిచిపోయి. బోలెడు సంబరంలో మునిగి పోయేడు. పాపం, ఎంతసేపని కబుర్లు చెప్పుకోగలరు -?

అందుకని ఇక కిటికీ కావల్సి వచ్చిందేమో అనుకుని జాలిపడి కనీసం రేపు తనకిపెళ్ళై ఇలాంటి ఇబ్బంది ఎదుర్కుంటే తోటివారి సానుభూతి కావల్సివస్తుందిగదా అని భావించి చిన్నగా నవ్వుకుని 'ఆల్‌రైట్. కూర్చోండి' అని లేచాడు. 'థాంక్స్. ఇందాకట్నుంచీ అడిగితే మీరేమనుకుంటారో అని వూరుకున్నాను. మా లీలకి కిటికీ దగ్గర కూర్చోడం చాలా ఇష్టం.' అని ఆ యువకుడు కృతజ్ఞతలు చెప్పాడు.

'లీలా? ఆవిడపేరు లీలా? డామిట్. అలా అని తెలిస్తే చచ్చినా ఇచ్చేవాణ్నికాను ఆ సీటు—కిటికీదగ్గర కూర్చోడం ఎవరికిష్టం ఉండదూ. ఇష్టంట, ఇష్టం.అనుకొని గబగబ అనుకోనంత అసహ్యం. కోపం తెచ్చుకున్నాడు--ఆ పేరు ఉమాపతి మామయ్య పెద్దకూతురికి వుంది. ఆ పేరు ఎవరికున్నా ప్రసాద్‌కి నచ్చదు.-

అర్జెంటుగా ఓ సిగరెట్ అంటించుకుని, అటుతిరిగి కూర్చున్నాడు.

పదేళ్ళక్రితం తను ఓ చిన్న ఉద్యోగము ఇప్పించమని హైదరాబాదు వెళ్ళాడు. ఉమాపతిగారు నవ్వి--'ఎలారా. ఎస్.ఎస్.సి తో ఏం

సంపాదించగలము..పెద్ద మావయ్య మీ పొలం అంతా కాజేసి నీకు హైస్కూలు చదువుతోటే స్వస్తి చెప్పాడా? కనీసము టైపు, షార్టు హాండ్ ప్యాసైతేగాని ఉద్యోగము దొరకదే.అయినా చూస్తాలే'అన్నాడు రెండు మూడు రోజులదాకా మళ్ళీ మాట్లాడనేలేదు. లీల, అత్తయ్య 'ప్రసాదనేవాడు' ఓ పనికుర్రాళ్ళా భావించి అలానే చూసేరు.అప్పటికి లీల పదేళ్ళదే అయినా, అనకూడనిమాటలు కూడా నిర్లక్ష్యంగా అనే సేది. అమ్మా వాడు డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంటే నేను అన్నం తిననేది. అత్తయ్య తనకి వేరే ఆకువేసి పెట్టేది.--పౌరుషం, అవ మానం అని పించినా ఉద్యోగము సంపాదించాలనే పట్టుదలకోసం భరించాడు. అమ్మని ఎలాగైనా తనే పోషించుకోవాలనే ఆరాటం, మామయ్యల పంచలో ఉండకూడదనే ఆక్రోషం-అవన్నీ మనసు నిండుగానిండి తలవంచుకొని భరించాడన్ని అవమానాలూ, కానీ ఓ రోజు...ఆరోజు తనువున్న పక్కరూమ్‌లో మామయ్య సదాన దం గారితో చెప్తున్నాడు. 'చూడు సదానందం! ఏదో ఓ చిన్న అటెండర్ ఉద్యోగం లాంటిది ఎక్కడైనా చూసి ఆ ప్రసాద్‌గాడ్ని చేర్పించు బొత్తిగా మా మేనల్లుడని చెప్పకుని ఆ చిన్న ఉద్యోగంకోసం ప్రయ త్నించం ఎలాగోయ్.-ఎవరో మనకి తెల్సిన వాళ్ళబ్బాయి అసహాయ స్థితిలో ఉన్నాడని చెప్పు' అంతే ఆ తరవాత మాటల్ని వినదల్చుకోక ఆ సాయంత్రమే చేతి సంచీ తీసుకుని 'మళ్ళీ వస్తాలే' అని తిన్నగా రైలెక్కి బొంబాయి చేరాడు.

ఎలా బ్రతకాలో, ఏంచేయాలో అంతా అయోమయం,ఏమైనా సరే ఉద్యోగం సంపాదించుకుని కానీ ఇల్లు చేరగూడదన్న పంతంవచ్చి ఐదేళ్ళు ఎన్నోరకాల ఉద్యోగాలు చేసి, టైపు నేర్చుకుని, షార్ట్‌హాండ్ ప్యాసై ప్రయివేటు కంపెనీలో ఉద్యోగము సంపాదించాడు. ప్రయి వేటుగా ఇంటర్, బి ఏ. పరీక్షలు ప్యాసయ్యాడు. మేనేజరుగారిక్ పర్స నల్ సెక్రటరీ కాగల్గేడు. ఇంకా అవుతాడు ఇల్లు, స్కూటర్ అన్నీ మేనేజర్‌గారిచ్చేరు. ఆయన తల్చుకుంటే ఇంకా ఏమైనా ఇస్తాడు.

దానికొ్కారణం వుంది.

మేనేజర్‌గారికి పిల్లల్లేరు-ఆయన ప్రసాదుని కొడుకులా చూసుకుంటున్నారు. ప్రసాద్‌లోని పట్టుదల . నీతి...నిజాయితీ తన కంపెనీకి చాలా అవసరము. అందుకని ప్రసాదు ఇప్పుడు చాలా ఎత్తుకు పెరిగిపోయాడు ..పదేళ్ళ తరవాత తల్లిని తీసుకెళ్ళిపోడానికి వస్తున్నాడు. నెలనెలా కొంత డబ్బు పంపించి, తన పదవి పెద్దదయే దాకా వివరాలేమీ రాయకుండా ఇంతకాలం రహస్యంగా దాచేడు. ఇప్పుడు అన్నీ విపులీకరిస్తూ మామయ్యలకి కార్డులు వ్రాసి పడేసేడు. ఆ ఉత్తరాలు చూసేక రాధ. లీల..ఎలా వుంటారో కళ్ళతో చూడాలి, చూసి అప్పుడు తన రేణూని గురించి చెప్పాలి--ప్రసాద్ ఊహలు, ఆలోచనలు సాగుతూండగానే రైలు సికింద్రాబాదు స్టేషన్‌లో ఆగింది

కామేశ్వర్రావుగారు,ఉమాపతిగారు కంగారుగా కంపార్టుమెంట్ల వెంబడి అసిస్టెంట్లతోసహా వెతకడము ప్రారంభించేరు.

సూటుకేస్ పట్టుకుని దిగిన ప్రసాదును మేనమామ లిద్దరూ 'ప్రసాద్, బాగున్నావా.' అని పలకరించేరు. అతికష్టం మీద పొల్చుకోగలిగారు.

ప్రసాద్ ఒక్క్షణం తెల్లబోయి తేరుకున్నాడు.

'మామయ్య లిద్దరూ స్టేషన్ కొచ్చారా. భేష్. భేష్."--అనుకున్నాడు.

'అరరే. మామయ్యా, ఆ పల్లెటూరినుంచి ఈ రాత్రి నాకోసం వచ్చావా,' అన్నాడు సూటుకేసు క్రిందపెట్టి. ఆ పెట్టె వెంటనే భీమరాజు పట్టుకున్నాడు. ప్రసాదు మనసులోనే నవ్వుకున్నాడు.

'అదేమిట్రా। నీకోసం రామా ఏమిటి? స్వయంగా నాకు ఉత్తరము రాశాక నా మనసు ఆపగలనా। ఈ పదేళ్ళనుంచీ మీ అమ్మని

ఓదార్చలేకపోతున్నా ననుకో! నేనే స్వయముగా అమ్మని బొంబాయి తీసుకురావలనుకున్నాను' అన్నాడు కామేశ్వర్రావుగారు,

'అలాగా!' అని 'ఏం చిన్న మామయ్యా బాగున్నారా? అనవసరంగా శ్రమ తీసుకుని నాకోసం స్టేషన్‌కొచ్చారా!' అని ఉమాపతిగార్ని పలకరించాడు. ఆయన వెంటనే భుజంచుట్టూ చేయివేసి దగ్గరగా తీసుకుని 'భలేవాడివే। మేనల్లుణ్ని చూడ్డానికి రానూ? నడు నడు ఇంటిదగ్గర పార్టీ అరేంజి చేసాను. అత్తయ్యా, లీలా వాళ్ళంతా ఎదురు చూస్తూంటారు' అన్నాడు. గబగబా ఎక్కడ అన్నగారు తీసుకెళ్ళిపోతాడో అని తన దగ్గరగా లాక్కుంటూ.

కామేశ్వర్రావుగారు చిరాకుగా, భరించలేనట్టుగా చూస్తూంటే అప్పటివరకు ప్రసాదు వేసుకున్న సూటు, బూటు, వాచ్, ఉంగరాల్ని పరీక్షిస్తున్న భీమరాజు 'బాబూ, ప్రసాదుగారూ। నేను భీమరాజుని, మీరు గుర్తుపట్టలేదనుకుంటాను. బయటకి పదండి, టాక్సీ ఎక్కి హోటల్ ద్వారకాకు పోదాం। మధ్యాహ్నమే రూమ్ బుక్‌చేసేరు మామయ్యగారు-' అన్నాడు,

'భీమరాజుగారూ। మిమ్మల్ని గుర్తుపట్టక పోయినా, ఆ పెట్టె పట్టుకోగానే మీరు తప్పకుండా భీమరాజుగారే అని అనుకున్నాను' అన్నాడు ప్రసాదు నవ్వుతూ. సదానందాన్ని కూడా పలకరించి... 'మీరు మా చిన్నమామయ్య తైపున వచ్చి వుంటారు. చాలాసంతోషం. కానీ మిమ్మల్ని కాదంటున్నందుకు విచారిస్తున్నాను. నేను ఈ రాత్రి హోటల్ బ్లూమూన్‌కి వెళ్ళాలి. మా బాస్ నాకొక అర్జెంటు పని వప్పగించారు. అది అక్కడ దిగే ఒక మిత్రుడితో సంప్రదించి, ఆ విషయాలన్నీ నేను వెంటనే బాస్‌కి ట్రంక్‌కాల్ చేయాలి. కనుక చిన్న మామయ్య కార్లో నన్ను బ్లూమూన్ దగ్గరా.. పెద్దమామయ్యను ద్వారకా హోటల్‌లోనూ దింపేస్తే... మెనీ మెనీ థాంక్స్। ఏమంటావ్ మామయ్యా' అని ప్రసాదు అడిగేసరికి. ఉమాపతిగార్కి వచ్చివెల

క్కాయ గొంతులో పడినట్లయింది అన్నగారికి తన కార్లో లిఫ్ట్ ఇవ్వాలి. పైగా ఈ ప్రసాదు ఇప్పుడు రాడు. అటు కామేశ్వర్రావు గారిక్కి అలాగేఉంది.

'తను తమ్ముడి కారెక్కటమా? అదీగాక ఈ ప్రసాదు ఇంటి కెప్పుడు వస్తాడో తెలియదు.'

'ఏమిటి అభ్యంతరం మామయ్యలకి-"అని రెట్టించేసరికి 'అబ్బే ఏం లే"దని ఇద్దరూ గబగబా ముందుకు నడిచేరు.

ప్రసాదు గర్వంగా నవ్వుకున్నాడు.

ఆ తర్వాత రెండురోజులవరకు ప్రసాదు మామయ్యల్ని కలుసుకోకుండా అర్జెంటు పని అంటూ తప్పించుకుని తిరిగేడు. మూడోరోజు పెద్దమామయ్యని వెళ్లిపొమ్మని-నేను తప్పక ఇంటికే గదా వచ్చేది అని నచ్చచెప్పి పంపించాడు. ఆ రోజు సాయంత్రం నీటుగా తయారయి ఉమాపతిగారింటికి వెళ్ళాడు ప్రసాదు. ఉమాపతిగారు ఎంతో సాదరంగా హడావిడి పడుతూ ఇంట్లోకి తీసుకెళ్ళారు. పదేళ్ళలో ఇంట్లో వచ్చిన మార్పులన్నీ గమనించాడు ప్రసాదు. ఇంతకంటే ఎన్నోరెట్లు గొప్పగా ఉంటుందితన బాస్ ఇల్లు.

'ఏం బాబు బాగున్నావా' అని అడిగింది అత్త. ఆవిడలో వయస్సు పటుత్వం తగ్గి, వార్ధక్య పు సూచనలుగా కంటికి జోడు.తల్లో నెరసిన వెంట్రుకలు కనిపించాయి.

'మీ దయవల్లబాగానేవున్నా'నంటూ కాఫీకప్పు అందుకున్నాడు ప్రసాదు. పిల్లలంతా ఆసక్తిగా చూస్తున్నారు. కొంచెంసేపయాక లీల వచ్చింది వాళ్ళ దగ్గరికి. ప్రసాదు చూసేడు. లీల బాగా మారింది ఇరవైఏళ్ళ లీల. డబ్బుతో అన్నీ కొనుక్కోగల లీల. మంచి ఏపుగా, పండిన యాపిల్ పండులా వుంది. నైలెక్స్ చీరలో బింకంగా పొందికగా పొంగివస్తున్న ఏటిపాయలా ఉంది.

'హల్లో ప్రసాద్. కంగ్రాచ్యులేషన్స్. చాలా రోజులకి ఉద్యోగస్థుడవై కనిపించావు.' అని విష్ చేసి ఎదురుగా కూర్చుంది.

'థాంక్స్' చెప్పి ఊరుకున్నాడు ప్రసాద్.

అందరి మధ్య చాలాసేపు చాలా రకాల కబుర్లు అయ్యాక అత్తమ్మ ఓ చిన్న ప్రోగ్రాం పెట్టింది. ప్రసాదునూ, లీలనూ పిక్చర్‌కి వెళ్ళమని ప్రసాదు చిన్నగా నవ్వి 'సారీ అత్తయ్యా! నేను లీల పక్కన కూర్చుని పిక్చర్ చూడాలంటే అది లీల కెంత బాధగా ఉంటుందో నాకు తెల్సు. ఏదో ఈనాడు నాలుగు రాళ్ళు పోగుబడగానే నేను గొప్ప వాడ్నై పోయాననుకోను. పాపం! చిన్నప్పుడు లీల నా ప్రక్కన భోజనం చేయడానికి, ఎంత కోపగించుకుందో నీమీద. అదంతా నాకు గుర్తుంది. మళ్ళీ ఆ పనులు ఎలా చేస్తాను.' అన్నాడు సోఫా కమ్ బెడ్‌లో వెనక్కి వార్లబడి కూర్చుంటూ.

ఒక్క క్షణం అంతా నిర్ఘాంతపోయి, ఆ తరువాత తేరుకుని ముందుగా ఉమాపతిగారే మాట్లాడేరు. 'ప్రసాద్ నీ జ్ఞాపకశక్తి అమోఘంరా. జీనియస్ లక్షణాలవన్నీ. ప్రతి చిన్నదాన్ని గుర్తుంచుకోడం చాలా కొద్దిమందికే సాధ్యం. మా అల్లుడికి అలాంటి తెలివితేటలున్నాయంటే నాకు గర్వంగా వుంది. ఓకే. మీరు ఇక రెడీ అయి బయలుదేరండమ్మా' అంటూ కూతురువైపు చూసేరు.

'వెరీసారీ. మామయ్యా. నేను వెళ్ళలేను. అక్కడ లీలని..., ఎరుగున్న వాళ్ళెవరైనా కనపడితే మీ తెల్సినవాళ్ళమ్మాయి ఏదో సినిమా చూడాలంటే తీసుకొచ్చానని చెప్పగల్గితే వెళతాను. అంతే గాని మా బావ. అదీ ఇదీ అని కోస్తే నే వెళ్ళలేను' అంటున్న ప్రసాద్ ముఖంలోకి పరీక్షగా చూసేరు ఉమాపతిగారు. ప్రసాదులో వున్న

ప్రతీకార వాంఛ స్పష్టమయింది. అప్పటికే లీల ముక్కుపుటాలు అదురుతున్నాయి. ఉమాపతిగారు సిగరెట్ అంటించుకుని మెల్లగా చెప్పారు. 'ప్రసాద్ అయితే నీలో పాతస్మృతులు మిగిలే ఉనాయన్న మాట. ఇంతకాలంగా మేం నీకోసం ముత్యపు చిప్పల్లా ఎదురుచూసిన సంగతి గుర్తు రాదా?' ప్రసాదు చివ్వున తల తిప్పి చూసేడు.

'ముత్యపు చిప్పలా? ఎవరూ? మీరు, అత్తయ్యా లీలా, రాధా, పెద్దత్తయ్యా, పెద్దమామయ్యా మీరంతానా, ఎందుకట. నా సంపది కోసం, నా పేరుప్రతిష్ఠలకోసం-కట్నం లేకుండా దొరుకుతున్న అల్లుడికోసం. అవునా? కానీ ముత్యపుచిప్పలు స్వాతివానకోసం మాత్రమే ఎదురుచూస్తాయి. ఆ చినుకులు పడినప్పుడే అవి ముత్యాలవుతాయి. అంతేగానీ సముద్రపుటొడ్డున ఉండే ప్రతి నత్తగుల్లా, శంఖులు ముత్యపుచిప్పలు కావు.

'నిజంగా నాకోసం ఏదురు చూస్తున్న ముత్యపుచిప్పలు ఎవరో తెలుసా, పదేళ్ళనుంచీ నాకోసం అహోరాత్రులు ఎదురుచూస్తున్న అమ్మ. ఐదేళ్ళుగా నాకు తోడు నీడై నిలచి, నా కష్టసుఖాలు పంచుకుని, నా పిలుపుకోసం మూగగా ఆవేదనగా ఎదురుచూస్తున్న నా రేణూ. ఆమె మా కంపెనీలో టైపిస్టు వీళ్ళిద్దరే అసలైన ముత్యపు చిప్పలు' అని లేచి బయటికి వచ్చేసేడు. అతని హృదయం బరువుతో మూలుగుతోంది...

ఆ మర్నాడు పెద్దమామయ్య ఇంటికి చేరేడు. గుమ్మంలో అత్తయ్య ఎదురై, బోలెడు గందరగోళం చేసి, అల్లుడల్లుడని దిష్టి గిష్టి అంటూ తీయబోయింది। ప్రసాదు విసురుగా లోపలికి వచ్చి, తిన్నగా వంటింటి గుమ్మంలో నుంచున్న తల్లి పాదాలు తాకేడు.

'బాబూ!' అంది ఆర్ద్రంగా కళ్ళనీళ్లు తిరుగుతూ ఉంటే... మాట్లాడలేక పోయింది...

'అమ్మా క్షమించమ్మా, ఇంతకాలం నిన్ను బాధించాను. ఇంక ఒక క్షణం కూడా ఉంచను. రేపే మనం బయల్దేరుదాం.' అన్నాడు ఆప్యాయంగా ఒళ్ళు నిమురుతూ...'అదేమిట్రా. రేపే వెళ్ళడమేమిటీ అయినా అమ్మ మాకు పరాయిదా అలా బాధపడుతున్నావ్. చాల్లే. మేమంతా నీకోసం ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తుంటే.. అమ్మారాధా కాఫీ ఫలహారాలు మేడమీదికి పట్టుకెళ్ళమ్మా! వెళ్ళరా. కాస్త కాళ్ళు అవీ కడుక్కొని, మేడమీదకెళ్ళి రెస్ట్ తీసుకో.' అన్నారు కామేశ్వరరావుగారు.

ప్రసాద్ మామయ్యవైపు తిరిగి 'మామయ్యా. నిన్ననే చిన్న మామయ్యకి 'ఎదురుచూపు'కు అర్థంఏమిటో వివరంగా చెప్పివచ్చాను వెళ్ళి కనుక్కో. అదే మీకు కూడా వర్తిస్తుంది. అనవసరంగా నామీద ఆశలు పెట్టుకోకు. చిన్నప్పట్నుంచి పెరిగినంత మాత్రంలో నేను రాధకి మొగుణ్ణి అయితీరాలని. రూల్ పెట్టుకోలేదు. ఆ కాఫీ ఫలహారాలు అమ్మ చేసినవే గనుక, అమ్మ దగ్గర కూర్చునే తింటాను. ఇంత కాలం అమ్మకి తిండి, గుడ్డ ఇచ్చినందుకు ఆవిడ మీ ఇంట్లో వంటలక్క పని చేసింది. ఇక మీదట నేను ఆ అవసరం రానివ్వను. అమ్మను తీసుకుని త్వరగా వెళ్లాలి. నా కోసం అక్కడ ఎదురుచూసే రేణు' బాధపడుతుంది. అమ్మ ఆశీర్వాదంతో వచ్చే నెలలో మా పెళ్ళి జరుగుతుంది. వాళ్ళ నాన్న నాకు బాగా ముద్దుముచ్చట్లు జరిపిస్తాట కూడా. అమ్మా నీ బట్టలన్నీ రేపీపాటికి సర్దేసుకుని తయారవ్వాలి. సీట్లు రిజర్వ్ చేయించే వచ్చాను' జోరుగా అన్నాడు నాలుగురోజుల క్రితం పడిన వర్షపు జోరుకూడా అలా ఉండి ఉండదేమో!. ఎవ్వరూ నోరు విప్పలేదు. అంతా అవాక్కయి పోయారు.

రాధ తల వంచుకుని గదిలోకి వెళ్ళిపోయింది ఆమెను చూస్తూ.

'ముద్దమందారంలా ఉన్నావే కానీ...గాలివాటుకు ఎగిరిపోయే కాగితాల పువ్వులవంటివి మీ మనసులు! నేను కాకపోతే మరొకడని మనసుకు నచ్చచెప్పుకోగలవు.--అందుకే నువ్వూ...లీలా...నా రేణూతో సమానం కాలేరు' అనుకున్నాడు.

ఆ మర్నాటి రాత్రి రైల్లో తల్లితో కూర్చున్న ప్రసాద్ దూరంగా తనకోసం, తన రాకకోసం ఎదురు చూస్తున్న రెండుకళ్లు...ముత్యపు చిప్పల్లాంటి కళ్ళు-గుర్తు వస్తూంటే 'వస్తున్నా రేణూ' అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.—



# రంగులు! రంగులు!

(1986 లో ఉదయం వారపత్రికలో ప్రచురించబడిన కథ.)

"అమ్మా! అమ్మా! చూడమ్మా చూడమ్మా ఎన్ని రంగులో? తిప్పినప్పుడల్లా మారిపోతున్నాయి, అబ్బో! అబ్బో! రకరకాల డిజైను కనిపిస్తున్నాయమ్మా!"

ఓ కన్ను మూసుకుని ఓ కన్నుతో పెరెస్కోప్ (రంగుల డిజైను చూపే గొట్టం) చూస్తూ ఎనిమిదేళ్ళ రాధి కేరింతలు కొట్టింది.

అన్యమనస్కంగా ఉన్న...ఆ పిల్ల తల్లి అసహనంతో అబ్బ! విసిగించకే రాధీ! నా మనసేం బాగులేదు' అన్నది.

రాధికి తల్లి మనసుతో కానీ-ఇంటి పరిస్థితులతో కానీ సంబంధము లేదు, ఆ పిల్ల వయస్సు అలాంటిది!

ఎరుపు రంగులతో డిజైన్లు వచ్చిన-పచ్చ రంగులతో డిజైన్లు వచ్చినా ఒకలాగే సంతోషిస్తోంది. ఒకేరకంగా ఆనందిస్తోంది ఆ పసి మనసు!

సూర్యోదయములో లేతఎండలా అతి నిర్మలంగా ఉండే బాల్యావస్థ అది.

కానీ-జయమ్మ నలభైయ్యో పడిలోని ఇల్లాలు! నల్గురు పిల్లల

తల్లి! బాధ్యతలపట్ల గౌరవం-సమాజంపై నమ్మకం పెంచుకున్న గృహిణి!

ఆ రోజు ఉదయం ఏడుగంటలకి బయటికి వెళ్తున్న పెద్దకొడుకు గోపాలం వాలకం అదోలా వుంది! ఎన్నడూ వేషధారణయందు ఆసక్తి చూపించని గోపాలం ఆ రోజు ప్రత్యేకించి సూటువేసుకుని..ప్రత్యేక శ్రద్ధతో తలదువ్వుకుని ఒకటికి నాల్గుసార్లు అద్దంలో చూసుకున్నాడు

'ఏమిట్రా? ఇవాళేమిటి అలంకరణమీద ఇంత శ్రద్ధ పుట్టుకు వచ్చింది?' అని నవ్వుతూ అడిగింది...

ఉలిక్కిపడి...'ఆ! అహా!... అబ్బే ఏంలేదమ్మా ఏదో అలా చేసుకోవాలనిపించింది అంతే! 'ఏమ్మా? బాగుందా? అన్నాడు.

"ఎందుకు బాగుండదూ, వెర్రినాయన- చక్కగా రోజూ ఇలా ఉండరాదూ? రైలుకి పరిగెడ్తున్న వాడిలా హడావిడిపడిపోతూ వెళ్తావు ఆఫీసుకి. మళ్లీ'-ప్రయాణంనుంచి తిరిగి వచ్చిన వాడిలా అలసిపోయి వస్తావు. పిచ్చినాయనా, ఎన్నడైనా అరగంటసేపు అద్దంముందు నుంచున్నావా? చూసుకో ఈ రోజు ఎంత బాగున్నావో'? అంది కొడుకుని గర్వంగా చూస్తూ ...

'నిజంగానా అమ్మా?...? అంటూ తల్లి దగ్గరికి వచ్చి 'బాగున్నావా? అయితే ఆశీర్వదించమ్మా.' చటుక్కున వంగి కాళ్ళకి దండం పెట్టాడు.

'అయ్యో అదేమిట్రా? దండం ఎందుకు?' అంటూనే శీఘ్రమే కళ్యాణ ప్రాప్తిరస్తు.' అనేసింది.

అవునుమరి. పాతికేళ్ళ వాడు ఇంటికి పెద్దకొడుకు గవర్నమెంటు ఉద్యోగస్తుడు...ఇక కోరేదేమిటి? కోడలు రావాలనేకదా? అదే ఆవిడ దీవించింది.

'చాలమ్మా. చాలు. నీ ఆశీర్వాదమే నాకు బలం. వస్తానమ్మా.' అంటూ బ్యాగ్ అందుకుని గదిలో నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

తెల్లబోయింది.

వాడికి ఎందుకు అంత ఉద్వేగం.

ఏమిటా తత్తరపాటు. అసలు ఎప్పుడూ దండం పెట్టడే? పైగా పెళ్ళి మాటెత్తితే అక్కడినుంచి వెళ్ళిపోయేవాడు—అలాంటిది ఇవాళ దండం పెట్టాడు—తొందరగా కళ్యాణం జరగాలని దీవిస్తే సంబర పడుతున్నాడు—అయినా రామ్మూర్తింటికి వెళ్ళాల్సినవాడు ఏడుగంటలకే వెళ్ళిపోతున్నాడేమిటి. భోజనం చేయడా?

ఆవిడ లేచి కూడా 'ఒరే అబ్బాయ్' అనేలోగా గోపాలం అప్పుడే వీధి మెట్లు దిగేసాడు...

'ఇదేమిటండీ అబ్బాయి ఇవాళ అంత తొందరగా వెళ్తున్నాడు' అంటూ భర్త దగ్గరికి వెళ్ళింది

గడ్డం గీసుకుంటున్న రామారావుగారు...ఆవిడవైపు ఓ చూపు విసిరి—'ఏదైనా తొందరపని ఉందేమో, మళ్లీ వస్తాడులే.' అనేశారు తేలికగా

అయినా జయమ్మ మనసు కుదుట పడలేదు. ఏడుగంటలకి వెళ్ళిన గోపాలం—సాయంత్రం అవుతున్నా రాలేదు.

'అదేమిటీ, ఎప్పుడూ ఇలా జరగలేదే. పోనీ అంత అర్జెంటు పని ఉంటే—చెప్పి వెళ్ళవచ్చు కదా. ఆవిడకి ఇంటిపనులు చేసు కుంటున్నా-అయ్యో కొడుకు భోజనం చేయకుండా వెళ్ళాడన్న బాధ పీకుతూనే ఉంది

రాధి మాటలకి ఆమె ముచ్చట పడలేదు. సమయం సందర్భం తెలియని పసిపిల్ల చేష్టలకి చిరాకుపడింది.

పెద్ద కూతూరు సుగుణ తల్లిని మందలించి 'ఏమిటమ్మా నీ చాదస్తం. ఒక్కరోజు అన్నయ్య ఇంట్లో అన్నం తినలేదని ఇంత ఆరాటమా, కొడుకు మీద ఇంత పక్షపాత బుద్ధి పనికిరాదు'.

'అదికాదే అక్కా, రేపు కోడలు వస్తే... వాడి సంరక్షణ అంతా ఆ అమ్మాయే చూసుకుంటుంది కదా. అప్పుడు అమ్మకి ఛాన్స్ మిగల నివ్వదేమో అని భయం అందుకని...పాపం...'

నిర్మల మాటలు పూర్తి కాకుండానే—'చాల్లే. ఊరుకో. నా కలాంటి స్వార్థం ఏంలేదు. వాళ్ళిద్దరు హాయిగా ఉండాలంతే.' అన్నది జయమ్మ.

'ఆ. ఆ. ఇప్పుడలాగే ఉంటుందిలే తర్వాతే మొదలవుతాయి.

'సరేలే, నీతో వాదించలేను.' అంటున్న జయమ్మ ..అప్పుడే ఆఫీసునుంచి వస్తున్న భర్తని చూసి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

రాజారావుగారు వస్తే...ఎక్కడ వాళ్ల అక్కడకి వెళ్ళిపోతారు.

ఆరుగంటలు దాటింది.

వాకిట్లో టాక్సీ ఆగింది.

జయమ్మతో సహా ముగ్గురు ఆడపిల్లలు వీధిలోకి తొంగి చూశారు.

గోపాలం టాక్సీ తలుపు మెల్లగా తెరుచుకుని దిగేడు..,అతని మెడలో ఓ పూలదండ..అతని వెనకే టాక్సీలో నుండి ఓ అమ్మాయి కూడా దిగుతోంది. పట్టుచీర పూలమాల...

గోపాలం టాక్సీ చార్జీ పే చేస్తున్నాడు.

ఆ అమ్మాయి బెదురు బెదురుగా ఇంటిపైపుచూసి మళ్ళీ గభాల్న గోపాలంమీదకి దృష్టి మార్చింది.

గోపాలం...ఆ అమ్మాయి మెట్లెక్కి వచ్చారు.

"అమ్మా!..అన్న పిలుపు వినేదాకా జయమ్మ స్పృహలోకి రాలేదు.

'నాన్నగారింట్లోఉన్నారా,' అని పెద్ద చెల్లెల్ని అడిగేడు మౌనంగా తల ఊపి వెళ్ళి 'నాన్నా మీరిలా రండి.' అని పిల్చింది సుగుణ.

'క్షమించమ్మా మీకు చెప్తే...అభ్యంతరం చెప్తారని...' అంత కన్నా చెప్పవల్సింది ఏమీ లేదన్నట్టు చూశాడు,..

రాజారావుగారు గదిలోనుంచి హాల్లోకి వచ్చారు...ఎదురుగా గోపాలం...నరసన మరో అమ్మాయి...

పూలదండలు...అర్థమైంది.

చూస్తున్నారు...రాతిబొమ్మలా ..

చటుక్కున గోపాలం ఆ అమ్మాయి, ముందుకువచ్చి ఆయన కాళ్ళకి దండం పెట్టారు. ఆ వెంటనే జయమ్మ కాళ్ళకీ పెట్టారు.

'మమ్మల్ని ఆశీర్వదించమ్మా.'

జయమ్మ పెదవులు కంపిస్తున్నాయి. కళ్ళనిండా నీరు..కొడుకు తలమీద చేయి ఆనించి...ఏమి దీవించిందో..తెలియదు. కళ్లు మూసు కుంది..రెండు కన్నీటి చుక్కలు రాలి పడ్డాయి.

ఆ క్షణంలో ఆమె ఇక నిల్చోగల స్థితిలో లేదు. కొడుకుమీద ఆర్థికమైన ఆశలు పెట్టుకోకపోయినా కోడలు వస్తుందనీ . ఇంట్లో ఉంటుందనీ..ఇంకెన్నో ముద్దు ముచ్చట్లు .. కోసం...ఆశపడ్డమాట వాస్తవం।

చిన్నప్పట్నుంచి పెంచుకున్న నమ్మకాలు...కట్టుబాట్లు మీద గౌరవమర్యాదలు-ఒక్కసారి కుప్పకూలి నట్లయింది.

జయమ్మ నగటు గృహిణి!

రేపట్నుంచీ తల ఎత్తుకోలేదు..!

బంధువుల పోట్లు ఎలా భరించాలీ..।

ఆడ పిల్లలకి పెళ్ళిళ్ళు ఎలా అవుతాయి?

ఆమె కళ్ళముందు ఎన్నెన్నో దృశ్యాలు

చుట్టూ సమాజం పగలబడి నవ్వుతోంది, విమర్శిస్తోంది. వెక్కిరిస్తోంది! చిన్నచూపు చూస్తోంది।

ఇవన్నీ రేపట్నుంచి మొదలవుతాయి!

ఆమెకి కళ్ళు తిరుగుతున్నాయి. తల నరాలు అదురుతున్నాయి. తూలి పడబోయింది...

గభాల్న...కూతుళ్ళిద్దరు పట్టుకున్నారు.

అంతే!! తర్వాత ఏం జరిగిందో ఆమెకి తెలియదు మధ్యరాత్రి మెలుకువ వచ్చింది.

తమ మంచం మీద పడుకుని ఉంది. పక్కనే స్టూలుమీద రాజారావుగారు కూర్చుని—తల నిమురుతున్నారు.

ఇరవై ఏడేళ్ళ దాంపత్య జీవితంలో—రాజారావుగారి నుండి ఇంతటి ఆత్మీయత పొందడం అదే మొదటిసారి!

ఆయనవైపు చూసింది దీనంగా।

రాజారావుగారు జాలిగా చూసి...''చూడు! బాధపడకు మనం చేసుకున్న పుణ్యం ఇంతే. వాళ్ళిద్దరు వెళ్ళిపోయారు. వాడు అన్నీ ఏర్పాట్లు చేసుకునే వచ్చాడు...అంతే। వాడికీ మనకీ ఋణం తీరిపోయింది।''

'ఏమండీ!' కళ్ళమీద రెండు చేతులుంచుకుని ఆవిడ ఘొల్లు మంది।

సుగుణ సిత్మల గబగబా వచ్చారు...

"చూడండమ్మా! మీ అమ్మని ఓదార్చండి!" రాజారావుగారు కళ్ళు వత్తుకుంటు లేచి బయటికి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి ఆ కూతుళ్ళు తల్లి దగ్గరే కూర్చున్నారు

ఆ న్నెల తర్వాత...

సమాజపు విమర్శలు

బంధువర్గం అపుష్ఠలు...

మిత్రుల పరిగ్యపు ఓదార్పులు...

అన్నిరకాల ఒడుదుడుకులు భరించుకుని పథ్యం తిన్న రోగిలా మళ్ళీ మామూలు జీవితంలో పడింది ఆ సంసారం।

కాని ఆ మాతృహృదయం రోజుకోసారైనా ఇల్లువిడిచి వెళ్ళి పోయిన కొడుకు కోసం విలపిస్తూనే ఉంది...

లోకంకోసం వెరుస్తోందిగానీ-ఒక్కసారి కొడుకుని చూడాలనే తపన జయమ్మగార్ని విలవిలలాడిస్తోంది।

రోజులు గడుస్తున్నాయి!

సుగుణకి పెళ్ళి ప్రయత్నాలు మొదలు పెట్టారు।

బంధువుల్లో కొందరు సానుభూతి (!) గా నాసిరకం సంబంధాలు తీసుకువస్తున్నారు.

"చూడండి రాజారావుగారూ—అబ్బాయి అలా కాని పెళ్లి చేసు కున్నాడా? ఇక ఈ ఇంటి ఆడపిల్లల్ని పరువు మర్యాదగల వాళ్ళు ఎవరైనా చేసుకుంటారా? చెప్పండి? అందుకని ఫర్వాలేదు—రెండో పెళ్లే అయినా-పిల్లలులేరు, వయస్సుకూడా పెద్ద ఎక్కువేమి కాదు.

'ఊ' అనండి ముహుర్తాలు పెట్టిద్దాం!" అంటూ...ఉదారంగా ఊదర గొట్టేస్తున్నారు... పెద్ద మనుష్యులు.

రాజారావుగారిక్కి ఒళ్ళు మండుతోంది! అయినా నోరు మెదప లేదు!

సుగుణకి ఏంలోటు?

అప్సరసకాకపోయినా వికారంగాలేదు. గ్రాడ్యుయేట్। మంచి పనివంతురాలు। బుద్ధిమంతురాలు। తాహతుకు తగ్గ కట్నం ఇయ్య గలరు. మరి ఏమిటి ప్రారబ్ధం!?

జయమ్మ అవమానంతో కృంగిపోతోంది।

'నాయనా। గోపాలం। ఎంతపని చేసావురా? నీ స్వార్థం నువ్వు చూసుకున్నావుగానీ చెల్లెళ్ళ సంగతి ఆలోచించలేక పోయా వురా? అంటూ దీనాతి దీనంగా మూగవేదన అనుభవిస్తోంది।

ఒకరోజు సుగుణ మెల్లగా తల్లిదగ్గరికి చేరింది। 'అమ్మా నీకో మాట చెప్పాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నానమ్మా...కానీ... నువ్వు..ఏమంటావోనని...'

దిగ్గున చూసింది జయమ్మ।

'ఏమిటి?' ఆవిడ గుండె దడదడలాడిపోతోంది.

'అదే నా పెళ్ళి ప్రయత్నాలు చేయకండి। మీరు ఒప్పుకుంటే నేను ప్రసాద్‌ని చేసుకుంటాను అతనూ ఇష్టపడ్తున్నాడు...మేము... ప్రేమించు కున్నామమ్మా!'

"ప్రసాదా? అంటే?" జయమ్మగారు వణికిపోయింది!

"అదే--మన వీధి చివర డా॥ సుదర్శనంగారి రెండో అబ్బాయి లా చదువుతున్నాడే.. అతను. ఏమ్మా? వద్దా? మానేస్తాను. కానీ ఇంకెవర్నీ చేసుకోను. అసలు పెళ్ళి చేసుకోను...అతన్ని తప్ప"

'అగు। అసలు మీరిద్దరు ఎలా పరిచయమయ్యారే?'

'ఫోమ్మా! ఎలా అంటే ఏం చెప్తాను? చిన్నప్పట్నుంచి తెలుసు, పెద్దయ్యాక...ఒకరి మనసు ఒకరికి చెప్పుకునే చనువు ఉంది! ఏమ్మా మీకేమిటి అభ్యంతరం? అతను వాళ్ళ పెద్దల్ని ఒప్పించగలడు!'' జయమ్మ తేరుకుంది!

కలా? నిజమా? తను వింటున్నదేమిటి?

సాటివాళ్ళు! పరువు ప్రతిష్ట గల కుటుంబం! స్థోమత ఉంది! చదు ఉంది-బాగుంటాడు—పైగా ప్రేమించుకున్నారుట!

ఇలా జరగడం సాధ్యమేనా? ఇంత అదృష్టమా? జయమ్మకి ఊపిరి ఆడటం లేదు

సంతోషం! కల్సివస్తున్న సంబంధం! ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

'మీరు పెళ్ళి లాంఛనంకోసం వాళ్ళ పెద్దవాళ్ళతో సంప్రతించండమ్మా''

'అమ్మా సుగుణా...అలాగే...అలాగే...''

ఆ రాత్రే విషయం రాజారావుగారిక్కి తెల్పింది. ఆయన పరిస్థితి అలాగే అయిుంది!

సుదర్శనంగారు మొదట ఎగిరినా—తర్వాత సర్దుకున్నారు తప్పదు మరి!

మైనార్టీ తీరిన పిల్లలు! అభీష్టాన్ని అడ్డుకుంటే-రిజిష్టర్ మ్యారేజ్ చేసుకోగల్రు!

అందుకే పెద్దలంతా ముందుకువచ్చి అట్టహాసంగా పెళ్ళి జరిపించేరు!

'హమ్మయ్య! ఎంత ఆనందం!' అనుకుంది జయమ్మ కొడుకు చేసిన 'తప్పు' కూతురివల్ల తుడుచి పెట్టుకుపోయింది. అమ్మాయి

అయినింటి కోడలయింది. ఇక లోకం మమ్మల్ని వేలెత్తి చూపలేదు. అనుకుని తృప్తి పడింది.

కట్నం లేదు-పైగా మంచి కుటుంబం-ఇంతకన్నా ఎంకావాలి?

ఇప్పుడు అంతా తనని పొగుడ్తారు! గౌరవిస్తారు, అనుకుంటూ గర్వపడింది.

వారం రోజుల తర్వాత--పెళ్లి బడలిక అంతా తీరాక సామా న్లన్నీ సర్దుకుంటున్నప్పుడు-అటమాల్లో కనిపించింది-రాధిక పోగొట్టు కున్న పెరిస్కోప్.—

'ఇదిగోనే రా ధీనీ రంగుల గొట్టం--పోయిందనుకుని గోల పెట్టావు-తీసుకోమ్మా!' అని అందించింది తల్లి.

ఆ పిల్ల సంబరపడిపోతూ తీసుకుంది.

రోజులు గడుస్తున్నాయి. నిముషాల్లాకాదు... భారంగా?జయమ్మ ఊహించిన దానికి రివర్స్‌గా...వస్తున్నాయి, సమాజపరంగా వచ్చే వార్తలు। తట్టుకోలేక పోతోంది.

ఒకరోజు సాయంత్రం రాధి స్కూలునుంచి వచ్చి తీరికగా పెరిస్కోపు చూసుకుంటు ఆనందిస్తుంది...

'అమ్మా! అమ్మా! చూడమ్మా ఎన్ని డిజైన్లు కనిపిస్తున్నాయో''
'ఉండవే! విసిగించకు.' అని విసుక్కుంది.

అప్పుడే రాజారావుగారు ఆఫీసునుంచి వచ్చారు.

పదినిముషాల తర్వాత నిశ్శాంతిగా కుర్చీలో కూర్చున్నాక, అప్పుడు గమనించేరు...జయమ్మ అదోలా ఉందన్న సంగతి.

'ఏమిటి అలా ఉన్నావు?'

జయమ్మ నిర్లిప్తంగా చూసింది--

'అదేమిటండీ? వీళ్ళంతా అలా అనుకుంటున్నారు?'

'ఎవరు? ఏమిటి,'

'మన వీధిలో వాళ్ళు...తంతే బూర్లబుట్టలో పడ్డామట... అమ్మాయి ప్రేమించడమేమిటి? అన్నివిధాలా అనుకూలంగా ఉన్న వాణ్ని చూసి వలవేసిందట. అది ప్రేమా ఏమిటీ? ఎర్రగా బుర్రగా ఉందిగదా ఆ పిల్లాడి దగ్గర ఏం పగలు పోయిందో, ఏంతైనా బియ్యే చదివింది కదా.. తెలివిమీరింది అమ్మో..మూడు ముళ్ళు వేయించు కునేలా చేసుకుంది. ఇక ఆ రెండో కూతురు కూడా ఏదో చూసు కుంటుందిలే. జయమ్మ గట్టిదే కొడుకుని కోడల్ని వేరే ఉంచిందా... కూతుళ్ళకి వాళ్లే మొగుళ్ళని వెతుక్కునేలా చేస్తుంది.,అంటున్నారండీ' అవమానంతో ఆమె గొంతు పుళ్ళ తిరిగిపోతాంది.

ఆయన సాలో చనగా తల పంకించారు. ఈ మధ్య ఈ ధోరణి లోనే తను కూడా చాల్ని విమర్శలు విన్నారు..కానీ జయమ్మకి చెప్ప లేదు. ఇప్పుడు ఆమె చెప్పాక-ఆలోచనలో పడ్డారు...జయమ్మ ఇంకా ఏదో చెప్తూనే ఉంది.

రాజారావుగారి చూపులు రాధిమీద నిలిచాయి...ఐదు పది నిముషాలు.

ఆ తర్వాత ఆయన పెదవులపై చిరునవ్వు మెరిసింది.

'చూడు రాధీ. ఆ గొట్టం ఒక్కసారి అమ్మకి ఇయ్యమ్మా--- చూడవే..అది తీసుకుని అందులో ఎలా కనిపిస్తుందో చూడు..' అన్నాడు జయమ్మతో.

జయమ్మ భర్త ధోరణి కి అయోమయంగా చూసింది.

'చూడమ్మా చూడు.' రాధి అందించింది తల్లి చేతికి. 'చూడవే ముందు' మళ్ళీ రెట్టించాడు రాజారావుగారు. ఇదేమిటీ? చంటిపిల్లలా నన్ను చూడమంటాడు' గొణుగుతూ--జయమ్మ ఆ గొట్టం అందుకుని చూసింది.

'ఎలా ఉంది. కోణం మారుతున్నప్పుడల్లా డిజైన్లు మారు తున్నాయి కదూ? రంగు రంగులుగా ఉంది అవునా..అంతేనే. ఈ

సమాజం కూడా అంతే, ఎదుటివాళ్ళ పరిస్థితులు మారుతుంటే...రక రకాల కోణాలనుంచి చూస్తుంది మన అబ్బాయి ప్రేమించి పెళ్ళి చేసుకుంటే...కులం కాదని తక్కువ చూపు చూసి వెక్కిరించి...మనల్ని నిందించింది.

ఇప్పుడు అమ్మాయికి అన్నివిధాల చక్కని వరుణ్ణి చేస్తే..ఓర్వలేక ఈనాడు ఈ సమాజమే అలాంటిటి. అందుకని మనం బాధపడనక్కర్లేదు...రాధి ఆ డిజైన్లు రంగులు చూసి ఎలా ఆనందిస్తుందో--మనం కూడా..ఈ సంఘాన్నీ దాని మార్పుల్ని చూసి నిర్వికారంగా నవ్వుకోవాలి..ఇప్పుడు ఓ నిర్ణయానికి వచ్చాను..రేపే వెళ్ళి-కొడుకుని కోడల్ని మన ఇంటికి తీసుకు వస్తాను..అన్నారు గంభీరంగా రాజారావుగారు---

తక్కున గొట్టం కళ్ళముందునించి దించి...

'నిజంగానే అలా చెయ్యండి' అన్నది జయమ్మ సంతోష తరంగాలు ఎగిరిపడుతుంటే. ఆమె చేతిలో ఉన్న పెరిస్కోపును ఆప్యాయంగా తడిమింది...



# 'తడి ఆరని కళ్ళు'

(విశ్వ రచనలో ప్రచురితమైనదీ కథ.)

జప వచ్చిన ముసలి శరీరంలా సాయంత్రం ఎండ పల్చబడిపోయింది. సిగ్గులు సింగారించుకున్న 'సంధ్య' అత్తారింటికి వెళ్ళే కొత్త కోడలులా ఉంది. విలవిలలాడి వడలిపోతు పడమటి కొండల్లో ఇమిడిపోతున్న 'దినకరుడు'–కన్నతండ్రిని గుర్తు చేస్తున్నట్టున్నాడు.

ఆ వేళప్పుడు.

అకుచెప్పులు చేతికర్ర, ఖద్దరులాల్చి, పంచకట్టు అలవాటుపడ్డ వేషంలో అనవాయితీ తప్పకుండా పార్కువైపు షికారుగా బయల్దేరేరు. వెంకటరత్నంగారు మూడో ఇంటిముందు నిలబడి 'చంద్రం! అని కేకవేసేరు.

ధర్మానికి కట్టుబడినట్టు, ఆ ఇంటి దూలాలు ఎన్నో ఏళ్ళనుంచి ఆ ఇంటి గాథలు, బాధలు మౌనంగ జీర్ణించుకుని, నీరసంగా వంగి కన్నీటిబొట్టులా చెదలుకొరికిన చిల్లులోనుంచి పొట్టురాలుస్తు–అలా ఆ ఇంటిని పట్టుకుని ఉన్నాయి.

ఓదార్చడానికి కూడా ఓపికలేని గోడలు, అలకించడానికి కూడా అలసిపోయిన ఆవరణ నిశ్శబ్దంగ చేతకాని చుట్టాలాగ, వెలితి బడ్డ స్నేహితుల్లాగా నిలబడ్డాయి. 'ఆ వస్తున్నానోయి"-అని లోపలకొక అడుగువేసి 'ఏదో ఒకటి చెసేద్దూ"-అంటూ వీధిమెట్లు దిగుతున్న రామ చంద్రాన్నీ చిన్నగ నణుగుకుంటు తలుపు పక్కనుంచి తప్పుకున్న ఇల్లాల్నీ గమనించకపోలేదు వెంకటరత్నంగారు.

రోజూ తను వచ్చేసరికి ఇలాంటిదేదో ఒకటి తన చెవిని పడు తూనే ఉంటుంది. ఒకరోజు అబ్బాయి ఫీజు గురించి, మరొకరోజు పాతబాకీ చెల్లించాల్సిన గడువుగురించి, ఇంకో రోజు ఇంకోటి. ఈరోజు ఇంట్లో వంటకాన్ని గురించి కాబోలు ఇలా వాళ్ళింట్లో సమ స్యలన్నీ తను సరిగా వచ్చేసరికే ఎందుకు వెల్లడి అవుతాయ్‌ట?

'పదవోయ్' అన్న రామచంద్రంతో అడుగులు కలుపుతూ మౌనంగా నడవసాగేరు, వెంకటరత్నంగారు.

అప్పుడు ఆయన మనస్సులో స్నేహితునివట్ల నిర్లక్ష్యం తేలిక భావం లాంటివి పేరుకుంటున్నాయి. అలా ప్రతిరోజు పేరుకుపోవడం ఆ తరువాత మళ్ళి కరిగిపోవడము లేదా మర్చిపోవటం జరిగి తిరిగి సాయంత్రంవేళ షికారుకు పిలవడము అలవాటే! వెంకటరత్నంగారి మనసులో పేరుకుంటున్న భావాల్ని ఒక్కొక్కటిగ విడదీస్తే ఇలా ఉంటాయి.

సంపాదించే రోజుల్లో జాగ్రత్త లేక నిలువ చేసికోలేకపోవడము ఆ తరువాత ఇబ్బందులు పడుతూ బీద అరుపులు అరవడము కాస్త పచ్చగా కనిపించే తనలాంటి వారిని చూచి కన్నెర్రన చేసుకోడము.

ఏం! మొదటే తనలాగ జాగ్రత్తగ ఉండకూడదూ? తనెప్పు డైనా దుబారా ఖర్చులు చేసేవాడా? హోటళ్ళకి, సినిమాలకి వెళ్ళే వాడా? వెధవ అలవాట్లు చేసుకోడాలు ఎందుకంట? కాఫీ తప్ప మరొక దురలవాటు అంటే సిగరెట్లు, సినిమాలు హోటళ్ళు పాషన్

బుల్ దుస్తులు లాంటివి తనకి అలవాటుడుందా? కనుకనే తను ఎంతో కొంత నిలవచేసుగలేడు. అదిగో ఆ కనబడుతున్న బాంక్ అకౌంటు మీదేఉంది అందరిదృష్టి! ఇంట్లో మైనార్టీ దీరిన కొడుకులకి అకౌంటు 'డ్రా' చేసి ఇచ్చేయాలని లేదూ! ఎదురుగా అడిగే ధైర్యం లేక గాని ఎప్పుడో 'హారతి' పాడేస్తురు!

తమ సంపాదనంతా భార్యామణుల విలాసాలకే పెట్టారుగాని ఇంటిఖర్చు క్రింద ఏనాడైనా ఇచ్చిన పాపాన్న పోయేరూ! అప్పుడే ఏమైందీ ఇద్దరు, ముగ్గురు పుట్టుకొస్తే తెలుస్తుంది.

ఆ ఏం తెలుస్తుంది? ఈ రామచంద్రం లాగే ఈనురోమంటు అఘోరిస్తే అదిగో అప్పుడు తను చెప్పాల్సిన నాల్గుచెప్పాలి. కోడల మ్మల ముఖాలు ఎత్తుకుండా పలవాలి ఈనాటి ముద్దు మురిపాలు, హద్దు పద్దు లేని సరదాలు ఎంత స్థితికి కల్గించేయో చూడమని చీవా ట్లేయాలి.

కళ్ళముందు రామచంద్రం కనిపిస్తునే ఉన్నాడు. ఆరుగురు పిల్లలు అందులో పెద్దపిల్లలిద్దరు పెళ్ళికి ఎదిగిన ఆడపిల్లలు ఇద్దరు కాబూలీ వెధవల (అల్లుళ్ళ) దాహాలు తీర్చగల్గితే వాళ్ళ అత్తారిళ్ళకి వెళ్లేయోగం పడుతుంది! తక్కువ రేట్లతో దొరికితే అదృష్టమే మరి అప్పుడైనా ఈ రామచంద్రానికి ఉన్నదేమిటి, ఆ ఒక్క ఇల్లు తప్ప. దాన్ని కొనే నాథుడెవడూ? నాలాంటివాడికి అంటకట్టాలనే ఎత్తు ఉండి ఉంటుంది. ప్రతివాడికి నన్ను పట్టుకుని పాకులాడాలనే దుర్గే. స్వజనా నికి స్నేహితుడికీ ఇరుగు పొరుగులకీ అందరి వెధవల కళ్ళు తనమీదే

వెంకటరత్నంగారి భావాలు ఆకాశంలో మేఘాల్లాగా సాగి పోతున్న సమయములో అదేమిటోయ్ పార్కు వచ్చేసింది ముందుకు వెళ్ళిపోతున్నావు ఏమిటో పరధ్యాహ్నంగ ఉన్నావు ఇవాళ? ఏం ఒంట్లో నలతగా ఉందా!'-అని భుజంమీద చేయి వేసేరు రామ చంద్రంగారు.

ఆ క్షణంలో అలా రామచంద్రంగారి చేయి తన భుజంమీద పడిన క్షణంలో వెంకటరత్నంగారి తనువెల్లా పులకరించిన మాట నిజం. భుజంమీద చేయివేసి, 'ఏవోయ్' అని పిలవగల చనువు ఒక్క రామచంద్రానికే ఉంది. కళ్ళజోడు తీసే నెపంతో క్షణం కళ్ళు మూసుకుని మరుక్షణంలోనే ఉలిక్కిపడ్డా. త్రాచుపాముమీద పడినట్టు భయపడ్డారు ఇప్పుడు ఇలా ఆప్యాయంగ భుజంమీద పడిన చేయి రేపు తనని డబ్బుకోసం వేధించగలదు. జాలి నింపుకున్న ఆ ఇద్దరి ఆడ పిల్లల కళ్ళు వేదనతో వడలిపోయిన వాళ్ళమ్మ ముఖం ఇవన్నీ చూడ మని తగిన సహాయం చేయమని ఈ చేయే అర్థిస్తుంది. ఉహూ దూరంగ ఉండాలి.

తన బుజం మీదున్న రామచంద్రం చేయిని తీసేసు 'ఏమిటో నోయ్. ఈ కళ్ళ అద్దాలు బొత్తిగా పాడై పోయాయి. అన్నీ గీతలు పడి నట్టున్నాయి. ఇంట్లో నా వస్తువు అనే దానికి విలువలేదనుకో కేసు విరిగిపోయింది. అద్దాలు పాడైనాయి బాగు చేయించుకోవాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను. ఏది పెంషన్ డబ్బుతో చాల వద్దూ! ఇంట్లో ఖర్చులు, పై ఖర్చులు సరిపెట్టలేక సతమతమౌతున్నా ననుకో సంపాదించే కొడుకులున్నారన్న మాటేగాని జీతంరాళ్ళు ఇంటి దాకారావు. ఇదిగో చంద్రం చెప్తున్నాను విను. రిటైర్ అయ్యాక విలువ తగ్గిపోతుందనుకో ముసలివాడి ఖర్చులన్నీ దుబారా క్రింద లెక్క. ఇప్పుడు ఈయన కళ్ళజోడుకి పాతిక రూపాయలు దండుగ చేయడం ఎందుకు. ఏదో ఒకటి కాలక్షేపం చేయగూడదా! అనుకోవచ్చు. ఇంట్లోవాళ్ల అంతదాకా ఎందుకు! సాక్షాత్తు మా ఆవిడ ఏదీ నా ఇంటి ఇల్లాలు ఏమందో తెలుసా మొన్న! పండుగ వస్తుంది గదాని మీకు నాకు బట్టలు తెస్తారేమో ఆ పనిమాత్రం చేయకండి కోడళ్ళకి అబ్బా యిలకి పుట్టింటికి వస్తున్న అమ్మాయికి అల్లుడికి తీసుకురండి ముస లాళ్ళం మనకెందుకు! అని అంది అంటే ఏమిటన్నమాట! మా కోసం చేసే ఖర్చులన్నీ దండుగఖర్చులన్న మాటేగా! సంపాదించి బ్యాంక్ లో

దాచి పిల్లల కోసం ఉంచదగ్గవాణ్నేగాని అంటుకోస-చి తీసి వాడు కోతగ్గవాణ్ని మాత్రం కాదు! ఏమిటో చంద్రం ఎవడి బాధలు వాడివి రోలు వెళ్లి మద్దెంతో మొరపెట్టుకున్నట్టు-నా గొడవలు నీతో చెప్పు కోవడమేమిటిరే"

పార్కులో ప్రవేశించి సిమ్మెంటు బెంచీమీద కూర్చోనే వరకు చెప్తూనేవున్న వెంకటరత్నంగారు-రామచంద్రం ముఖంవైపు చూసేరు తన మాటలు ఎంతవరకు పని చేసిఉండవచ్చుననా అని అంచనా వేస్తూ.

ముప్పావుగంట సేపు హాయిగున్నారు,

గడ్డిమీద గెంతుతున్న పిల్లల్ని గేటుదగ్గర బఠానీలు, వల్లీలు అమ్మే కుర్రాళ్ళని చూస్తూ ఉభావంగ ఒకటి రెండు మాటలుమాత్రం మాట్లాడి ఊరుకున్న రామచంద్రాన్ని చూసి తృప్తిగా నిట్టూర్చేడు వెంకటరత్నంగారు.

అసలికి ఆ సమయంలో—'వైత్య రోగికి మందువేసిన డాక్టర్ గుర్తువచ్చిండు' గర్వంతో పైమీద ఉత్తరీయం సవరించుకుని భర్వాలేదు రామచంద్రం ఇప్పట్లో తనదగ్గర డబ్బు ప్రస్తావన లేదు'-అనుకున్నారు

తిరిగి ఇళ్ళకి బయల్దేరేక దారిలో రెండు రోడ్లు చీలేచోట లైటు స్థంభం క్రింద చిరిగిపోయిన గోనెపట్టా పరుచుకుని సినారేకు డబ్బా దానిమీద ఉంచి 'బాబు, ధర్మం అయ్యా ధర్మం! తలీ ఒక్క పైసా పుణ్యాత్ములు, ధర్మతల్లులు సిరిగల మారాజులు ఈ బీదముసలాడికి ఒక్కపైసా ధర్మం చేయండి బాబూ! అని గొంతు చించుకుని అరు స్తున్న గుడ్డివాణ్ని చూసి.

వెంకటరత్నంగారు రెండు అడుగులు పక్కగ తప్పుకుని 'చూసేవా చంద్రం -ఇదంతా ఒక వేషం! ఈ వెధవలంతా బోలెడు

మంది ఉంటారు ఈ ముసలాణ్ని ఇక్కడ కూర్చోపెట్టి వాళ్లు పనుల్లోకి పోతారు. పసివెధవల్ని ముసలాళ్ళని ఇలా సంపాదించేట్టుచేస్తారు. అంతా మోసం! చూడు ఇందాక ఆ డబ్బా ఖాళీగ వుందా! ఇప్పుడు సగందాకా చిల్లర డబ్బులే! గంపసేపట్లో ఎంత సంపాదన! కష్టపడే వాళ్ళకంటే వీళ్ళదే పైచేయి. ఛీ! దగాకోరు మనుష్యులు అందుకే నాకు అసహ్యం'. అని ఇంకాస్త పక్కకి తప్పుకుని పడిపడిగా ముందుకు సాగేరు.

ముష్టివాడు పక్క టెముకలు లోపలికి పోయేట్టు అరిచేడు. ఎవరైనా సైన్సు మేష్టారు ఆపక్కన ఉంటే కుర్రవెధవలకి అస్థి పంజరం చూపించి పాఠం చెప్పేసుకోగలడు.

రామచంద్రం సాహసించి జేబులో చేయిపెట్టేడు. కాని కాగితాలు తగిలేయి అవి అబ్బాయిచేత గవర్రాజుగారి బట్టల కొట్లో సగం డబ్బు ముట్టినట్టు రాయించి తెప్పించిన రసీదు కాగితం, అమ్మాయి వచ్చింది కాని బొత్తిగా మీరు కట్నం దగ్గర పేచీ పెట్టున్నారు కనుక మేము అమ్మాయి అందానికి ప్రాముఖ్యత నివ్వలేకపోతున్నామని తప్పిపోయిన వియ్యంకుడి ఉత్తరం పండుగకి తేవాల్సిన సరుకులు కొన్ని తగ్గించి స్పష్టంగా రాసి తన శ్రీమతి ఇచ్చిన లిస్టు కాగితం.

అన్ని జేబుల్లో కుక్కుకొని పేలవమైన నవ్వొకటి నవ్వి 'నా కంటే ప్రస్తుతం నీవే నయంరా అబ్బీ నీ డబ్బాలో కావాల్సినంత చిల్లరవుంది చూశావా? అనుకున్నారు. ముందుకు సాగి వెంకటరత్నం గార్ని కలుసుకున్నారు.

ధరలు మండిపోతున్నాయనీ, బ్రతుకులు దుర్భరమై పోయాయనీ రోజూ ఆనవాయితీ తప్పకుండా వాపోతూనే బట్టకొట్లలో డ్రింక్స్ దగ్గర ఫాన్సీ దుకాణంలో హోటల్స్‌లో జనం తండోప తండాలుగా నిలబడి రాజకీయాలు పంచవర్ష ప్రణాళికలు సినీతారల పట్ల విమర్శ

కొత్తగా స్థాపించబోయే కంపెనీ అభివృద్ధినిగురించి బొంబాయిలోగల పెద్ద హోటల్ మెడ్రాసులో సావిత్రి కొన్న లేక కొనబోయే కారుని గురించి రాజమండ్రిలో జరిగిన రచయిత్రుల సభని బెజవాడలో వేసంగల్లో అపారి ప్రజల ఇబ్బందులు హైదరాబాదులో జరుగుతున్న అఖిలభారత ఎగ్జిబిషన్ మీద రాబోయే ఎలక్షన్ల గురించి అందులో పోటీ చేయబోతున్న పెద్దమనుష్యులమీద, వాళ్ళు కట్టించుకున్న బంగారం పన్ను (నోటిలో) వెండి పళ్ళు క్రౌను గురించి వాళ్ళ పెంచుకుంటున్న సీమకుక్కపిల్ల తినే కోటా తిండిగురించి రకరకాల కబుర్లు చిలవలు పలవలుగా జలపాతాల హోరులా చెప్పేసుకుంటున్నారు. పెళ్ళివారి విడిది ఇంటిలో పెళ్ళికొడుకు చుట్టూ చేరి జోక్సువేసే మిత్రుల గోలగా వుంది బజాయింతా!

మిత్రులిద్దరూ సంతోషంగా ఇల్లు చేరేరు.

సుప్రభాతం పలికింది పండుగ ప్రతి ప్రాణికీ

ఆ రోజు—

రోజూ వుండే బాధలు, కష్టాలు మరిచిపోయి నవ్వు ముఖముతో లేచింది రామచంద్రపురి ఘాట్లు! ఇళ్ళు కడుక్కొని ముగ్గులు పెట్టి, పసుపురాసి గడపలకి తోరణాలు కట్టిన పిల్లల్ని జూచి ముచ్చటపడింది మీ అదృష్టం ఈ సంవత్సరం సంచేనాబాగుపడి తొందరగా సంబంధాలు కుదిరి పెళ్ళిళ్ళు కావాలని దీవించింది.

ఆ క్రిందటేడూ అలాగే దీవించింది!

అదే పండుగ గొప్పతనం!

వాళ్ళ విషయాన్ని మరపించేసి-ఇక ముందంతా ఆనందమే అన్నట్టు చేస్తుంది అందుకే పండుగలు ప్రజలపాలిటి పెన్నిధులు!!

వెంకటరత్నంగారు అభ్యంగ స్నానంచేసి సావధానంగా

పండుగ ఖర్చులన్నీ అందులో ఎన్నేసి దుబారా ఖర్చులున్నాయో! వివరంగా నోటు చేసికుంటున్నారు. అనక సమయం వచ్చినప్పుడు నల్గుర్ని దులిపేయాలని ఆయన ఉద్దేశం।

ఆయన దృష్టిలో పండగలన్నీ వృథాగా ఖర్చుపెట్టించేవని, బాకీలు వసూళ్ళు చేసుకునే 'అప్పులాళ్ళవంటివ'ని నమ్మకం.

భోజనం చేసి ఆయాసంగ కూర్చున్న వెంకటరత్నంగారు గదిలో డబ్బేసి పేకాడుకుంటున్న (సరదాగానే) కూతురు అల్లుణ్ణి చూసి మండిపడ్డారు.

సినీమా ప్రోగ్రాం పెట్టుకుంటున్న కోడళ్ళని గుర్రుగ చూసేరు పిండివంటలన్నీ డబ్బాలో నిలువచేస్తున్న భార్యని తిట్టుకున్నారు. మరొక వారం రోజులవి సరుకులన్నీ వృధాగా పాడుచేసింది కాని మధ్య మధ్య అప్పులనరును మాటలు గుర్తుకొస్తూనే ఉన్నాయి!-ఏమిటంటే అసలు జరిగిన సంగతి ఇది—

ఆ పండుగనాడు మరికొంతమందిని ఆయన తన తిట్లతో పావనం చేసేరు. దేశరక్షణ నిధికి బెనిఫిట్ షో పెట్టి బలవంతంగ తన చేత టికెట్టు కొనిపించిన కాలేజీ స్టూడెంట్లనీ, ఎదురింటి రామదాసు తన పిల్లాణ్ణి తీసుకొచ్చి ఒళ్లో పడుకొబెట్టి 'వాడికి ఇద్దరు తాతగార్లు లేరు మీరే తాతైనా అవ్వైనా! దీవించండి బాబాయ్' అన్నప్పుడు వంటింట్లో వున్న ఇల్లాలు గబగబా ఇవతలికి చక్కావచ్చి చింకిచాటంత ముఖంచేసుకుని మళ్ళీ ఏటికైనా మా ఇంట ఇలాంటి'రత్నం' వెలిసేట్టూ చేయి వెంకటరమణా అని రెండుచేతులు ఎత్తి దండంపెట్టి ఆపైన అయ్యో అదేమిటండీ? మనవణ్ణి ఒళ్లోపెట్టే అలా దిక్కులు చూస్తారూ! జేబులోనుంచి ఒక ఐదు రూపాయలు తీసి పెట్టండి అని హుకూం జారిచేసింది. వళ్ళుమండి పోతున్నా తప్పనిసరిగా పెట్టాల్సి వచ్చింది.

హి హి ఎందుకు పిన్నిగారూ! బాబాయని ఇబ్బంది పెట్టారూ అంటూనే పిల్లాణ్ణి ఐదు రూపాయల నోటుని భద్రంగ పట్టుకుని వెళుతున్న రామదాసుని నమలకుండా మింగాలన్నంతా కోపం వచ్చింది ఆ పైన భార్యని ఉరిమి చూడబోయేరు కాని ఆవిడ అప్పటికే ఇంట్లో కెళ్ళిపోయింది. సరిగ్గా అక్కడే గది గుమ్మంతో నించుని అల్లుడు గారు అమ్మాయిని, కోపంగా చూస్తున్నాడు-

'యు ఫూల్ చూడు! ఎలాంటి ఛాన్సు పోగొట్టేవో ఈపాటికి నీ చేతిలో అలాంటి 'రత్నం' ఒకడుంటే ఆ అయిదు. నాన్‌సెన్సు పదిరూపాయలు మనకి దక్కేవి గదా!' అన్నట్టు చూస్తున్నాడు.

వెంకటరత్నంగారికి తేళ్ళు జెర్రులు పాకినట్లయింది. రామదాసుని కసితీరా తిట్టుకున్నారు. ఆఖరికి అలసిపోయి కుర్చీలో కూర్చుండిపోయారు. కళ్ళు మూసుకుంటే తనచుట్టూ వీళ్ళంతా రాబందుల్లాగ, చింపిరి జుట్లు వేసుకుని కొరుక్కు తినేందుకు మీద మీదకి వస్తున్న దెయ్యాల్లాగ కనిపించేరు. ఛీ! దిక్కుమాలిన మనుష్యులు బ్రతికి ఉండగానే పీక్కు తింటున్నారు అని కళ్ళు తెరిచేసరికి ప్రత్యక్షదేవతలా నిలబడింది పనిచేసే అప్పనలరును.

దాని తలంతారేగి ముఖం మీదకి చెమట కారి ముందరి పళ్ళు రెండు ఒత్తుగ ముందుకు పొడుచుకుని వచ్చాయి! హి హి ఏటి బాబు ఫోంచేకుండ సిద్దరోతున్నారా! హి హి బాబు నాను ఇంటికెలాను ఈయాల పండుగ అనక గుడికెల్లాలి. సేతిలో పైసలేదు అమ్మగోరి నడిగితే మీకాడకెళ్ళమన్నారు. పండుగ బగుమానం రెండ్రూపాయలు ఇప్పించండి బాబు' అంటోంది. ''అవునవును అమ్మగారికి నీకు ఏం పని ఉంది? ఇక్కడేం సంచులు పోసుకుని కూర్చున్నానా అందరికి ధర్మాలు చేయడానికి? వెళ్ళు మీ అమ్మగార్నే అడుక్కో''- అని కసిరి కొట్టేరు.

పూనకం తగ్గేక కొబ్బరికాయ కొట్టి హారతి ఇచ్చినట్టూ!

తెలుసు బాబూ! కాని ఎంతైనా ఆయన పెద్దోడుగ దా అని ఆర్నే అడగాల. ఆరి చేతులమీదుగ ఇస్తే అందంగుంటాది మీరుఇయ్య నేక నాను అడగనేక కాదు। పెద్దోరి మరియాదా నిలపానీ''

ఆ తరువాత అప్పలనరుసు వెళ్ళిపోవటం కొడుకులు సణుగు కోవటం వంటింట్లో భార్య గొణగటం గదిలో అల్లుడు "ఫాదరిల్లా'ని విమర్శించటము అన్నీ చెవుల్లో పడుతూనేవున్నా అప్పలనరుసు అన్న ఒక్కమాట మాత్రం చెవిచుట్టూ 'గీ' మని రింగులా తిరుగుతోంది.

వెంకటరత్నం గారి ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నారు మనసంతా ఏదోలా అవుతోంది ఏదోలా ఆలోచనలు చుట్టుముట్టు తున్నాయి భోజనంచేసి కూర్చున్నా ఆ సంఘటన ఆ ఆలోచనలు వదలటంలేదు కళ్లు మూసుకుని మంచం మీద పడుకున్నారు.

నిద్రకూడా పట్టేసింది:

'నాన్నగారూ। నాన్నగారూ! లేవండి ఇదిగో ఇది తీసుకోండి" చేతిలో ప్యాకెట్టు మంచం మీద పెట్టేడు చిన్నకొడుకు.

నిద్రమత్తు వదిలి లేచికూర్చుని 'ఏమిట్రా ఇది' అన్నారు కళ్ళ జోడు పెట్టుకుంటూ.

'ఆ! ఏంలేదు పండుగనాడు మా కందరికీ బట్టలు తెచ్చి మీరు మానేసుకుంటారా నేను అన్నయ్య వెళ్ళి మీకు అమ్మకి బట్టలు తెచ్చాం లేచి కట్టుకోండి" అని గదిలోనుంచి వెళ్లిపోయేడు.

ఎదురుగ గోడలకి వున్న కాలెండర్లు ఫోటోలు కొత్తగా అప్పుడే తగిలించినట్లు కనబడ్డాయి. ఆయనకి ఆ ఇంటికి అప్పుడే కొత్తగ వచ్చి నట్టు భావించేరు.

''నాన్నగారూ। ఇంకా లేవలేదా? రామచంద్రంగారు వచ్చారు అని పెద్ద కొడుకు బయటనుంచి కేకవేసేడు.

'ఆ ఆ వస్తున్నా' అంటూ మంచం దిగివెళ్ళి కాళ్లు చేతులు ముఖం కడుక్కుని వచ్చాడు. కొత్తబట్టలు కట్టుకుని కుర్చీలో కూర్చున్న రామచంద్రంగారు కాఫీగ్లాసు అందుకుని 'రావోయ్' నీ కోసమే చూస్తున్నాను' అన్నారు.

ఆనందానికి ప్రతినిధిలా గరళాన్ని మింగి నవ్వుతున్న పరమ శివునిలా పాలకడలిలో పవ్వళించిన శేషశాయిలా అనేక రూపాల్లో కనిపించారు. రామచంద్రంగారు వెంకటరత్నం గారు కూడా పక్క కుర్చీలో కూర్చుని కాఫీగ్లాసు అందుకున్నారు ఏవేవో మాట్లాడేస్తు తెగసంబరంగ కనిపిస్తున్న రామచంద్రంగారు కాఫీ పూర్తి చేసి గ్లాసు క్రింద పెట్టూ 'ఏవోయ్ రత్నం ఓసారిలా బయటికి రాగలవా!' అని అడిగేరు.

'అప్పుడే బయటికి వెళ్లే టైము కాలేదు. మరి ఎందుకో అర్ధం కాక బహుశా ఏవైనా ఆర్థిక ఇబ్బంది గురించేమో అనుకున్నా కనీసం అలాంటి ఛాయలేమీ కనిపించడంలేదూ!' ఎందుకో సరేలే అనుకుని 'పద వస్తున్నా' అని లోపలికి వెళ్ళి వావుగంటలో కొత్త బట్టలు వేసుకుని బయటికి వచ్చారు.

చెప్పులు వేసుకుని మెట్లు దిగుతూ కించిత్ గర్వంతో ''మా అబ్బాయిలు తెచ్చారోయ్' అన్నారు. రామచంద్రంగారు చిన్నగా నవ్వి తెలుస్తూనే వుంది. నువ్వు అయితే ఇంత ఖరీదువి కొనుక్కోగలవా.' అన్నారు.

వెంకటరత్నంగారు చిన్నబుచ్చుకున్నారు.

మిత్రుడి భుజంమీద ఆప్యాయంగ చరిచి అదికాదోయ్! అందరికి అన్ని తెస్తావు గాని నీకోసం ఏమీ చూసుకోవు. కష్టపడతావు నిజమే కాని అది అందరూ గుర్తించాలని ఆరాటపడతావు ఒక విధంగా నువ్వు నిస్వార్థపరుడివి. అయితే నీలాగే ఉండాలని కోరటం అంత సబబుకాదు.

'జీవితం చాలా అమూల్యమైనదోయ్ అనుభవాలే మనిషి తుది ఘడియలవరకు అనుక్షణం నీడలా నిలచి క్రొత్త ప్రపంచాన్ని అసలు జీవితానికి అర్థాన్ని తెలియచేసేవి.

ఏ అనుభవం లేకుండా ఎండిపోయిన చెట్టులా చుట్టూ ఒక పరిధి గీసుకుని అందులోనే కూర్చునే మనిషికి విలువేమిటీ? జాలి, కరుణ, క్షమా, ఆత్మీయత అణువణువునా వూటలా వూరినప్పుడే వాడు నిజమైన మనిషి—మనిషి కాగలుగుతాడు ఇవన్నీ అంతర్వాహినిలా ఉన్నప్పుడే వాడు అసలైన ధనవంతుడు కాగల్గుతాడు కాని, వాటినన్నిటికి ఎప్పటికప్పుడు అనకట్టలు కట్టి అడ్డుగోడలు బిగిస్తే డబ్బు ఉండీ లేనివాడన్నమాట ఆత్మీయులకు, స్నేహితులకీ బంధుజనానికి దూరమైపోయి పోరాడిన జీవితం అనుభవిస్తాడు.

'సరే సరే అదంతా ఎందుకులే గాని ఇప్పుడు నిన్ను ఎందుకు రమ్మన్నానో తెలుసా? ఇవాళ ఒక మంచి పని చేయాలని బుద్ధి పుట్టింది- ఏంలేదులే—ఈ పండగపూట స్నేహితుడైన నీకు కొత్త కళ్ళజోడు కొనివ్వాలని అది కలకాలం మన స్నేహానికి చిహ్నంగ నిలవాలనీ నాకోరిక. అదిగో అలా వెళ్లబోకు పూర్తిగా విను నాకు తెలుసున్న డాక్టర్ దగ్గరకి వెళ్లేను. నీజోడు పరీక్ష చేసి ఆ అద్దాలు అవసరమైతే మార్చేసి కొత్త కళ్ళజోడు ఇస్తానన్నాడు నేను నిన్ననే అడ్వాన్సు ఇచ్చేసేను. ఈ ఒక్క మంచి పని నన్ను చేయనీయవోయ్ నువ్వు కొనుక్కోగలవు లేదా మీ అబ్బాయి కొనివ్వగలరు కాని నాకు తృప్తి కాదుగా!. ఇంక నాస్థితి అంటావా స్నేహితుడికోసం పాతిక రూపాయలు ఖర్చుపెట్టగల ఆనందం కోటిరూపాయల సంపాదనకి సమానం.

'నా ఈ ఆనందాన్ని కాదనకోయ్ ఈబీద స్నేహితుని ఈకోరెక్క తీర్చు" 'చంద్రం"!! వెంకటరత్నంగారు అంతకంటే ఎక్కువ మాట్లాడే స్థితిలో లేరు ఉద్వేగం తనమీద తనకే జాలి బాధ అసహనం

ఇలాంటి అనేక లక్షణాలు ఒక్కసారి పెల్లుబికి లావాలా పొంగి కొన్ని నిముషాల తరువాత చల్లారి సరికొత్త జీవితం కనిపించసాగింది వెంకటరత్నం గారిక్క.

ఆ రోజు సాయంత్రం ఆయన షికారుకి వెళ్ళలేదు.

రామచంద్రంగారు గుడికి వెళ్ళినా ఆయనతో కలిసి వెళ్ళలేదు వెంకటరత్నంగారు స్నేహితుడిచ్చిన కళ్ళజోడు పెట్టుకుని కొడుకులు కొన్న కొత్త బట్టలు కట్టుకుని వడివడిగ పెద్దబజారుకు వెళ్ళేరు.

అక్కడ రెండు రోజుల్లు చీలే చోట లైటు స్తంభంక్రింద గోనె పట్టా పరుచుకుని కూర్చునే ముష్టివాడికోసం వెళ్ళేరు! ఆ రోజు ఆ మంచి పని చేయాలని మనసు తొందర చేసింది.

కానీ ఆరోజు ఆ ముష్టివాడు అక్కడ లేడు.

వెంకటరత్నంగారు కళ్ళజోడు తీసి నాల్గుమూలలా కలయ చూసేరు! ఉహూ వాడు కాదు కదా మరొక బిచ్చగాడెవడూ అక్కడ ఆ చుట్టు పట్లలో లేరు.

వెంకటరత్నంగారి కళ్ళల్లో అప్రయత్నంగా నీళ్ళు చిప్పిల్లేయి?



# 'తరం మారింది'

(వనిత మాసపత్రికలో ప్రచురించబడింది కథ.)

త్రివిక్రమరావుగారు చాలా అలసిపోయారు. పెళ్ళి సంబంధాలు చూడటం అంటే మాటలా, అందచందాలు, గుణ గణాలు నచ్చితే...కట్నం దగ్గర తూకం కుదిరేదికాదు. కట్నం సమ్మతమైతే, మిగతా లాంఛనాల దగ్గర తేడాలు, భేదాలు మొలకెత్తేవి,

నాలుగైదు సంవత్సరాలు తెగ తిరిగి చాలా అలసిపోయాక-- మరొక సంబంధం చూడవలసిన అవసరం కల్గింది!

అయితే ఆయన పెళ్ళి సంబంధాలు చూస్తున్నది ఆడపిల్లల కోసం కాదు. ఏకైక పుత్రుడు నాలుగు సంవత్సరాల క్రితమే ఎమ్. ఎస్.సి. పాసై ఇంకా ఉద్యోగం దొరకని 'రవిచంద్ర' కోసం తగిన సంబంధం చూస్తున్నారు ఆడపిల్ల తండ్రులకన్నా ఎక్కువ కష్టపడు తున్న త్రివిక్రమరావుగారు ఒక తరం వెనుక పుట్టి, ఈ తరంలో జీవిస్తూ-'సమాజంలో తమచుట్టు స్వార్థపు గోడలు కట్టుకొని ఆశల తలుపులు తెరచుకొని నించునే పెద్దమనుషులకు' ప్రతినిధిలాంటివారు.

ఒక్కగానొక్క కొడుకైన రవిచంద్రని ఎమ్ ఎస్.సి. చేసి

అతని చదువుకోసం పెట్టిన డబ్బుకి రెట్టింపుకంటే ఎక్కువ లాగాలన్న తాపత్రయంలో కొడుకుని 'పెళ్ళి మార్కెట్'లో అమ్మకానికి పెట్టేరు నాలుగైదు సంవత్సరాల నుంచి సరైన ధర పలకటం లేదని ఎంత మందినో చూసి తెగ అలసిపోయిన సమయంలో మరొక సంబంధం తెలిసింది।

ఆ రోజు రవిచంద్రని తీసుకుని త్రివిక్రమరావుగారు ఆడపిల్ల ఉన్నవారింటికి బయలుదేరారు.

* * * *

వినయమణి రెండు సంవత్సరాలక్రితం బి.యస్.సి. ప్యాసై ఒక కంపెనీలో జాబు చేస్తోంది. తన చదువుకోసం తండ్రి ఎంత కష్టపడ్డాడో...ఇంకా తన తర్వాత ఉన్న తమ్ముళ్ళ కోసం, చెల్లెళ్ళ కోసం ఇంకా ఎంత బాధపడాలో ఆమెకు బాగా తెలుసు! అందుకే కొన్నాళ్ళవరకు తన వివాహ విషయం వెనక్కినెట్టి-ఉద్యోగం చేసి తండ్రికి ఆసరా యిస్తోంది! అది తన బాధ్యతగా. ఆ బాధ్యతా నిర్వ హణలో సంతృప్తిగా ఊపిరి పీల్చుకుంటోంది!

ఇంట్లో వాళ్ళు తన వివాహ విషయమై చర్చించుకుంటున్నప్పు డల్లా మనసులో ఆమె మూగవేదన అనుభవించేది.

ఆ సంభాషణలో తప్పనిసరిగా దొర్లే 'కట్నం' అన్న పదం... కర్ణ కఠోరంగా వినిపించేది వినయమణికి.

ఎన్ని వింతలు జరుగుతున్నా ఎన్నెసి మార్పులు వస్తున్నా, ఎంతమంది విద్యాధికులు వున్నా సంఘంలో పేరుకుపోయిన ఈ 'దుమ్ము' ఎందుకు దులపలేకపోతున్నారా? అని మథనపడేది. పురుషు లతో సమంగా స్త్రీలు చదువుతున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. సంపాదిస్తున్నారు. ఇంకా అదనంగా గృహ నిర్వహణ, పిల్లల ఆలనా పాలనా, ఆడవా తడపా టైలరింగ్ పని, చాకలిపని, దాసీపని... ఇత్యాది చిల్లర పనులన్నీ, పురుషునికన్నా స్త్రీయే నిర్వహిస్తుంది। కాని

ఆమెకు ఎందుకని సమాజంలో ఈ రకమైన 'శిక్ష' విధించేరో అర్థం కావటంలేదు. ఒకప్పటి 'కన్యాశుల్కం' ఈనాటికి 'వరకట్నం'మై పిశాచంలా బాధిస్తోంది.

మనిషికీ మనిషికీ మధ్య ఉండాల్సిన మమత, ప్రేమ, అనురాగం ..ఈ డబ్బు మూటలో నలిగిపోయి, బ్రతుకు ఒక వ్యాపారం లాగా మారిపోయి మానవ జీవితాలకు అర్థం లేకుండా పోతోంది.

ఈ రకమైన ఆలోచనలు—వినయమణి ఏకాంతానికి భంగం కలిగిస్తూ వుంటాయి! ఒక్కొక్కప్పుడు వెర్రి ఉద్రేకం కలిగి 'ఈ దురన్యాయాన్ని ఎదుర్కోవాలి!' అని నిర్ణయం చేసుకుంటుంది।

అయితే సదాచారాలకి, సమాజ పరిస్థితులకు, తలవంచి నడిచే తల్లిదండ్రులను, వాదించి ఒప్పించలేక-సమయం వచ్చినప్పుడే ప్రతిఘటించవచ్చని మౌనంగా మిగిలిపోయేది.

* * * *

ఆరోజు త్రివిక్రమరావుగారు, రవిచంద్ర-దామోదరంగారింటికి పెళ్లి చూపులకి వచ్చారు-

సాదరంగా ఆహ్వానించి మర్యాదలన్నీ జరిపాక "అమ్మా మణీ ఇలారామ్మా' అన్న తండ్రి పిలుపు విని...వినయమణి మెల్లగా వచ్చి తండ్రి పక్కనే కుర్చీలో కూర్చుంది.

రవిచంద్ర ..నిటారుగా కూర్చుని, కాలర్ కొద్దిగా పైకిఎత్తి పెళ్ళికొడుకు హోదాలో చూసాడు వినయమణిని

సన్నగ, పొడుగ్గా చామన ఛాయతో—సింపుల్‌గ వున్నప్పటికి గంభీరంగ నిండైన వ్యక్తిత్వంతో కూర్చున్న వినయమణిలో ఎన్నేసి భావాలు తొణికిసలాడుతున్నాయో-ఎందరు ఆడపిల్లల హృదయ ఘోషలకు నిదర్శనంగా కూర్చుందో రవిచంద్రకి తెలియదు కనీసం ఊహించలేడు ఎందుకంటే అతనికి అక్కచెల్లెళ్ళు లేరు! అందుచేత

తండ్రి తనను అమ్ముకుంటున్నాడన్న అర్థం గుర్తు చేసుకోకుండా తను ఎంత విలువైనవాడో- తెలుసుకోండన్న ధోరణిలో దర్జాగ చూస్తున్నాడు

వినయమణి ఒకసారి ఓరగ అబ్బాయిని వీక్షించింది! వాళ్ళ నాన్నకి డబ్బాశ ఎక్కువట। తన తండ్రి—వాళ్ళు కోరినంత ఇవ్వ గలడా? అయితే ఉద్యోగం చేస్తున్నందుకు ఏమైనా 'కన్సెషన్' చూపిస్తారేమో? తన ఆలోచనలకి మనసులోనే నవ్వుకుని అపక్కనే కూర్చున్న త్రివిక్రమరావుగార్ని చూసింది.

అర్థ నిమీలిత నేత్రాలతో అమ్మాయిని కాపించడా, అమ్మాయి ద్వారా రాబట్టుకోగల్గే 'డబ్బు'ను అంచనా కట్టేస్తూ సాలోచనగ చూస్తున్నారు. 'నెలకి మూడువందల ఏనభై రూపాయలంటే, ఏడాదికి నాల్గువేల ఐదువందల రూపాయల పైన అదా అన్నమాట! సరే కట్నం ఉండనే వుంటుంది' అనుకున్నారు.

పేరు దగ్గరనుంచి అభిరుచులవరకు సంప్రదాయ ధోరణిలో సాగి పోయాయి సంభాషణలన్నీ, ఆ తర్వాతనే మొదలైంది అసలు నాటకం అమ్మాయిని లోపలికి పంపించి పెద్దలిద్దరు వరండాలోకి కుర్చీలు మార్చుకున్నాక మధ్యవర్తుల ప్రమేయం లేకుండా ముఖాముఖి మొద లేట్టేరు త్రివిక్రమరావుగారు.

'అబ్బాయికి పదిహేనువేలు ఇస్తామని, నాల్గు సంబంధాలు వచ్చాయి అయితే అమ్మాయి మాకు నచ్చలేదు. ఇప్పుడు అమ్మాయి నచ్చిందన్న సంగతి మావాడి ముఖం చూస్తేనే తెలుస్తుంది. సరే పది వేలకి తగ్గడం మాకు నామోషీయే అయినా సరే ఏదో అమ్మాయి ఉద్యోగం చేస్తోంది గదా అని మేము సరిపెట్టుకుంటున్నాము. మా కున్నవాడు ఒక్కగా నొక్కడు! మాకున్నదంతా వాడికేకదా, నిజానికి మీ అమ్మాయి అదృష్టవంతురాలే అనుకోవచ్చును..."

దామోదరంగారు పేలవంగ నవ్వి 'అదృష్టం అనుకున్నంత

అందుబాటులో లేదండి మాకు. మీరు కోరినట్లు పదివేలు ఇచ్చుకో లేనండి. అనువేలైతే ఎలాగైనా ఇస్తాను. అమ్మాయికి ఏదో చిన్న గొలుసు, గాజుల జత ఉన్నాయనుకోండి. కొద్దో గొప్పో వాళ్ళ సంసారానికి పనికి వచ్చే సామాన్లు కూడా పెట్టాం. ఆ తర్వాత మీరనుకున్నట్టు ఉద్యోగం చేస్తూనే ఉందిగదా। ఇదే మొదటిపిల్ల గనుక ఈ మాత్రానికైనా సాహసిస్తున్నాను. ఇంకా పిల్లలున్నారు. అందు చేత మీరు సమ్మతిస్తే అప్పుడు నిజంగానే అమ్మాయి మేము కూడా అదృష్టవంతులమే అవుతాం।' అంటూ ప్రాధేయ పడ్డారు.

త్రివిక్రమరావుగారు ఆడపిల్లల్లేని మగపిల్లాడి తండ్రి గనుక గంభీరంగ కొంత వ్యంగ్యంగ నవ్వి 'మీరన్నట్టుగ అదృష్టం అంత తొందరగ అందదులెండి. మేము పదివేలకి తగ్గడమంటే మాకై మేము 'మీకు అదృష్టాన్ని అందించబోతున్నట్టు। కాని మీరు అంతా కూడా ఇచ్చుకోలేమంటే ఇంకేం చెప్పను!' అన్నారు.

'అలా అనకండి' ఆడపిల్లలు గలవాణ్ని. మీరు కొంచం ఆలోచించండి, అమ్మాయి నచ్చిన తరువాత...సంపాదిస్తున్న తరువాత నాల్గువేల దగ్గర మీరు నిరాకరించకండి. అసలు అమ్మాయికి పెట్టే బంగారం రెండువేల ఖరీదు ఉండనే వుంది. మరొక రెండువేలకి పాత్రలు. ఫర్నిచర్ లాంటివి సరిపోతాయి.'

త్రివిక్రమరావుగారు కనుబొమ్మలు ముడిచేసి ఏదో ఆలోచనలో పడ్డారు. దామోదరంగారు చేతులుపట్టుకోడం మినహాగ, వప్పించబోతున్నారు. అవతల హాల్లో రవిచంద్ర ఎదురుగ కూర్చున్న వినయిమణి తమ్ముళ్ళతో ఏదో మాట్లాడుతున్నాడు.

వినయమణి వరండాకి ఆనుకున్న గదిలో తలుపు ప్రక్కగ చెవులు రిక్కబొడుచుకుని--ఆ పెద్ద మనుష్యులు మాట్లాడుతున్న కట్నం విషయం వింటోంది। ఆమెకి సహనం తగ్గిపోతోంది. తండ్రి బ్రతిమాలడం, అవతల మనిషి కచ్చితంగా 'రేటు' నిర్ణయించడం

బాధగ వెగటుగ సంతలో బేర లా కంపరం పుట్టోంది, ఆమె కళ్ళు ఎర్ర బారుతున్నాయి. ముక్కుపుటాలు అదురుతున్నాయి! తన వ్యక్తిత్వానికి సవాల్‌గ అనిపిస్తోంది! ఆ సమయంలో తల్లి లోపల పనిలో వుంది. ఆమె కనుక కూతురు, తలుపుపక్కన నించుని అవతలవాళ్ళ మాటలు వింటూందని పసిగడ్తే అక్కడ్నుంచి తీసుకేళ్లేది.

పది నిముషాల తర్వాత త్రివిక్రమరావుగారు ఒక నిశ్చయానికి వచ్చి 'సరే మీరన్నట్టుగ ఆరువేలు ఇచ్చి ఈనాటి నుంచి అమ్మాయి నెలజీతం బాంకిలో వేసి వివాహకాలం నాటికి ఆ మొత్తం మాకంద చేయండి!' అన్నారు ఎంతో ఉదారం . .

దామోదరంగారు తెల్లబోయి...తేరుకుని 'అలా అంటే ఎలాగండీ? వివాహం అయ్యాక అప్పుడు అమ్మాయి మీ స్వంతం। ఆమె సంపాదన మీ ఇష్టం। ఇంకా పెళ్ళి కాకుండా ఈ హక్కు నిర్ణయిస్తే నాకు కొంచెం ఇబ్బందిగా వుంటుంది గదా?' అన్నారు.

'బాగుంది! మీరిలా అన్నిటికీ మడత పేచీలు పెడితే కుదరదు! ఉద్యోగంలో చేరినప్పట్నుంచీ మీరే తీసుకుంటున్నారు గదా? ఇప్పటికి ఆ మొత్తం పదివేలు అవుతుందేమో గదా? ఆ లెక్కన పదివేలు ఇచ్చారా మంచిదే! లేదంటే ఈనాటి నుంచి ఆమె సంపాదనంతా దాచి ముహూర్త సమయానికి, మీరిచ్చే ఆరువేలతో కలిపి అందచేయండి. అలాగైతేనే ఈ సంబంధం ఖాయం అవుతుంది ఆ తర్వాత మీ ఇష్టం!' నిర్మొహమాటంగా అనేసేరు.

దామోదరంగారు తలొకసారి తడుముకుంటూ 'నాకు కొంచెం టైమివ్వండి. ఆలోచించుకుని మీకు కబురు చేస్తాను. అంతవరకు తొందరపడి మరొక సంబంధం చూడకండి!" అన్నారు దీనంగా.

'సరే పదండి' అని హాల్లోకి నడిచారు. త్రివిక్రమరావుగారు- ఆ వెనకాలే దామోదరంగారు వచ్చారు.

ఇటు గదిలోనుంచిసుడిగాలిలా దూసుకునివచ్చింది వినయమణి 'చూడండి!' అన్నాడు గంభీరంగా.

హాల్లో అంతా ఒక్కసారి గడపవైపు చూసేరు. లోపల్నుంచి తల్లి కూడా వచ్చి అయోమయంగా చూసింది.

'మా నాన్నగారు ఆలోచించుకుని చెప్తానన్నారు కాని అవసరం లేదు. నాకన్నీ వినిపించేయి!'

'అమ్మా మణీ! నువు లోపలికి వెళ్ళమ్మా!' కూతురి మాటల్ని మధ్యలోనే అడ్డుకుంటూ కంగారుగా అన్నారు దామోదరంగారు 'మణీ! ఇలా లోపలికి రా!' అంటూ చేయి పట్టుకుంది,

వినయమణి మృదువుగ తల్లి చేయి విడిపించుకుని 'ఉండమ్మా! నేను చిన్నపిల్లనా? భవిష్యత్తుని బాధలు పాలు చేసుకోగలనా?' అని త్రివిక్రమరావుగారివైపు తిరిగి 'చూడండి నా సంపాదన నా హక్కు నయాపైసలతో సహా దాచి మీ చేతుల్లో పెట్టవలసిన రూలెక్కణ్ణుంచి వచ్చింది? ఇంతకుముందు నుంచి చేస్తున్న సంపాదన ఈ క్షణం నుంచీ ఇకివ్వాలని అడుగుతున్నారా? పైగా రెండు సంవత్సరాల రాబడి నాన్నగారు తీసుకున్నారు గదా అంటున్నారు. అవును. తీసుకుంటారు. తీసుకోవాలి! ఆ హక్కు ఆయనకి వుంది! పుట్టినప్పట్నుంచీ పెంచి పెద్దచేసి చదువు చెప్పించిన తల్లిదండ్రులకు ఎంతిస్తే ఋణం తీరుతుంది? రేపు మీ అబ్బాయికి ఉద్యోగం వస్తే మీరు ఆశించరా?' ఆవేశంగ అడుగుతున్న వినయమణిని తండ్రి కోపంగా చూసి 'మణీ ఏమిటీ పిచ్చి? వారేం తప్పుగా అడగలేదు. నువ్వనవసరంగా మాట్లాడకు వెళ్ళు లోపలికి!' అని మందలించబోయారు. తల్లి కూడా ఏదో చెప్పబోయింది. కాని వినయమణి వినిపించుకోలేదు.

'అనవసరం కాదు నాన్నగారు. అవసరమే! కష్టపడి చదువు చెప్పింది మీరు ..ఉద్యోగంలో చేరినపట్నుంచీ లెక్కవేసి వారికి రావాలనుకోడం ఎంత అన్యాయం? అయితే చిన్నప్పట్నుంచీ పెంచి

పెద్దచేసినందుకు మీకెంత ఖర్చు అయ్యిందో అదంతా వాళ్లు ఇస్తారా? వాళ్ళబ్బాయికైతే—ఆ ఖర్చులన్నీ రాబట్టుకోవాలనుకుంటారా?— ఇంకా వివాహము కాకముందే ఇన్ని షరతులు పెట్టుంటే ఆ తర్వాత ఇంకెలా చెప్తారో' వద్దు నాన్నా నాకిష్టంలేదు! డబ్బు మనుష్యులతో ఇంత బేరసారాలతో, ఈ వివాహ వ్యవస్థ ఇలా ఉండబట్టే దేశం ఇలా ఏడుస్తోంది!'' అంటూ వాడిగ రవిచంద్రను చూసింది.

అతను నిటారుగ నిల్చుని కోపంగా చూస్తున్నాడేగానీ ఏం మాట్లాడలేకపోతున్నాడు. త్రివిక్రమరావుగారు విసుగుగా ఉత్తరీయం విదుల్చుకుని—'ఏమిటమ్మా మహా చెప్తున్నావ్! దేశంమీద లేని విషయం ఏమీ మేము అడగలేదు. చచ్చి పడివేలకి తూగలేని నీ సంబంధము చూడ్డం మాదే బుద్ధి తక్కువ! పదిహేను, ఇరవై వేలు ఇస్తామంటున్నారు. ఆస్తి, చదువు ఊరికే వస్తాయా? మగపిల్లాడు పోషించాలి గదా? ఎన్నెన్ని బాధ్యతలు బరువులు వాడు మొయ్యాలి!'' అంటూ ఉత్తరీయము భుజం మీద వేసుకున్నాడు.

''అలా ఎందుకనుకుంటున్నారు? ఉద్యోగము చేస్తున్న భార్య సగం బాధ్యతలు మోయకుండా వుంటుందా? ఇంతకీ మీ అబ్బాయికి ఇంకా ఉద్యోగము దొరకనే లేదుకదా? అంతవరకు నా సంపాదన మీదే ఆధారపడాలేమో?''—వినయమణి వ్యంగ్యానికి తల్లితండ్రులకే కాకుండా రవిచంద్రకి కూడా కోపము, పౌరుషం, తన్నుకొచ్చి ఒక్క ఊపులో వీధిమెట్ల దగ్గరకెళ్లి ''థాంక్స్! మీ అనుమానం వెలిబుచ్చి మమ్మల్ని బ్రతికించేరు. నాకంత దురదృష్టం అక్కర్లేదు జాబు దొరికేవరకు తింటూ కూర్చోగల స్తోమతు మాకుంది మీకూ మీ సంపాదనకి గుడ్‌బై! పదండి నాన్నా! ఈ గడప తొక్కడం మన తెలివి తక్కువ తనం' అన్నాడు క్రాపు ఎగరేసుకుంటూ.

'మిష్టర్ చంద్రగారూ!' అన్న వినయమణి ఉగ్రరూపాన్ని చూసి, తల్లి—కూతురు చేయి పట్టుకుని ఇంట్లోకి లాక్కెళ్ళింది!

దామోదరంగారు కూతుర్ని 'ఫో లోపలికి!' అని కసిరి 'బాబూ! అమ్మాయి తొందరపడింది. ఏమనుకోకండి ' ఇంకా సర్ది చెప్పబో తుంటే 'చాల్లేవయ్యా! గొప్ప కూతురు నీకే వుంది! బోడి చదువు! బోడి ఉద్యోగం! ప్రపంచంలో మీ అమ్మాయి ఒక్కర్తే చదువుకుని సంపాదిస్తున్నట్టు మాట్లాడుతోంది. ఇంతకన్నా కొమ్ములు తిరిగినవాళ్లే తలలు వంచేరు!— గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్టు—ఈ నాటికి ఈ అదృష్టమూర్తి నాకు చెప్ప వచ్చిందా? పిల్లని అంత కంట్రోల్ చేసుకోలేనివాడివి పెళ్ళిచూపులెందుకు జరిపినట్టు! కూర్చోమను ఆద ర్శాలు వల్లిస్తూ!' త్రివిక్రమరావుగారు పెద పెద్దగా అంగలేసు కుంటూ వీధిలో కెళ్ళిపోయారు. అంతకుముందే రవిచంద్ర మెట్లు దిగేసు.

తండ్రి, కొడుకు గబగబా వెళిపోతుంటే బొమ్మలా నిలబడి పోయిన దామోదరంగారు...కొంచం సేపటికి తెప్పరిల్లి—తనను గమ నిస్తున్న ఇరుగు పొరుగు వార్ని చూసి—త్వరగా ఇంట్లో కెళ్ళిపోయారు.

కన్నీటితో తలగడ, తడిసిపోయింది! కిటికీలోనుంచి సాయం కాలపు ఎండ మంచంమీద పడుతోంది. వినయమణి బోర్లా పడుకుని రెండు చేతులు గడ్డం క్రింద పెట్టుకుని దీర్ఘంగా ఆలోచిస్తుంది! కన్నీళ్ళు చెంపలమీదుగా జారుతూ జాడలు మిగిల్చి జారుతున్నాయి. భోజనము చెయ్యాలని నీరసం కూడా ఆమెను ఆవరించలేదు! తల్లి తండ్రీ తమ తిట్లతో కడుపు నింపేసేరు. ఆ కడుపుబ్బరమే ఇప్పుడు బాధిస్తుంది. 'పెళ్ళి సంబంధాలన్నీ తప్పిపోతున్నాయట. నలుగురికి తెలిస్తే ఇంక తనకు ఈ జన్మలో పెళ్ళి లేదట! పీడాపోయింది ఇప్పుడు చేసుకున్న వాళ్ళంతా మహా సుఖపడుతున్నారు గనుకనా? తనకి చదువు చెప్పించటము పెద్ద తప్పై పోయిందా! ఏనాల్గో క్లాసు తోటే మాన్పించి చిన్నప్పుడే పెళ్లి చేస్తే బ్రతికిపోవునట. కాదుమరి? ఈపాటికి మూడు పురుళ్ళుపోసి అప్పుల్లో ఉండి అల్లుడి అలకలు తీరుస్తూ

ఉందురు. దిక్కుమాలిన చదువుతో పొగరెక్కిపోయానా? ఎంత పిచ్చి వాళ్ళమ్మా మీరు? ఆ చదువు దిక్కుమాలినది కాదమ్మా. దిక్కు చూపించేది, నేను పొగరెక్కలేదమ్మా. వివేకం, విజ్ఞత తెచ్చుకున్నాను. నన్ను కన్నవాళ్ళకి చేదోడై వాళ్ళని సుఖపెట్టాలని తాపత్రయపడుతున్నాను. నా మూలంగా నా వాళ్ళు హీనస్థితికి దిగజారకూడదని-ఈ మూఢాచారాలని ఎదిరిస్తున్నాను. నేనేకాదు నాలాంటి ప్రతి ఆడపిల్ల ఈ అన్యాయానికి ఎదురు నిలవాలని-ఈనాడు సాగుతున్న ఈ 'గొడ్ల బేరాలు' ఆపేయాలని అహోరాత్రులు ఆరాటపడుతున్నాను. ప్రతి అమ్మాయి చదువుకుని స్వతంత్రంగ బ్రతకగలిగి నాలాగే దౌర్జన్యాన్ని సవాల్ చేసే రోజు రావాలి. వస్తుంది. తప్పకుండా వస్తుంది. ఆదిమానవుడు నాగరికత నేర్చుకుని.. మితిమీరి మళ్ళీ అనాగరికుడై పోతుంటే మళ్ళీ కాలం మార్చదా. మారుస్తుంది. అది ఈ తరంలోనే జరుగుతుంది, జరగాలి లేకపోతే నిజంగానే ఈ చదువులన్నీ వృధా.

'అక్షరం ముక్కరానిది, ఆనాటి ఆడది; ఈనాడు ఇన్ని రంగాల్లో ప్రతిభావంతురాలై రాణిస్తూఉంటే ..ఇంకా ఆడపిల్ల పెళ్ళికి తలలు పట్టుకునే తల్లిదండ్రుల దుస్థితిని ఏమనుకోవాలి. ఇచ్చేవాళ్ళకి మతిలేక, పుచ్చుకునేవాళ్ళకి బుద్ధిలేక అనుకోవచ్చును. కానీ ఇవ్వలేనివాళ్ళ దగ్గర గుంజేవాళ్ళని ఎదిరించాలిగదా? ఆనాడు ఆడపిల్లలకి మనోధైర్యం,..ఆర్థిక బల లేక నోరు మూసుకున్నారు. కానీ ఈనాడు ఆ రెండు పొందగలిగినప్పుడు ఇంకేం కావాలి? అందుకే నాకు ఈ ఆవేదన కానీ పెద్దవాళ్ళు ఇలా అడ్డుతగిలి వెనక్కి లాగేస్తుంటే ఏడవాల్సి వస్తుంది. తరం—మారినా తత్వాలు మారకపోతే ఇదిగో నాలాగే ఇంట్లో యుద్ధాలు చేయాల్సి వస్తుంది. ఫర్వాలేదు గెలుపొందేవరకు వెనుతిరగను...తిట్టనీ, పెళ్ళి కాకపోయినా బెంగలేదుగానీ ఇలాంటి గొంతులు కోసే పెళ్ళి మాత్రం చేసుకోను.

వినయమణి చివాలునలేచి చీర చెరుగుతో చెంపలు తుడుచుకుంది. జడ ముందుకు వేసుకుని వాయలు సరిగా అల్లుకుని వెనక్కి పడేసింది,

'అక్కా.' తలుపుమీద చిన్న చెల్లి కొట్టింది.

రెండు నిముషాలాగి మళ్ళీ కొట్టింది. వినయమణి మెల్లగాలేచి తలుపు తెరిచింది. ఒక గ్లాసులో నీళ్ళు ఒక ప్లేట్లో ఉప్మా—రెండు చేతుల్లో పట్టుకుని నిల్చుంది. పన్నెండేళ్ళ చెల్లి రమణి.

'తీసుకో అక్కా, నువ్వివ్వాళ అన్నం కూడా తినలేదు' అంది ప్రేమగ. మౌనంగా లోపలికి నడిచింది వినయమణి.

వెనకాలే రమణి వెళ్ళి టేబుల్ మీద పెట్టి 'కాఫీ తెస్తానుఅక్కా. అని వెళ్ళబోయింది. 'ఆగు రమణీ, ఇవి నాకు అక్కర్లేదు తీసుకెళ్ళు' అంది-రమణి ఓక్షణం అక్క ముఖంలోకి చూచి 'ఎందుకక్కా కోపం అమ్మా వాళ్ళు తిట్టారనేగా, కానీ మధ్యాహ్నం నుంచి అమ్మ కూడా కళ్ళొత్తుకుంటూనే వుంది. అన్నం తినలేదు. నాన్నగారు కూడా ఏదో తిని లేచిపోయారు. నిన్ను కోప్పడ్డారని వాళ్ళు బాధ పడుతున్నారక్కా. అయినా ఆ పెళ్ళివాళ్ళకి అంత ఆశ ఎందుకు? అసలు పెళ్ళి చేసుకుంటే ఏంచక్కగా చేసుకోవాలిగానీ డబ్బు ఎందుకు అడుగుతారు. మనమేమన్నా బాకీ వున్నామా? నువ్వు బాగానే చెప్పావ్ అక్కా. మరి నాన్న అమ్మా ఎందుకు తిడుతున్నారోగానీ..."

"ఒసే రమణీ ఈ కాఫీ తీసుకెళ్ళు"వంటింట్లో తల్లి పిలవడంతో మాటలు ఆపేసి గదిలోనుంచి వెళ్ళిపోయింది.

వినయమణి చెల్లెలివైపు చూస్తూ, వెళ్ళిపోగానే చిన్నగ నవ్వుకుంది 'మానసిక ఎదుగుగల అప్పుడే ప్రారంభమవుతోంది. ఇంటి పరిస్థితులు వాతావరణం కాస్త తెలివిగల్గి వుంటే ఆలోచించగల్గేలా చేస్తాయి. అయితే అమ్మా నాన్నా మధ్యాహ్నం నుంచి బాధపడుతున్నారా.

ఎందుకనీ? నన్ను నొప్పించి నందుకా? ఎదిగిన కూతురు—చదువుకుని ఉద్యోగం చేస్తున్న కూతురు-తామంత ఎత్తు పెరిగిన కూతురు-దాన్ని తొందరపడి తిట్టేమన్న బాధ కావచ్చును లేదా నేనన్న విషయాలు సత్యదూరాలు కావు గనుక. నిదానంగా ఆలోచించుకుని నొచ్చుకుంటున్నారేమో?

'ఏమైనా ఇక మీదట తన ఇష్టాన్ని వ్యతిరేకించరు. క్రమంగ మారతారు. పాత ఆచారాలు...సంప్రదాయాలు మార్చుకోటానికి ఇంకా టైమ్ పట్టుంది. అంతవరకు తన పట్టుదల కలిగి ఉండాలి.'

''ఏంటక్కా ఇంకా తినలేదా? పోనీ నేను తినిపించనా?" అన్న చెల్లెలి పిలుపుకి తెప్పరిల్లి-నవ్వి ''పెద్ద ఆరిందావయ్యావుగానీ నన్ను బుజ్జగించక్కర్లేదు వెళ్ళు'' అంది.

''హమ్మయ్య! మా అక్క నవ్వుతోందోచ్.'' అని అడుకుంటూ బయటికి పరిగెత్తింది రమణి.

*　　　　*　　　　*

మరునటిరోజు ఆఫీసులో కొలీగ్ వసుమతి అడిగింది. కాంటీన్‌లో.

'ఏమైందోయ్. నిన్నటి ప్రోగ్రామ్? కాయా? పండా?'

'బెడిసికొట్టింది, కాయో పండో తేలకుండానే పగిలింది.' కులాసాగా నవ్వేసింది మణి.

'గుడ్. లేకపోతే మళ్ళీ అదొక న్యూసెన్సు. వెళ్ళేక ఉత్తరం రాస్తామనటం. దానికోసం ఎదురు చూడ్డ అదంతా ఓ సస్పెన్సు,, ఎదురుగుండా తేలిపోవడమే హాయి, అవునూ ఇంతకీ ఎక్కడ బెడిసింది? అందచందాల్లోనా? తెలివితేటలదగ్గరా లేక 'కేంద్ర బిందువు' వద్దనా?'' వసుమతి తమాషాగా అడిగింది.

''అదే ఆ 'అసలుమాట' దగ్గరే"—అంటూ జరిగినదంతా చెప్పింది, వినయమణి.

'భేష్ మణీ నీకు కంగ్రాట్సు. ఏ ఆడపిల్లయినా ఇలా నిలదీసి అడిగితేగానీ ఈ సంఘంలోని ఈ కుళ్ళు కొట్టుకుపోదు. నీ ఆశయం నెరవేరి, నీకు తగిన తోడు దొరకాలని నా మనస్ఫూర్తిగా కోరుతున్నాను.'' అంటూ వసుమతి వినయమణి చేయి మృదువుగ నొక్కింది.

'నీ విషయంలో కూడా అలా జరగాలనే నా కోరిక' అంది వినయమణి. వారిద్దరు ఒకేదారిలో నడుస్తున్న ప్రయాణికులు ఒకరి నొకరు అభినందించుకుంటున్న-నేటి తరానికి, ఆదర్శ యువతులు.

*　　　　*　　　　*

జీవిత గ్రంథంలో కొన్ని అధ్యాయాలు వెనక్కి జరిగేయి. వినయమణికి ప్రమోషన్ వచ్చింది. ఇప్పుడామె గృహిణి. ఇల్లాలుగ, ఉద్యోగినిగ తన బాధ్యత అతి ఓర్పుగ నెరవేర్చుకుంటోంది.

ఆఫీసునుంచి అలసటగ ఇంటికి వచ్చింది. అంతకు మునుపే భర్త ఉపేంద్ర ఆఫీసు నుంచి వచ్చి కాఫీ పెట్టున్నాడు. వినయమణి ముఖం కాళ్లు చేతులు కడుక్కొని వచ్చేసరికి ఇద్దరికీ చెరొక కప్పులో కాఫీ పోసి పట్టుకొచ్చాడు. 'వట్టి కాఫీయే మేడమ్, టిఫిన్ లేదు.' అని నవ్వేడు. 'ఏమిటండీ ఇది? నేను కాస్త ఆలస్యంగ వచ్చేసరికి ఈ వరుసన పెట్టి ఇవ్వడం బాగులేదు రేపు నేను డూప్లికేటు తాళం కూడా తీసుకెళ్ళిపోతాను ఆఫీసుకి.' అంది చిరుకోపం మిళాయించిన అభిమానంతో.

'హతోస్మి, ఆ పని మాత్రం చేయకు. రేపు చాలా చాలా ప్రోగ్రాములు వున్నాయి. మనకి' అంటూకుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

'ఏమిటబ్బా?' అంటూ తనూ మరొక కుర్చీలో కూర్చుని కాఫీ 'సిప్' చేస్తూ అడిగింది.

'అంత గుర్తు లేదన్న మాట. మొదటిది, రేపు మన మారేజ్ డే. రెండోది. మనం పెట్టుకున్న నిబంధనలన్నీ రేపటితో బంద్.మూడోది

ఇక మనింట్లో మూడో మెంబర్ రావడానికి లైన్‌క్లియర్ అయింది గనుక మంచి సినిమా ప్రోగ్రామ్. నాల్గోది...'

'చాలు సార్. చాలు. మిగతావన్నీ గుర్తుకొచ్చాయి. అబ్బా. చూస్తుండగానే నాల్గు సంవత్సరాలు దాటిపోయినై గదా.' అన్నది ఆశ్చర్యంగా.

'ఊ కాదు మరీ? ఈపాటికి అడుగులేస్తున్న బాబు.. దోగాడుతున్న పాప, ఇంకా ఊపిరి పోసుకుంటున్న ఒక్కొాయి ఉండురేమో?' కొంటెగా చూస్తూ నవ్వేడు.

కానీ వినయమణి ఆ చిలిపితనంలో పాలు పంచుకోలేదు. ఆమెకి ఈ నాల్గు సంవత్సరాలు తాము తీసుకున్న నిర్ణయాలు తమ వివాహం...తన భర్త సహకారం, అదృష్టం—అన్నీ కళ్ళ ముందు ఓసారి గిర్రున తిరిగేయి.

''తనెంత అదృష్టవంతురాలు తన అభిరుచులకి అనుగుణమైన వాడు ఉపేంద్ర. చూపుల నాడే తనకి ఈ 'కట్నం" అనే పదం గిట్టదన్నాడు. పెళ్ళి తరువాత ఎవరి కుటుంబాలకి వాళ్లు ఆర్థిక సహాయం చేసుకుంటూ వుండవచ్చుననీ పుట్టింటినుంచి సారెలంటూ ఏమీ తెచ్చుకోనవసరం లేదనీ ఇద్దరు కలిసి కాపురం పెట్టినప్పుడు ఇద్దరి జీతాల్లో చి కావలసిన సామాగ్రి కొనవచ్చుననీ-ఎంత సౌమ్యంగా చెప్పాడు తన నుంచీ అతను డబ్బు రూపంలో ఆశించనట్టే అతన్నించి తను నగలు నట్టా కోరరాదనీ నవ్వుతూ చెప్పాడు. ఇంతటి అదృష్టవంతమైన పెళ్ళికి తను ఉప్పొంగిపోయి ఒప్పుకుంది.

'కానీ నాన్నకి అమ్మకి నచ్చలేదు అయనకున్న క్వాలిఫికేషన్ ఇంటర్ మీడియట్. పైపు హయ్యర్, షార్టుహాండ్ హయ్యర్. స్టెనోగ పని చేస్తున్నారు. తనకన్నా తక్కువ చదువని అమ్మా నాన్నా ఇష్టపడక చిన్న చూపుచూసేరు. పిచ్చివాళ్లు., అతని హృదయం డాక్టరేట్ లని

మించిపోయిందని, జీవితంలో కావల్సిన క్వాలిఫికేషన్ అదేననీ వాళ్ళ ర్థం చేసుకోలేరు.

'వాళ్ళే కాదు. ఆడపిల్లలకి డిగ్రీ కోర్సులు చెప్పించిన ఏతల్లి తండ్రులైనా అంతే! ఏ పోస్టుగ్రాడ్యుయేటో వెయ్యి పదిహేను వందల జీతగాడో రావాలనుకుంటారు. అప్పులపాలై, వేలకి వేలు కట్నాలు పోసి ఇల్లు గుల్ల చేసుకుంటారు. ఇలాంటి వాళ్ళుండబట్టె ఆ వరుళ్ళ మాటలు అందుకుంటున్నారు.

'భర్తకన్నా చదువు తక్కువ అయితే అతను సహించటంలేదా అలాంటప్పుడు భార్యకన్నా భర్త తక్కువ చదివితే ఏం? తరాలు మారినా జీర్ణించుకుపోయిన ఈ గుణాలు మారకపోవటము వల్లనే ఇన్నేసి బాధలు, కష్టాలు, సమస్యలు వస్తున్నాయి. తృప్తికి మించిన సుఖం మరొకటి వుందా? పరిస్థితులను అర్థం చేసుకోడం ఎంతటి వరం! అందుకే తను ఈ పెళ్ళికి ఒప్పుకుని ఇంచుమించు దెబ్బలాడి నంత పనిచేసి ఉపేంద్రని భర్తగా పొందింది.

'ఈ నాల్గు సంవత్సరాలు తామిద్దరు తమ కన్నవారికి, ఆర్థి కంగా సహాయాలు చేస్తూ ఇంటికి కావల్సిన వన్నీ స్వయంగా కొను క్కుని అప్పటివరకు అదనపు బాధ్యత పెరగకుండా జాగ్రత్తపడ్డారు. కనుకనే ఇంకా ఇంట్లో ఉయ్యాల వెలియలేదు. కానీ తన తమ్ముడికి కాలేజి చదువు పూర్తైంది. ఉపేంద్ర, చెల్లికి పెళ్ళి చేయించేడు. తమవల్ల రెండు కుటుంబాలు బాగుపడుతున్నాయి. తాము హాయిగా వున్నారు. ఇంతకన్నా తనకి కావల్సిందేమిటి? ఇప్పుడు గనుక ఆనాటి త్రివిక్రమరావు, రవిచంద్ర కనబడితే-ఎంత బాగుండును? ప్చ! ప్చ ఎందుకు కనబడతారు? నాలాంటి వాళ్ళకి కనబడరు! ఎక్కడో ఏ తండ్రినో కొల్లగొట్టి ..లేదా లక్షాధికారికి అల్లుడై కాలరెత్తుకుంటూ వుంటాడు. రవిచంద్ర! ఇలాంటివాళ్ల ఈ తరంలో దిష్టి పిడతలు! ఇదిగో నా ఉపేంద్రలాంటి వారు దివిటీలు!' అనుకుంటూ మురి పెంగా చూసింది భర్తని

అప్పటికి రెండుసార్లు పలకరించి, పలక్కపోయేసరికి 'వినయ గారూ-రేపటి ప్రోగ్రాములు ఊహించుకుంటూ ఇవాళ సంగతులు మర్చి పోకండి। వంట ప్రయత్నం చేయగలరా? లేక నన్నే చేయమంటారా' అంటూ చెవిదగ్గర అరిచేడు.

చిన్నగా నవ్వి-లేచింది వినయమణి!



# 'నూటికో తల్లి!'

(1984 సం॥లో ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో ప్రచురించబడిన కథ ఇది।)

మధ్యాహ్నం ఎండ మహాజోరుగా ఉంది. కిటికీ కర్టెన్ కొద్దిగా జరిపి చూస్తున్నాను.

పాల వ్యాన్ పెద్ద హారన్‌తో పోతోంది. స్కూల్ బస్సు ఆగింది. బుడతకీచుల్లా ఇద్దరు పిల్లలు దింపబడ్డారు బస్సులో నుంచి. వాళ్ళ భుజాలకి పుస్తకాల సంచులు వాటర్‌బ్యాగులు, నెత్తిన తెల్ల టోపీలు, కాళ్ళకి మేజోళ్ళతో బిగించిన బూట్లు, వాటిమీద దుమ్ము! బస్సులో నుంచి దింపబడ్డ ఆ పసివాళ్ళు వేళ్ళాడిపోతూ ఉన్నారు. వాళ్ళకోసం రోడ్డుప్రక్క గొడుగు లేసుకుని ఎదురుచూస్తున్న అమ్మలో అక్కలో, అయాలో గానీ ముందుకు వచ్చి, ఆ పిల్లల భుజాల బరువంతా ఊడలాగి తమమీద పడేసుకుని వాళ్ళని గొడుగుల్లోకిలాక్కుని తీసుకెళుతున్నారు.

సైకిల్ బళ్ళమీద కూరగాయలు సేర్పుగా పేర్చుకుని పక్కనున్న సీనారేకు డొక్కులో నుంచి నీళ్లు జల్లుతూ-'తాజాకూర'లని కేకలు పెట్టూ పోటీలమీద పోతున్నారు నల్గురు కుర్రాళ్ళు! వెన్నెట్లో నడుస్తున్నంత కులాలాగా ఉంది వాళ్ళ వరుస।

వయస్సు పొగరు అలాంటిది మరి!

సంచులు, బ్యాగులు బుట్టలు పట్టుకుని పాల ప్యాకెట్ల కోసం హడావిడిగా బయల్దేరేరు. అప్పుడే కొందరు అంగనామణులు!

ఎండనుకుంటే కుదరదుగదా? అవసరం అలాంటిది! పేపర్లు సీసాలు, డబ్బాలు కొనుక్కునేవాడు తట్ట నెత్తిన పెట్టుకుని సికసగా అరుస్తున్నాడు, సందు చివర ఓ స్టీల్ సామాన్ల అమ్మె నడుముకి కట్టుకున్న గుడ్డ ఉయ్యాల్లో నెలల పసిగుడ్డను కూర్చోబెట్టుకుని, గొంతెత్తి నాల్గు వీధులకి వినిపించేలా అమ్ముతోంది। తల్లితోపాటు ఆ పసిగుడ్డు కూడా ఎండంతా భరిస్తోంది!

బ్రతుకు తెరువుకోసం అగచాట్లెన్నైనా భరించాల్సిందే గదా!

ఇంతలో —

అదరా బాదరా హేండ్ బ్యాగ్‌లు ఊపేసుకుంటూ, చెమట కక్కుకుంటూ, జారిపోతున్న నైలెక్స్ చీరల్ని సర్దుకోలేక అయాస పడుతూ లేస్తూ మార్నింగ్ షోలు చూసి వస్తున్నారు కొందరు మహిళలు సినిమా చూసిన ఆనందం కన్నా స్కూళ్ళనుంచి పిల్లలు వచ్చేరేమో, ఆఫీసునుంచి భర్త వచ్చేవేళకి టిఫిన్, కాఫీలు చేయగలమో లేమో అన్న ఆరాటం, ఆదుర్దా యే వాళ్ళ ముఖాల్లో తాండవిస్తుంది।

'బాధ్యతగల ఇల్లాళ్ళకి సరదాలు తీరాలంటే ఆమాత్రం హైరాన తప్పదు కదా?' అనుకుంటూ కిటికీ కర్టెన్ సరిచేసి లేవబోతున్నప్పుడు చూసేను.

సందు చివర భారంగా అడుగులు వేస్తూ ఓ పెద్దావిడ చేతిలో సంచీతో వస్తుంది. ఒక ఇంటిముందు ఆగి కొంచెసేపు ఆలోచించి లోపలికి వెళ్ళింది. 'ఎవరో లే' అనుకుని లేచి ఇంట్లోకెళ్ళిపోయేను.

మరొక పావుగంట తర్వాత ఏదో పనిమీద బాల్కనీలోకి రాగానే ఆ పెద్దావిడ రెండో ఇంట్లోకి వెళ్తోంది. 'బహుశా ఆ మొదటి

ఇలు కాదేమో?' అనుకొని వెనుతిగరబోతుంటే, మళ్లీ ఆవిడ...ఆ రెండో ఇంట్లోనుంచి కూడా బయటికివచ్చి మూడో ఇంట్లోకి వెళ్ళనా మాననా, అన్నట్టు సంశయంగా కాస్త సేపు ఆగి, ఇక మానేసి నాల్గో ఇంటికి-అంటే సరిగా మాపక్క ఇంట్లోకి వెళ్తోంది।

ఇదేదో ఇల్లు వెతుక్కుంటున్న బాపతులా లేదు...ఇంటింటికి వెళ్లి వస్తుండటం అంటే ఆవిడ ఏదో అడుగుతున్నదో అమ్ముతున్నదో...ఏదో అయిఉండాలి ..

మనిషి మాత్రం ఆ రెండు పనులు చేయతగ్గ స్థాయికన్న పై మెట్టు మీద ఉన్నట్టు కన్పడుతోంది..

'ఏమిటో ప్రతివాళ్ళకి ఇలాంటి బుద్ధులు పుట్టున్నాయేం? ఈ ఎర్రని ఎండలో-ఇంత పెద్ద వయస్సులో ఎందుకొచ్చిన అవస్థ?

'దేనికైనా హద్దు పద్దు ఉండాలి!'

'సమయా సమయాలు చూసుకోకుండా వయస్సు మరచి, అంతస్తు కప్పివుచ్చుకుని ఏమిటో ఈ దురాశలు, లాలస.'

నా మనసు అనేక రకాలుగా విమర్శిస్తుంది ఆవిడ గురించి! కోపం కూడా వస్తుంది. ఇంతలో ..

ఆవిడ మా తలుపు కూడా బజ్జర్‌తొక్కి తెరిపించింది. చూసేను ఆవిణ్ణి పరీక్షగా.

సన్నటి పట్టు అంచున్న ఆకుపచ్చ వరంసూరు చీర నిండుగా కప్పుకున్న కొంగులో నుంచి తొంగిచూస్తున్న పాప్లిన్ తెల్ల రవిక. వెండితో చుట్టించుకున్న పగడాల గొలుసు చెవులకి ఎర్రరాళ్ళ దుద్దులు...చేతికి ఒకో బంగారపు గాజు. వేలికి ఒంటిరాయి ఉంగరం. సగానికి సగం నెరసిన జుట్టు పైకి ముడివేసి...అందులో పైకి కనుపిస్తున్న పిన్నులు ..కుంకుమలేని చోట చిన్న మచ్చ...

'అమ్మా! చారుపొడి, కందిపొడి, అప్పడాలు, వడియాలు...

తీసుకుంటారా, అమ్మా?' చేతిలో ఉన్న బరువైన సంచీని కిందపెట్టి కొంగుతో ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ చిరునవ్వుతో అడిగింది ఆవిడ.

చిన్నగా నిశ్వసించి 'అక్కర్లేదండి' అని కొంచెం కరుకుగానే అన్నాను. 'ఇదన్న మాట!" అనుకున్నాను మనసులో...

'చూడండి, అమ్మా! మంచి వాసన...చిటికెడు పొడుంవేస్తే చాలు...ఇంకేమీ వేయనక్కర్లేదండి! అన్ని పాళ్ళూ అందులో వేసి తయారు చేసేమండి! అప్పడాలు కూడా పెద్ద సైజులో చేసేమండి కందిపొడుం స్వయంగా విసిరేమండి. ఒక్క ప్యాకెట్ తీసుకోం డమ్మా. ఏదైనా రెండు రూపాయలేనండి.' ఆవిడ గబగబా సంచీలో నుండి ప్యాకెట్లు తీసి చూపిస్తోంది...ఆ నమ్రత, ఆ నెమ్మదిగా చెప్ప డం, అన్నిటికన్నా తనకన్నా చిన్నదాన్నైన నన్ను 'అండి' అని మన్నించడం నాకెంతో బాధనిపించింది.

'అది కాదండి మేము సరుకులన్నీ నెల మొదట్లోనే కొనేసుకుంటాం! అన్నీ ఉన్నాయి. ఇప్పుడేమీ అక్కర్లేదు' కొంచెం సౌమ్యంతోనే అన్నాను.

'అలాగాండీ! సరే! అయినా ఇంట్లో తయారు చేసేమని, బాగా ఉంటాయని చెప్తున్నానండి! పోనీ ఒక్కటంటే ఒక్క ప్యాకెట్ తీసుకుని చూడండి!' ఆవిడ చిరునవ్వు నన్ను లొంగదీసుకుంది. పోనీ రెండు రూపాయలే కదా? ఒకటి తీసుకుందామనుకున్నాను.

'తీసుకోండమ్మా!'

'సరే, ఇవ్వండి!'

ఒక ప్యాకెట్ అందిస్తూ 'బలవంతం చేస్తున్నానని కోపగించుకోకండి! అవసరం అలాంటిది! నాల్గు ప్యాకెట్లు అమ్మితే ఏదోకొంతేనా డబ్బు వస్తుందని ఆశండి!' అంటూంటే ఆవిడ కంఠంలో సన్నని జీర నీటిమీద అలలా కదిలింది.

ఆవిడ కళ్ళలోకి చూసేను...

చిరుమేఘంలాంటి విచారరేఖ రెపరెపలాడి నట్టైంది. మౌనంగా ప్యాకెట్ తీసుకుని లోపలినుండి రెండు రూపాయలు తెచ్చి ఇచ్చేను, ఆవిడ గుమ్మం బయటే నుంచుని ఉంది!

డబ్బు తీసుకుంటూ 'అమ్మా, కొంచెం మంచినీళ్ళు ఇస్తారా?' అని అడిగింది. లోపలికెళ్ళి తెచ్చిఇచ్చాను.

గ్లాసె త్తి పెట్టి గటగటా తాగి 'చాలండి ఎండలో వస్తే నోరెండి పోతోందండి!' అంటూ చిన్నగా నవ్వింది,

'మరి ఇంత ఎండలో పెద్దవారు కదా మీరెందుకు వచ్చారు? చిన్నవాళ్ళ నెవరినైనా పంపాల్సింది. అయినా ఈ అమ్మకం ఎన్నాళ్ళ నుంచి చేస్తున్నారు. మేము ఇక్కడ చాలాకాలం నుండి ఉన్నాము. ఎప్పుడూ మీరు వచ్చినట్టు చూడలేదు నేను' అన్నాను.

అదే చిరునవ్వు చెరిగిపోకుండా...'నిజమేనండి! నేను ఇది వరకు ఎప్పుడూ రాలేదు. ఈ మధ్యే-అదే రెండు మూడు నెలలనుంచి వస్తున్నాను. ఇంటో చిన్నపిల్ల లెవరూ లేరండి! అంటే అదే కాస్త ఎండను తట్టుకుని తిరగగల పిల్లలన్న మాట. అందుకని నేనే రావల్సి వస్తుంది' అన్నది ఎంతో మృదువుగా.

'అయితే ఏపొద్దుటి వేళో...సాయంకాలపు పూటో రాకూడదా బొత్తిగా ఇంత ఎర్రని ఎండలో,..?' అంటూ సందిగ్ధంలో ఆగి పోయాను

అసలు ప్యాకెట్ కొన్నాక అన్ని వివరాలు అడగక్కరేకుండానే ఎంతోమంది ఏజంట్లని, సేల్స్‌గర్ల్స్‌ని పంపిస్తు ఉంటారు. కానీ ఈ పెద్ద ఆవిడ కాస్త సంస్కారము, స్థితి బాగా ఉండి, ఇంత ఎండలో అంత అవసరంగా ఈ వ్యాపారము ఎందుకు చేస్తున్నట్లో తెలుసుకోవాలన్న తహతహ నా అంతర్యంలో ఉంది. అందుకే అన్ని

రకాలుగా ప్రశ్నలు వేస్తూ నిలబడ్డాను...వల్చటి తెర వెనక్కి తప్పు కున్నట్టుగా ఆవిడ చిరునవ్వు క్షణకాలం మసక కమ్మి తరువాత మళ్ళీ ప్రకాశవంతమైంది.

'అమ్మా! మీ కిప్పుడేమీ పని తొందర లేకపోతే నేను రెండు మాటలు మాట్లాడ్తాను. వింటారా.' అన్నది.

'చెప్పండి ఏమిటో.'

ఆవిడ అక్కడే కొద్దిగా అయాసపడుతూ కూర్చుంది. కొంగుతో మెడ, నుదురు తుడుచుకోస మొదలెట్టింది.

'ఈ వెనక వెంకట్రమణానగర్ కాలనీ ఉంది తెలుసుకదండీ' ఆ తర్వాత ఆనందనగర్ కాలనీ చిన్నది. మా అమ్మాయి, అల్లుడు ఉంటున్నారండి. అమ్మాయి చిన్న కంపెనీలో ఉద్యోగము చేస్తుం దండి. అల్లుడు పెద్దగా చదువుకోలేదండి. అందుకని ఆతడు ఏదో చిన్న ఉద్యోగము చేస్తున్నాడు. కానీ పర్మినెంట్ కాదండి. పోయినప్పు డల్లా మళ్లీ కొత్తది వెతుక్కోవడమే। అయితే అమ్మాయి జీతము ఉంటుంది గనుక...ఏదో అవస్థపడుతున్నా నెట్టుకుని వస్తున్నారు. కానీ అమ్మాయి మొన్ననే పురుడు పోసుకుంది. బాలింతరాలు. నెలపులో ఉంది. కంపెనీ చిన్నది. అందుకని జీతం అదీ సరిగా రాదు. అందులో పసిపిల్లాడు ఖర్చు అదనంగా తయారైంది, డబ్బుకి చాలా కటకటలాడి పోతున్నారు...

'నేను అమ్మాయికి పురుడు పోయడానికి రామచంద్రాపురము నుండి వచ్చానండి. అక్కడ మా అబ్బాయిలు ఇంజినీర్లండి. మా వారు కూడా సూపరింటెండెంట్‌గా రిటైర్ అయి పోయేరు। పెద్ద మ్మాయి, అల్లుడు పూనాలో ఉంటారండి. ఆ అల్లుడు అక్కడ డిఫె న్సులో ఉద్యోగము చేస్తున్నాడు.

'అమ్మా మీరు ఇవన్నీ విని ఆశ్చర్యపోతున్నారు కదూ. నహ

జమే మరి. ఆ దరి పొజిషన్లు ఇంత బాగా ఉంటే ఈ చిన్నల్లుడేమిటి ఇలాంటి వాటికెందుకు కిచ్చారు! ఇచ్చినా నే నీ పని చేసి కష్టపడట మెందుకు డబ్బు తెచ్చి ఇవ్వచ్చును కదా. లేదా అమ్మాయిని హాయిగా ఇంటికే తీసుకెళ్ళవచ్చునుగదా. అని అనుకుంటున్నారు. అవునా।...

'నాకు తెల్సండమ్మా, ఎవరైనా అలాగే అనుకుంటారు. కానీ; కొన్ని 'దురదృష్టాలు' అవకాశాల్నీ...ఆనందాల్నీ...అందుకోనీయవు. మా అమ్మాయి ఆ పరిస్థితిలోనే ఉంది.

'దాని పెళ్ళినిమిత్తం...పాతికవేలు కేటాయించి...వాళ్ళ నాన్న గారు... కొడుకుల మీద బాధ్యత పెట్టి పోయేరు. అయితే ఆయనచేసిన చిన్న పొరపాటు ఏమంటే—డబ్బంతా కొడుకుల పేరే ఉంచారు. మంచి సంబంధం--మనకి తూగే సంబంధం--చూసి చేయమన్నారు.

"కానీ అమ్మాయి--'తనకి నచ్చినవాణ్ని--తనను వరించినవాణ్ణి చేసుకుంటానంది. మా అబ్బాయిలు--కోడళ్ళు ..అభ్యంతరాలు లేవ దీసేరు. 'నీకన్నా తక్కువ చదువు-ఆర్థికంగా మైనస్‌లో ఉన్నవాణ్ని చేసుకుని మా పరువు తీయకనీ--నువ్వా ఏమీ సుఖపడలేవనీ తిట్టి పోసేరు. ఇంతకీ అతను మాకు దూరపు బంధువే. కానీ మాకన్నా చాలా తక్కువ స్థితిలో ఉన్నారు. తల్లితండ్రులు లేరు. అన్నలు, అక్కలు లేరు. ఉన్నవాళ్లు ఇద్దరు తమ్ముళ్ళు. వాళ్ళు ఏవో చిన్న ఉద్యోగాలు చేస్తూ పెద్ద నాన్నగారింట్లో ఉన్నారు.

'అమ్మాయికి నేను ఎన్నివిధాల నచ్చచెప్పబోయినా, ససేమిరా అని అతన్నే చెసుకుంటానంది. అందుకని మా అబ్బాయిలు, కోడళ్లు ఇంట్లో పెద్ద యుద్ధం చేసి-నీ ఖర్మ-నువ్వు అనుభవించమని-క్లుప్తంగా గుళ్లో పెళ్లి చేసి పంపించేసేరు—వాళ్ళమాట వినలేదు గనుక..! ఒక్క పైసా కూడా ఇవ్వలేదు. అంతా వాళ్ళ పేరుమీదే ఉందిగదా. వాళ్ళ నాన్న చేసిన ఈ తప్పు మా అమ్మాయికి దురదృష్టమై-పుట్టింటి నుంచి అందుకునే ఆనందాలకి..అవకాశాలకీ దూరం చేసేసిందండి।

'మా పెద్దమ్మాయి, నేను ఎన్నో రకాలుగా మా అబ్బాయిలకి చెప్పేమండి-'పోనీ దాని కిష్టమైనవాణ్ని చేసుకుంది-ఏదో కొంత డబ్బు దానిపేర బ్యాంక్‌లో వేయ'మని..,కానీ...హూఁ! వాళ్ళు వినలేదండి. డబ్బంతా ఖర్చు పెట్టేసుకుని మళ్లీ దేభ్యముఖంతో వస్తుంది ఇంటికి వాడు ఉద్యోగము చేసి ప్రయోజకుడైనప్పుడు--తప్పకుండా దానికి కావల్సినంత ఇస్తాం అన్నారు.

'హూఁ! అమ్మాయికి అసలే పౌరుషం! మీ దగ్గర్నుంచి పైసా కాదు కదా చీపురు పుల్లయినా తీసుకోను. ఇప్పుడేకాదు, జన్మలో తీసుకోను మా బ్రతుకు మేం బ్రతకగలం అని కాపరానికి వెళ్ళి పోయింది!

'అమ్మా! అవసరానికి, ఆపదకి ఆదుకోలేని డబ్బు తర్వాత ఎప్పుడో ఇస్తామంటే ఎందుకు? కష్టం వచ్చినప్పుడు ఒక్క పైసా కూడా కోటి విలువ చేస్తుంది. సుఖంగా ఉన్నప్పుడు—లక్షలు ఇచ్చినా అక్కర్లేదు...ప్రతివాళ్ళూ ఎదుటివాళ్ళు ప్రయోజకులై హాయిగా ఆనందంగా ఉన్నప్పుడు ఎదురెళ్ళి ఆమోదం తెల్పుతామంటారే కానీ దిగజారి కష్టాల్లో ఉన్నప్పుడు చేయూతనిచ్చి పైకి తీసుకొస్తామనరు. అందుకే మనిషికీ, మనిషికీ మధ్య ఇన్నేసి అగాధాలు। 'అయిన' వాళ్ళంతా ఉన్నా-ఆదుకోగల ఆర్థికస్తోమత ఉన్నా మా అమ్మాయి ఒంటరిదై ఇబ్బందిలో పడింది।

'అమ్మ పురిటికి కూడా అది నన్ను రమ్మనలేదు. నేనే తెల్సుకుని వచ్చాను. పుట్టింటి సొమ్ము నాకు వద్దంది. అబ్బాయిలు సరే! నా ఖర్చుకి ఇచ్చారు తప్ప-దానికంటూ ఏమీ ఇవ్వలేదు. ఆడదానికి ఆర్థికబలం లేకపోతే...ఎంత నరకం అనుభవిస్తుందో...నాకు అనుభవమైంది! భర్త ఉన్నంతకాలం హోదాగా బ్రతికేను. కానీ స్వతంత్రంగా, స్వేచ్ఛగా జీవించాలనుకునే స్త్రీ..ఆ భర్త లేకపోతే..ఆర్థికంగా కూడా తాహతు పోగొట్టుకుంటే ..బ్రతికిఉన్నా చచ్చినట్టే లెక్క!।

'వీళ్ళని నే ఒక్క తల్లినే కన్నాను—అయినా కొడుకులు, కోడళ్లు హాయిగా ఉన్నారు. పెద్దమ్మాయి సుఖంగానే ఉంది. కానీ ఈ చిన్నమ్మాయి బ్రతుకే...ఇలా ప్రారంభమైంది! నిజానికి మనసుకు నచ్చినవాణ్ని చేసుకోవడము నేరం కాదు. పేదరికం తప్పు కాదు, మరి దానికెందు కీ శిక్ష?

'ఇదంతా డబ్బు మహత్త్వం. అమ్మా! మా అబ్బాయిలు చెప్పినట్టు విని, అది ఏ గొప్పింటివాణ్ణో చేసుకుంటే—ఈ పాటికి సారెలు చీరలు అట్టహాసంగా పెట్టించేవారు కోడళ్ళు. సమాజంలో మా ఆడపడుచు ఫలానావారి కోడలు...ఫలానా ఆఫీసర్‌గారి భార్య అని చెప్పుకుందురు కానీ ఇప్పుడు అలా కాకుండా పోయిందని—సిగ్గుచేటని వాళ్ళ బాధ' 'ఉన్నవాళ్ళకే పెట్టాలనుకుంటే...'లేనివాడి' గతేమిటి?

'అమ్మా! మా అమ్మాయి కష్టపడుతున్నా సంతోషంగానేఉంది. వాళ్ళిద్దరూ అన్యోన్యంగానే ఉన్నారు...నాకు కావల్సింది అదే!అయితే తల్లిని గనుక...బాలింతరాలైన కూతురికి ఏదైనా చేసి పెట్టకుండామని ఆరాటపడుతున్నాను. అమ్మాయి జీతం రావటంలేదు. అతని రాబడి తక్కువ! అబ్బాయిల దగ్గర దెబ్బలాడి తెచ్చిస్తే లేదా నా ఒంటిమీద గాజులు అమ్మిస్తామంటే—అమ్మాయి ఒప్పుకోదు! ఇక ఏదీ దారి? ఏం చెయ్యను! కొద్ది పెట్టుబడితో శ్రమపడి ఈ చిన్న వ్యాపారం చేస్తే ..బాగుంటుందనిపించింది! కిరాణా కొట్లో ఖాతా రాయించి ఇంట్లో విసిరి--ఇలా అమ్ముతున్నాను. ఈ రెండు నెలల నుంచి ఈ పని చేస్తుంటే...ఖాతా జమకట్టగా నలభై దాకా మిగులున్నాయి. అమ్మాయికీ, పసివాడికీ ఉపయోగపడుతున్నాయి. నాకూ తృప్తిగానే ఉంది.

'అమ్మా. మీ రన్నట్టు పొద్దుటో...సాయంకాలమో రావచ్చును కానీ,..పొద్దుట వంటా వార్పూ ఉంటుంది,..సాయంకాలం అల్లుడు చూస్తే నొచ్చుకుంటాడుఅందుకనిమధ్యాహ్నంపూట పెట్టుకుచూస్తాను

ఈ పని. పెద్దదాన్నే. కష్టమే. కానీ,..నేను తల్లిని. అది బాలింత రాలు. ఇప్పుడు ఇబ్బందుల్లో ఉంది. నా బాధ్యత అనేకన్నా దాని పట్టుదల ధైర్యాన్ని నేను మెచ్చుకుని-నా చేయూతనిస్తూ గర్వపడు తున్నాను. తృప్తి పడుతున్నాను-ఒకవేళ మేము కూడా ఆర్థిక పరిస్థితి బాగులేక ఈ అల్లుడిలాంటివారమే అయితే--అప్పుడు ఏదోరకంగా అమ్మాయి పురుడు, పుణ్యం పోసి పంపించేవాళ్ళమే కదా! అప్పుడు కష్టపడి ఏ పనిచేసినా--అందరూ ఒప్పుకుందురు ఇప్పుడు అలాకాదు అవమానంగా భావిస్తారు.

'కాని, అమ్మా. నేను అవమానం అనుకోవడంలేదు...పరువు తక్కువనుకోవడంలేదు...నా స్వయం సంపాదనతో-నా కూతురికి నేను కావల్సినవి పెట్టుకోగల్గుతున్నానే అన్న సంతోషం అనుభవిస్తు న్నాను. నా కిప్పుడు ఆత్మస్థయిర్యం కూడా కలిగింది. ఫరవాలేదు-నీతి తప్పని ఏ పనైనా చేసి-అనుకున్నది సాధించవచ్చని తెలుసు కున్నాను. అందుకే ఇలా అమ్ముతున్నాను.

'అమ్మా. వస్తాను చాలా సేపైంది. మీ టైమ్ పాడు చేశాను ఏమనుకోకండి.' అంటూ చిన్నగానవ్వుతూ లేచింది ఆవిడ—వింటున్న నాకు మనసంతా చెప్పలేని ఆర్తితో..భాషకందని అనుభూతితో నిండి పోయింది.

అంతకుముందు తెచ్చుకున్న కోపం..చిరాకు..ఆవిడ వ్యక్తిత్వవు విలువ తెల్సేక--సిగ్గుపడి వారిపోయేయి. ఒక ఆఫీసర్‌గారి భార్యగా ఆవిడ వేషంలో తప్పిదం లేదు. ప్రేమించి పెళ్ళి చేసుకున్నకూతుర్ని మెచ్చుకుంటూ--ఇంత ఎండలో అలా ఇంటింటి తిరిగి అమ్ముతున్న పనిలో-లోపం లేదు-తొందరపాటుగాఆలోచించిన నా మనసే తప్పు చేసింది.

వేళాపాళా చూడని అమ్మలక్కలూ-సరదాలు, సంబరాలకోసం పరుగులెత్తే అంగనామణులకన్నా-ఈ తల్లి సేవ-ఎంత ఉన్నతంగా ఉంది..

ఆవిడ లేచి వెళ్తూ 'అమ్మా. ఇంకెవరన్నా మీ వాళ్ళు కొనే వాళ్ళుంటే చెప్పండి. ఏదో మరో రెండు నెలలు ఉంటాను. అంత వరకు ఈ పని చేస్తాను. చెప్తారా' అని ప్రశ్నిస్తుంటే--

'అలాగే చెప్తాను. మీరు పెద్దవారు. నన్ను 'మీరు' అనకండి. ఉండండి-మీ అమ్మాయికి కాస్త పాత ఉసిరి పచ్చడి - నిమ్మకాయ ఇస్తాను..' అన్నాను.

'అహ. వద్దమ్మా-అది అనలే.,.'

'అలా అనకండి. నా చెల్లెలాంటిది. ఓ అక్క ప్రేమతో ఇచ్చిందని చెప్పండి.' అని గబగబా లోపలికి వెళ్ళి రెండు చిన్న సీసాల్లో ఉసిరికాయ, నిమ్మకాయ-ఊరగాయలు సర్ది తెచ్చి ఆవిడకు అందించేను...

ఆవిడ కళ్ళల్లో--సన్నని నీటి పొర.

పెదవుల కంపన...స్పష్టంగా చూసేను/-అందుకుని సంచీలో పెట్టుకుంది.

'అమ్మా' వస్తానమ్మా' అని వెనుదిరిగింది.

ఆమె వెళుతుంటే కిటికీలో నుంచి చూస్తున్నాను..అప్పుడు నాకు ఆవిడ ఎండలో వెళ్తున్నట్టు లేదు...

'నూటికో తలైనా' ఇలా ఉంటే-ఈ ఎండ వెన్నెలై పోదా?' అనిపించింది.



# 'ప్రమోషన్'

(విజయ మాసపత్రికలో ప్రచురితమైనదీ కథ।)

ముకుందానికి ప్రమోషన్ రాబోతోంది ఆరోజు—కనుక, అతనియొక్క హితులు, సన్నిహితులు........బంధువులు......,

పరిచయస్థులు ..రకరకాలు అంతర్యాలతో, సతమతమయ్యేది ఆరోజే!

కొందరికి దుఃఖం ముంచుకు వస్తుంటే . మరికొందరికి ఆనందం పొంగుకు వస్తుంది...ఇంకొందరికి విషాదంగావుంటే మరికొందరికి విచారంగావుంది.

ఇంతకీ ఆరోజు ఇంకానాల్గురోజుల ముందు వుంది।ఈలోపులో ముకుందం నల్గురికీ, కన్నెర్ర నవుతూ, కంట్రకపడుతూ. మరికొందరి సలహాలకి, దీవెనలకి తలొంచుతూ.. ఊపిరాడక కొట్టుకుపోతున్నాడు, సమాధానాలు చెప్పలేక సతమతమవుతున్నాడు.

"ఏమోయ్ ముకుందం!ఏమిటి ఏదో విన్నాం, నిజమే? ఇంక అయితే మాపైపు చూడవుకాబోలు! పాత స్నేహాలు గుర్తుంటాయా?! అని ఓ మిత్రుడు...మనసులో కుళ్ళిపోతూ....పైకినవ్వేస్తూ.. పెళ్ళున వీపు చరిచి అడిగేడు సకిబజార్లో,..నలుగురూ నడిచేకూడలి వద్ద.

"ఇంత మాత్రానికే?" అంటూ అతి మామూలుగా నవ్వేసేడు ముకుందం, అదేదో 'జోకు' వేసినట్టు భావించి గొల్లున నవ్వి— "అందుకే నీకు ప్రమోషన్ వస్తుంది. పైకి రాబోయే లక్షణాలు! ఊ అప్పుడప్పుడైనా మాబోటి వాళ్ళని ఓ చూపుచూస్తుండు. అది సరే..' ప్రమోషన్ వస్తుంటే ఓ కాఫీ చుక్కయిన పోయించవా?-" అన్నాడు సగం ఏడ్పు ఆ విధంగానైనా దిగమింగుకుందామని... మనసులో కుళ్ళిపోతూ.

"అలాగే పద హోటల్‌కి—" అని తీసుకెళ్ళి కోరినవన్నీ ఇప్పించేడు ముకుందం-స్నేహితునికి ఆ మాత్రం ఇప్పించడంలో తప్పులేదనిపించింది--ఇప్పించడం బాధ్యత కూడా అనిపించింది.

అయితే--బావమరిది మధుసూదనం మాత్రం 'అది తప్పే' అన్నట్టు-'మందలించమని' చెల్లెలికి చెప్పి వెళ్ళేడు-సదరు వ్యక్తి, సాక్షాత్తు తనకి ధర్మపత్ని కదా-!అందులోనూ ప్రమోషన్ రాబోతున్న భర్తగారి. భార్య!కాబోయే అఫీసరుగారి సతీమణి--

అందుకని అన్నయ్యగారి సలహా భర్తగారికి అందచేసి-'ఇలా' ఎంతమందినని మేపుతారు! బొత్తిగా అమాయకంగా వుండకండి!' అని హెచ్చరించింది.

బావమరిది ఆవిధంగా తన చెల్లెలికి చెప్పటం ముకుందానికి నచ్చలేదు!ఒకవేళ చెప్పినా...అన్నగారి మాటమీద ప్రాముఖ్యతనిచ్చి తన్నునిలదీసిన భార్య తత్వం మరి చికాకనిపించింది!.

చికాకంతటినీ తలనొప్పిగా మార్చుకుని-చల్లపరుచుకుందుకు అమృతాంజనం పులుముకుని సమాధాన పడ్డాడు-తనకుతనే, అంతకంటే చేయగలిగిందిలేదు కనక.

మరొకరోజు గడిచింది--

'నాయనా ముకుందం! మాట.మాట! ఒకసారి ఇటురా!_' అని పిల్చేరు. చేతుల్తో చప్పట్లుచరుస్తూ- ఆయన ముకుందానికి దూరపు బంధువు. వయస్సు మళ్ళినవాడు-. ముకుందం ఆయన దగ్గరికి వెళ్ళాడు మనసులోనే ఆయనెవరో గుర్తు తెచ్చుకుంటూ.

'నాయనా! అదృష్టవంతుడివోయ్! ప్రమోషన్ వస్తోందిట గదూ? చాలా సంతోషం బాబూ! చిన్నప్పుడే పెద్ద పదవులకి చేరటం మాటలు కాదు! మావాడూ వున్నాడు. ఎందుకు? డిపార్టుమెంటు టెస్టులు ప్యాసవలేక-రావల్సిన ఇంక్రిమెంట్లు ఆగిపోయిఆ ఘోరిస్తున్నాడు! నిన్ను చూస్తుంటే కడుపు నిండిపోతోంది బాబూ! గబగబా మెట్లుఎక్కి మేడపైభాగం చేరినట్లున్నావు. మంచిది నాయనా. పదవిని చక్కగా నిర్వహిస్తూ.. నల్గురి మెప్పుపొంది. పేరు ప్రతిష్ట నిలుపుకో!' అన్నాడాయన కళ్ళనిండా ఆనందం తొణికిస లాడుతుండగా.

ముకుందం ఆయన మంచితనానికి ముగ్ధుడై, చేతులు జోడించి 'పెద్దలు! మీఆశీర్వాదబలం ఫలించాలి!-' అన్నాడు.

ఆయన ముకుందాన్ని దగ్గరగా తీసుకుని ఆప్యాయంగా నిమిరి 'నీ సామర్థ్యమే నీకు ఆశీర్వాదం అవుతుంది! కేవలం ఎదుటివాళ్ళ దీవెనలతో ఏం జరుగుతుంది నాయనా ఇదివరకు మావాడిని మూడు పూటలా దీవించేవాణ్ణి! ఏం లాభం! పరీక్షలు ప్యాసవలేక ఏడుస్తుంటే దీవెనలెలా ఫలిస్తాయి? - అందుకే ఇప్పుడు ఇంక అసలు మానేసేను! ఎవరు అభివృద్ధిలోకి వస్తున్నారో వాళ్ళకి శుభాకాంక్షలు తెలుపుతున్నాను! నీ దీక్ష, నీవ్యక్తిత్వమే-నీకు రక్ష! పైపదవిలోకి వెళ్ళబోతున్నవాడివి. ఆ స్థానంలో వున్న కష్టనిష్ఠూరాలను-ఒడుదుడుకుల్ని అర్థం చేసుకుని... జీర్ణించుకుని, నునసున్న మనిషిలా. నీకర్తవ్యాలని నెరవేర్చుకుంటూ-పేరు తెచ్చుకో నాయనా!' అన్నాడు.

ముకుందం ఆయన నిజాయితీకి చలించేడు!

కత్తిలేని సలహాలకి సంతోషించేడు!- ఈరోజుల్లో-మనస్ఫూర్తిగ అభినందించే-మనిషి కనిపించడమే కష్టం!-ఎదుటవాడికి ప్రమోషన్ వస్తోందంటే-నిద్రాహారాలు మానేసైనా...వాడికి ఎలా వస్తుందనీ-తనకన్నా వాడు సీనియర్ కాదే? అనీ ..ఒకవేళ సీనియర్ అయినా లోగడ వాడు పెట్టులు ప్యాసైనాడా! అనీ. ఇంత వరకు ఆఫీసులో ఏచిన్న పొరపాటైనా చేయకుండా వున్నాడా అనీ...' కోడిగ్రుడ్డుకు ఈకలులాగే విధంగా ఆరాలు తీసుకుంటూ-తనకి రాకపోయినా ఫర్వా లేదు గాని వాడికి రావడం భరించలేనట్టు ఏడ్చే ఏడ్పులు కోకొల్లలు!-ఇక ఆ పైన తప్పనిసరిగా భరిస్తూ కళ్ళు ఉడుకుంటూ...పైకి 'విష్' చేస్తూ లోపల తెగ తిట్టుకుని-చాటుగా గుసగుసలు చెప్పుకోడం... 'వీడి మొహం! వీడికా ప్రమోషన్ ఎలా వచ్చిందనుకుంటున్నారూ! వాళ్ళ చుట్టం వున్నాడులెండి—-ఆఫీసర్‌గార్కి ఏదో చుట్టచెప్పేడు! వీడివల్ల అ చుట్టానికి పనులు కావాలి- అందుకని ఈ సహాయం చేసేడు. ఇదంతా వీడి ప్రజ్ఞేం కాదు!-"అని, ఇలాంటి మనుష్యుల మధ్య నిజాయితీకి నీతికి విలువ వుండాలనుకోడం-వుంటుందనుకోడం. కేవలం భ్రమ! --

అందుకే ముకుందం...తన పేరు ప్రమోషన్ లిస్టులో రాగానే తట్టుకోవాల్సిన పరిస్థితుల్ని తేల్చుకున్నాడు. తట్టుకుంటూ వస్తున్నాడు గూడా!

'ముకుందం మామగారు ఉద్దండమోయి!సాధించేడు మొత్తానికి అల్లుడికి ప్రమోషన్ వచ్చేలా చేసేడు!'అన్న మాటలు ముకుందం చెవుల్లో పడక పోలేదు! విని వూరుకున్నాడు. మనసులోనే నవ్వుకున్నాడు.

'బావమరిది మధుసూదనం దేవనరాంతకుడు! బొమ్మని-తిమ్మి, తిమ్మిని-బొమ్మి చేయగలడు. బావగార్ని అమాత్రం పొజిషన్ లోకి తీసుకురాలేడూ?'అన్న పలుకులూ విన్నాడు. ములుకుల్లా గుచ్చుకున్నా వూరుకున్నాడు చేసేదేమిలేక!

నిజానికి తన ప్రమోషన్ ఏ రి ప్రమేయం లేకుండా న్యాయంగానే వచ్చింది. అయినా ఎదుటి వాడి దగ్గ అలాంటిది. అందుకనే వాళ్ళ బాధ నర్థం చేసుకున్నాడు కానీ తన దూరపుబంధువు ఇంత ఆత్మీయంగా నిష్కల్మషంగా మాట్లాడేసరికి ముకుందం హాయిగా ఫీలై ఇంటికి చేరేడు. షర్టు విప్పకుని లుంగీ కట్టుకుని బాత్‌రూంలో అలసటంతా కడిగేసుకుని తీరికగా కూర్చున్నాక భార్య ఇచ్చిన కాఫీ అందుకున్నాడు.

కాఫీ వేడిగా వుంది. - పైన ఫ్యాను గాలి చల్లగా వుంది. ఎదురుగా నవ్వులు చిందిస్తున్న భార్య చక్కగా వుంది. ముకుందంలో ఇంత క్రితం పొందిన హాయి చాలాకా గుర్తులు ఇంకా మిగిలే వున్నాయి. కనుక అన్నీ ఏకకాలంలో అనుభవిస్తున్న ముకుందం, నిజంగా ప్రమోషన్ వస్తున్నప్పుడు పొందవలసినంత ఆనందం పొందేడు.

ఆ ఊపులో కాఫీ మరింత జోరుగా పీల్చేడు. రెండు గుటకలు వేసేడు. 'ఏమిటి మీరు ఇందాక బజారులో మీ చుట్టంతో కబుర్లు పెట్టుకున్నార్ట? మా నాన్న పని చూసుకువస్తూ చూసేర్ట! ఇన్నాళ్ళ సంగతేమో కానీ ఇక మీరు జాగ్రత్తగ ఉండాలండీ! ఎక్కడెక్కడి బీరకాయ పీచులు ఇప్పుడు చుట్టాల్లా చుట్టు కుంటాయి. మీ అమాయ కత్వాన్ని అలుసుచేసుకొని అందరూ మీకు దగ్గరవుతున్నారు. బొత్తిగా అంత సిన్సియారిటీ పనికిరాదండీ? దర్పం దర్జా నేర్చుకోవాలి. అసలు అలా ఎవరైనా పిలిస్తే వినిపించుకో కూడదు. వినబడనట్టు..కనబడ నట్టు. దూసుకుని వచ్చేయాలి. ఇవన్నీ మేము చెప్పాలా! మీకు తెలియ వద్దు. ఛ! నాన్న ఇందాక చెపుతూంటే ఎంత సిగ్గనిపించిందో, ఇంక మీ రెప్పుడు మారుతారు.' అంది భార్య పద్మ.

ముకుందానికి కాఫీ వేడి కషాయంలాగ అనిపించింది. చిన్న పిల్లాడికి బుద్ధులు చెపుతున్నట్టు నుంచున్న భార్యలో అరిందాతనం

కొట్టొచ్చినట్టు కనబడిందేగాని అంతకు ముందు కనిపించినచక్కదనం మళ్లీ కనిపించలేదు.

తప్పనిసరిగా కాఫీ తాగేసి కప్పు కింద పెట్టేడు పద్మవైపు చూడాలనిపించలేదు. పక్కనున్న పేపర్ అందుకున్నాడు.

'వింటున్నారా నేను చెప్పేది, నిజంగా ఈ ఊళ్లోనే పుట్టిల్లుండబట్టి మా వాళ్ళంతా నాకు ఆసరాగా ఉండబట్టి మనల్ని ఇలా జాగ్రత్తగా చూస్తున్నారు గానీ లేకపోతే మనమెలా ఉండేవాళ్ళమో. ఇకనుంచైనా కాస్తంత తెలివి తేటలు ఒంట బట్టించుకోండి. ఎన్నాళ్ళని మా వాళ్ళు మంచి చెడ్డలు చెపుతూ ఉంటారు మనకి.–' కాఫీ కప్పు తీసికెళ్ళిపోతూ చురుగ్గా చూసింది.

ముకుందం మనసు కుతకుతలాడి పోయింది. నోటి చివరి మాటలు అక్కడే నిలిచిపోయాయి కానీ బయటికి రాలేదు.

తానెంతో ఉన్నతంగా ఊహించుకున్న వ్యక్తిని మూలనాడి మాట్లాడ్డానికి వీళ్లెంత వాళ్లు. వీళ్ళంటే. అర్థాకివైపు వాళ్ళు. మనం ఓ మెట్టు పైకి ఎక్కుతున్నామంటే...ఇక కింది వాళ్ళందరినీ కించపరచాలా, వీళ్ళ భావాలు ఇలా ఉన్నాయి కానీ, ఇందాక ఆ బంధువు ఎంత ఆత్మీయంగా సరళంగా పల్కరించేడూ, అందులో తనకి తప్పు కానీ అంతరార్థం కానీ వెతుక్కోవాలనిపించలేదు. మామగారు ఏదో పని మీదో వెళుతూ చూడ్డం, దానికి చిలవలు పలవలు కల్పించి కూతురుకి చెప్పడం...ఆ కూతురు తనని నిందీయటం...ఏం సబబుగా వుంది. ముకుందానికి పిచ్చికోపం వచ్చి ఎదురుగా ఉన్న స్టూలుని ఒక్కతన్ను తన్ని లేచి వీధి వరండాలోకి వచ్చి నిల్చున్నాడు.

రోడ్డుమీద ప్రతివాడు ధీమాగా స్వతంత్రంగా బ్రతుకుతున్నట్టుగా కనిపించేడు, ఏ దృష్టితో చూస్తే ఆ విధంగా కనిపించడం సహజం. ముకుందానికి తనమీద తనికి కోపం వచ్చినప్పుడు గానీ-లేక

ఇంట్లో ఎవరి మీదైనా వచ్చినప్పుడు 7గానీ ఏం చేయలేక..మిగతా ప్రపంచంతో తనని పోల్చుకుని చూసుకుంటూ ఉంటాడు.

చాలా సేపటివరకు వరండాలో నిల్చున్న ముకుందం క్రమంగా మామూలు స్థితిలోకి వచ్చేసి ఇంటిలోకి వచ్చేశాడు—

అసలు రోజు రానే వచ్చింది.

ఆ రోజే ముకుందానికి ప్రమోషన్ రాబోతోంది.

వేకువ జామునే మెలుకువ వచ్చింది ముకుందానికి.

లేచి మంచం మధ్యలో మోకాళ్ళ చుట్టూ చేతులు చుట్టుకుని కూర్చున్నాడు, గోడమీద వెలుగుతున్న బెడ్ లైట్ ని... టేబుల్ మీద టిక్ టిక్ మంటున్న గడియారాన్ని రెప్ప లార్చుకుంటు చూస్తూ...ఆలోచిస్తు న్నాడు. ఆ ఆలోచనల్లో ఆ రోజు జరగబోయే దృశ్యాలన్నీ ఊహించు కున్నాడు.

ఇవేళ తన కుర్చీ మారుతుంది రూమ్ కూడా మారుతుంది. కొలీగ్స్ లోపల ఏడ్చుకున్నా ..పైకి విష్ చేస్తారు.

వ్యూస్లు మునుపటిలా వుండరు.వినయం ఒలక బోస్తారు। జీతం పెరుగుతుంది।హోదా పెరుగుతుంది. జీవితం మారుతుంది. పరపతి రెట్టింపువుతుంది.

కానీ—

ఎన్ని జరిగినా...మారనిది ఒకటుంది।।

తనకి పుట్టుకతో అబ్బిన మెతకదనం...

తన డేటాఫ్ బర్తు ప్రకారం ఈనాటికి ముప్పై. కానీ సర్టిఫికెట్ల ప్రకారం చూస్తే ఇరవై ఎనిమిది. అలెక్క తండ్రి వేయించింది. ఆ విధంగా తను రెండేళ్ళ జీవితంలో 'వుండి' లేనట్టుగా తండ్రి నిరూపిస్తే పిల్లనిచ్చిన మామగారు తనని కేవలం రెండేళ్ళ పసిపిల్లా

డిలా మాత్రమే చూస్తూ... ఇరవై ఆరేళ్ళ జీవితంలో నుంచి తీసి పారేశాడు. చిన్నపిల్లాళ్ళా చూస్తూ బతకడంలో 'అ'ఆ,లు నేర్పిస్తున్నాడు, ఆయన విలు లేనప్పుడు బావమరిదిగానీ, తన భార్యగానీ ఇంకా పోతే అత్తగారుగానీ నేర్పిస్తూవుంటారు।--

''మంచిదే। తనని పసిపిల్లాళ్ళా చూస్తే సింతోషమే। కానీ ఇన్నాళ్ళ నుంచి ఊపిరి పోసుకుంటున్న మున్ఫైఏళ్ళ 'వ క్తిత్వం' సవాల్ చేస్తోంది. నీజీవితం నువ్వు తెలుసుకోవాలి గాని నీ మీద వాళ్ళ అధారిటీ ఏమిటి? అని నిందీస్తుంది.తనకి ఎన్నోసార్లు పౌరుషం పొంగుకు వచ్చింది. కానీ ఏం లాభం? ప్చ్। ప్చ్ ప్రతిసారి ఈ మెతకదనం అడ్డుపడి వెనక్కిలాగేస్తుంది. ఏం చేస్తాడూ? ఏం చేయలేక కేవలం ఇద్దరు పిల్లల తండ్రిగా మిగిలిపోయేడ.।।

మోకాళ్ళ చుట్టూవున్న చేతుల్ని నడలించి పక్కకి చూసేడు. రెండేళ్ళ బాబి తల్లిమీద ఒక కాలు ఒక చేయి వేసుకుని నిశ్చింతగా పడుకున్నాడు. ఆ పక్కనే నాలుగేళ్ళ పాప 'తనలాంటి వెర్రిముఖంతో అమాయకంగా 'అమ్మ తమ్ముడిదే కాబోలు' అనుకున్నట్టు దూరంగా జరిగి కిందికి దొర్లి పడుకుంది. చాపమీద వేసుకున్న పరుపంతా తల్లీ కొడుకులు ఆక్రమించుకున్నారు.

పాప తన పోలికట-అదృష్టవంతురాలట. ఆ మాటలు శ్రీమతి అన్నవి. ఎలాంటిదా అదృష్టం? తనలాగే నోట్లో నాలుక లేనట్టు అందరికీ తలవంచి మనసును చంపుకుని బ్రతుకుతుందా? మరి తన పోలిక అంటే అంతే కదా। ఇదేనా పాప అదృష్టం?-

మరి బాబో? వాడు తల్లిని పోలిన తనయుడట. అందుచేత అదృష్టవంతుడే-అయితే ఆ అదృష్టం ఎలాంటిది?

ఆవిడ ఏడోక్లాసు ఐనా ఎమ్.ఎ. వాళ్ళకి టీచ్ చేయగల తెలివి తేటలు గలది. నోరున్నది. అనుకున్న పని నెరవేర్చుకోగలది. కనుక ఆ పోలికలన్నీ బాబుకొస్తే వాడురాజాలా బ్రతకగలడు. వాళ్ళమ్మలాగే

అసలు పెళ్ళి చూపుల్లో మామగారు.. తన బియ్యే సర్టిఫికేటు వాళ్ళమ్మాయి థర్డుఫారం ప్రోగ్రస్ రిపోర్టుతో తూకం వేసుకుని చూసుకున్నారు. తన సర్టిఫికేట్ పైకి లేచిపోతుంటే కాస్సేపు ఆలోచించి 'సరే ముందు ముందు డిపార్టుమెంట్ టెస్టులు..సర్వీస్ కమీషన్ పరీక్షలు వ్రాస్తైతే అప్పుడు ఆ తూకం సరిపోతుంది"అని సరిపెట్టుకొని ముహూర్తాలు పెట్టుకున్నారు.

ఇప్పటికి ఆ తూకం సరిపోయేదే। కాని ఈ మధ్యనే హిందీ పరీక్ష పాసయింది కనుక, తూకం ఇంకా సరితూగలేదు, అందుకే పద్మ అంత దర్జాగా పడుకుని నిద్రపోతుంది. అంతేకాక ఆవిడగారి భర్తకి ప్రమోషన్ కూడా వచ్చింది కదా?

ఆ తలంపు రాగానే ముకుందానికి నవ్వు వచ్చింది. 'నిజమే కదూ। తనకి ప్రమోషన్ వచ్చిందికదూ' అనుకున్నాడు. ఏదో సంతోషం ఎంతో కలిగింది. ఎప్పుడూ లేని ఏకాంతంలో ఆ తెల్లవారగట్ట హాయిగ ఓ సిగరెట్ కాల్చుకుందామని బుద్ధి పుట్టింది. మంచం దిగి షర్టు జేబులోనుంచి సిగరెట్ పెట్టె అగ్గిపెట్టె తీసుకొని మళ్ళీ మంచం మీద కూర్చున్నాడు.

కిటికీ రెక్కలు తెరిచి మసక వెలుగులో కనిపిస్తున్న ప్రకృతిని చూస్తూ సిగరెట్ దమ్ము పీలుస్తుంటే, అబ్బ! తను నిజంగా ఎంత అదృష్టవంతుడో, అనిపించింది. ఆ పరవశంలో పరిసరాలు మర్చిపోయి కూర్చున్నాడు.

ఇంతలో పద్మకి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూసింది. ఎదురుగా మంచం మధ్యలో కూర్చుని ధూమపాన సేవిస్తూ చిద్విలాసంగా కనిపించేడు ముకుందం

కళ్ళు రెప రెప కొట్టి టక్కున లేచి కూర్చుంది. అలా లేవడంలో తనమీద వేసి పడుకున్న బాబిగాడి చేయి కాలు విసురుగా తోసేసింది

ఇంతలో బాబు లేచి పక్కన తల్లి లేకపోవడంతో ఏడుపువచ్చి కాళ్ళు చేతులు తన్నుకొంటూ దూరంగా కిందికి జరిగి పడుకున్న పాపని పొట్టమీద తన్నేడు. నిద్దట్లో వున్న పాప లేచి అమాయకంగా చూసి ఇంకా దూరం జరిగి పడుకోబోయింది. కాని బాబు యింకా కాళ్ళతో తన్నుతూ పరుపంతా దున్నేస్తున్నాడు. ఏడుస్తున్నాడు పద్మ లోపల ఎక్కడుందో రాలేదు ముకుందానికి బాబుని చూసి ఒళ్ళు మండింది. అంతక్రితం పద్మ మీద వచ్చిన కోపాన్ని గూడా కలుపుకుని దిగ్గునలేచి బాబు వీపుమీద ఒక్క చరుపు చరిచి, పాప నెత్తుకుని మంచం మీద పడుకోబెట్టాడు, అంతే! బాబు ఠక్కున నోరు మూసుకుని బోర్లా పడుకున్నాడు. ఆ క్షణంలో ముకుందానికి ఓ పరమ సత్యం స్ఫురించింది! ఇన్నాళ్ళుగా తనేం చెయ్యలేదో. ఇప్పుడు ఏం చేయాలో బోధపడింది! ఉత్సాహంగా బయటికి నడిచేడు.

ఆ తర్వాత పనులన్నీ యధావిధిగ చేసుకుని ఆఫీసుకి వెళ్ళేడు. తిన్నగా ఆఫీసర్‌గారి రూమ్‌లో కెళ్ళి ఆయనకి కొన్ని విన్నపాలు వినిపించేడు.

ఆఫీసర్ తెల్లబోయి--"ఇదేమిటి ముకుందం? ఎందుకనీ।" అనడిగేడు.

ముకుందం మొహమాట పడకుండా తనకున్న సాధకబాధకాలన్నీ విశ్లేషించుకుని, "సార్ జీవితంలో ప్రమోషన్ పొందేటంత వరకూ ఉద్యోగంలో ప్రమోషన్ పొంది లాభంలేదు. వ్యక్తిత్వం నిల్పుకోగల్గినవాడే ఏ పనైనా స్వయంగా ఆలోచించి మంచి పనులు చేయగలడు। మేధకుడు, మెతకవాడు ఉన్నత పదవిలో వున్నా ఆ పదవికి న్యాయం చేకూర్చి రాణించలేరు అవునంటారా। కాదా! నేను నా స్వాతంత్ర్యాన్ని నిలుపుకో గల్గినప్పుడే ఈ ప్రమోషన్‌కి అర్హుణ్ణి అంతవరకు నా పేరు లిస్టులో పక్కకి జరిపి తర్వాత వారికి ఇవ్వండి! ప్లీజ్ అండర్‌స్టాండ్‌మి।" అన్నాడు బాధగా.

ఆఫీసర్ ఒన్నగా నవ్వి, "ఆల్ రైట్ మిష్టర్ ముకుందం! ఐ కెన్ అండర్‌స్టాండ్! నీ లాంటి వాళ్ళే అందరూ అయితే ఆఫీసులన్నీ ఎప్పుడో బాగుపడి పోవును. తనని తాను ఉద్ధరించుకోలేని ప్రతి బడుద్దాయికి పై పదవుల మీద ఆశే, నీ కేసు విచిత్ర అనుభూతిని కల్గిస్తోంది. సరే తాత్కాలికంగా ఈ ప్రమోషన్ నిలుపుతున్నాను. విష్ యు గుడ్ లక్!" అన్నారు తల పంకిస్తూ.

"థాంక్ యు సార్!"—అని బయటపడ్డాడు ముకుందం.

ఆ తర్వాత బంధువుల్లో స్నేహితుల్లో కలిగిన సంచలనం, అలజడి ఎలాంటివో అన్న ప్రశ్న అలా ఉండనిచ్చి—

ముకుందం స్వయంగా ప్రమోషన్ కాన్సిల్ చేయించుకున్నాడన్న వార్త విని, 'స్వజనం' విస్తుబోయి-"ఎందుకూ? ఏం జరిగిందీ" అని కూడా అడగటానికి సాహసించలేక పోయారు. 'ఇంత తెగువ ఈ మనిషికి ఎలా వచ్చిందా!' అనుకున్నారు.

అప్పుడు ముకుందం నిజంగా ప్రమోషన్ పొందిన వాడిలాగే నవ్వాడు!!



# ఆదర్శానికి అడుగు దూరం

(1982 సం॥లో ఆంధ్రభూమి సచిత్ర వారపత్రికలో
ప్రచురించబడిన కథ ఇది)

'టక్....టక్....టక్....టక్' టైపు మిషన్ మీద వేళ్ళ అలవాటు ప్రకారం కదిలి పోతున్నాయి. కానీ మనసు మాత్రం అలవోకగా పరధ్యానపుటంచుల్లోకి తొంగిచూస్తోంది. చటుక్కున అక్షరాల మీదపడి తెప్పరిల్లుతోంది.

పొరపాట్లు...పొరపాట్లు...

ఏమిటి? ఇవాళ తనకి ఇంత పరాకు కల్గుతోందీ? ఎప్పుడైనా ఆఫీసులో తను ఇలా వుందా? సీటు మీద కూర్చుంటే - టైప్‌మిషన్ మీద వేళ్ళూ అక్షరాల మీద కళ్ళూ. చకచకా తిప్పుతూ పక్కవాళ్ళు పలకరిస్తే బదులిస్తూ.. ఏకకాలంలో అన్నీ చేస్తూనే ఒక చిన్న పొరపాటు దొర్లకుండా కొట్టేది అలాంటిది ఇవేళ ఇదేమిటి? ఎన్నోసార్లు ఒకదానికొకటి కొట్టేయబోయింది. కొలిగ్ పల్కరిస్తే వినిపించుకోలేకపోయింది.

ఛ తనమనసు ఇంత వశంతప్పుతోందా?

"హల్లో! కంగ్రాట్యులేషన్స్ వసంతా! మ్యారేజ్ సెటిల్

అయ్యిందట? ముహూర్తం ఎప్పుడూ? బైదిబై హనీమూన్ ట్రిప్ కూడా"...

"ఛ నీకు బొత్తిగా నోరు ఊరుకోదు" టక్కున ఆపింది, రాజిని.

వసంత ముఖంలో చిరుకోపం చూసి రాజి చిన్నగా నవ్వింది.

"ఎందుకట ఆ కోపం? తప్పుమాట కాదే? జోకు అసలే కాదు... ఎటూ జరగబోయే పచ్చి నిజం! ఇంకెందుకు దాపరికం?" అంది కవ్వింపుగా కాస్త లోగొంతుకతో.

"చాల్లే! ఆఫీసులోనే ఒలకబొయ్యాలే సరాగాలన్నీ?"

రాజీ తమాషాగా నాలికకరుచుకుని "నిజమేకదూ? మామూలు విషయంలా మాట్లాడేస్తున్నాను. మ్యారేజి సంగతి గనుక.. నీకు గిలిగింతలు కల్గేది కనుక... ఏకాంతంలో పల్కరించటం న్యాయం" అంది.

"అబ్బబ్బ! రాజీ ప్లీజ్! నీ ధోరణి ఆపు. అందరు ఇటే చూస్తున్నారు ఒక్క అయిదు నిముషాల్లో నాపని అయిపోతుంది. బయటకి వస్తాను కాంటిన్‌లో మాట్లాడుకుందాం!" అని మందలించి సీరియస్‌గా పనిలో మునిగిపోయింది వసంత.

రాజి నవ్వి బయటకి వెళ్ళింది.

ఈసారి వసంత మనస్సు ఏకాగ్రతగా నిల్పి పని పూర్తిచేసి లంచ్‌కి బయటికి నడిచింది.

"ఎలాగైనా అదృష్టవంతురాలివే వసంతా పైసా కట్నం అక్కర్లేదనే పురుషుడు ఈరోజుల్లో ఎక్కడ దొరుకుతాడే? ఏనాడో నువ్వు ఆ 'గాడ్'కి అప్లికేషన్ పెట్టుకొని వుంటావు కొంత ఆలశ్యమైనా ఈనాటికి అది మంజూరు చేసేడు థాంక్‌గాడ్ ఆడపిల్లలందరి అప్లికేషను ఇలాగే సీరియల్ ఆర్డర్‌లో ఓ కే చేస్తే... ఇక స్వర్గాన్ని మేముకోరం. ఆపనిలోనే దివిని సృష్టిస్తాం ఆశలన్నీ పూరేకుల్ని చేసేస్తాం పూవులన్నీ, కాయలై... పండ్లయి..."

"ఆ! ఆ! తప్పు తప్పు పూరేకుల్లోనే ఆగిపోవాలి! లేకపోతే కొంపమునిగిపోతుంది. ప్రతి పువ్వూ కాయై పండైతే... ఆ పళ్ళ భారానికి చెట్టువంగి సంసారభారం భరించలేని కుటుంబీకుళ్ళా ఆ చెట్టు వంగుతూవుంటే, ఆ సంసారంలో చితికిపోతున్న సంతానం లాగ..." అని ఆగింది పద్మ వెంటనే అందుకుంది రేవతి—

"ఆ పళ్ళన్నీ నేలరాలి పరువంలోనే మాధుర్యం కోల్పోయే మన అడకూతుళ్ళలాగ చితికిపోతాయి..."

"కరెక్టు" అంటూ ఫ్లాష్ చేసింది కృష్ణవేణి.

"ఒప్పుకున్నాం కనుక ఆ పువ్వులన్నీ అలాగే అందాలు విర జిమ్ముతూ ఒకటో, రెండో మాత్రం చక్కని పండ్లయి... చెట్టుపైన హుందాగా అలరారుతూ వుంటాయి. వాటికోసం మెడలు విరిగేలా అందరూ తల ఎత్తి చూడాల్సిందే తప్ప నేలరాలి చులకనైపోవు యాపై కరెక్టు?" రాజీ చిత్రంగా తలవూంచి కృష్ణవేణిని అడిగింది.

"యస్! సెంట్‌పర్సెంట్!" మెచ్చుకోలు భంగిమలో చూపుడు వేలు ఆడించి చెప్పింది కృష్ణవేణి.

వాళ్ళందరి కామెంట్లు వింటోంది అరుణ! ఆమె పెళ్ళయిన యువతి! వాళ్ళందర్నీ జాలిగా చూస్తోంది. నిన్న మొన్నటివరకు తనూ వాళ్ళలాంటి కన్నెపిల్లే! తండ్రికి భారమైన బిడ్డే! ఎలాగో ఆ వలయం నుంచి బయటపడి - ఇంటి ఇల్లాలైంది.

ఇప్పుడు వీళ్ళంతా విసురుకునేవి ఛలోక్తుల్లా వినిపిస్తున్నాయి వాళ్ళ హృదయాంతరాళాల్లో ఉరికిపోతున్న ఆవేదన తనకు తెలుసు! అదంతా గొంతులోనే చల్లార్చుకుని చిరునవ్వులా మార్చుకుని ఛలోక్తుల్లా బయటికి విసురుకుంటూ నటించేస్తున్నారు.

ఇదొక స్టేజిలేని నాటకం.

వేషధారణ అక్కర్లేని దొంగాటకం.

బండరాళ్ళల్లాంటి దిగుళ్ళు... గుండె లోతుల్లో... అదిమిపట్టి

కుని పైకిమాత్రం సెల ఏటి గలగలలూ కిలకిలారావాలతో చీకుచింతా లేని దేవకన్యలా నటించేస్తున్నారు. ఆఫీసులో వున్నంతసేపు వీళ్ళు కిన్నెరలు, అప్సరసలు, మిస్ ఇండియాలో, మిస్ ఆంధ్రాలో అన్న ట్లుగా అందరికళ్ళు వీళ్ళ చుట్టూ తిరుగుతూ వుంటాయి.

ఇంటికివెళ్తే... మధ్యతరగతి జీవితపు నగ్నసత్యాలు అమాం తంగా కౌగలించుకుంటాయి వీళ్లని. ఆ సత్యాలు రకరకాలు కావచ్చును. కానీ అందరికీ ఒక సమస్యమాత్రం కామన్! ఏమిటదీ?

ఇంకా ఏమిటి? పాతికేళ్ళ పరువం వరదపొంగులా నిలువెల్లా చుట్టుకుపోతుంటే - చేయి అందించి దరిజేర్చుకునే మగధీరుడెవడూ ముందుకు రావటంలేదు! ఆఫీసులో ఎంతో ఇదిగా చూసే 'మగకళ్లు' 'పెళ్ళి' పేరెత్తితే 'వేలంపాట'లో కూర్చుంటారు. ఆ పాటలో గొంతు పెంచలేని తండ్రుల బిడ్డలు వీళ్ళు. అందుకే ఆఫీసులో అందాలరాణుల్లా అ దరి చూపుల్లో నిలిచిపోతున్నా— నిజజీవితంలో మాత్రం పనికిరాని చెత్తకాగితాల్లా మిగిలిపోతున్నారు.

ఇన్నాళ్ళకి వసంతకి అదృష్టంపండి కట్నంవద్దనే వరుడు లభిం చేడు. ఆ అబ్బాయి ఎవరోగాని మగజాతికి మచిపూస అనుకోవాలి. ఇలాంటివాళ్ళు మరికొందరు ముందుకువస్తే... అబ్బ! నిజంగానే ఈ రాజి అన్నట్టుగా భూతలం మీద ఆనందాలు విరాజిల్లవా? ఆడపిల్లల జీవితాలు పన్నీటి జలాశయాలుకావా? వీళ్ళ చిరునవ్వులు నిజమైన విరితూపులు కావా?

అరుణ గడ్డంక్రింద చేయి ఆన్చుకుని వసంతకి పట్టబోతున్న అదృష్టాన్ని... ఆమె అందానికి బేరీజువేసి ఎంతవరకు తూగుతుందో అంచనా వేస్తోంది!

నిజానికి వసంత బాగానే వుంటుంది! లేతరంగు ఫుల్‌వాయిల్ చీరలో నాజూగ్గా వి సిన చెంబేలీ పువ్వులా వుంటుంది. మనిషి ఎంత గంభీరమో మనసంత బేల! ఆ పిల్ల పైవుచేస్తుంటే చూడ ముచ్చ టేస్తుందీ' ఎన్నోవిధాల ఉన్నతశ్రేణిలో వుండదగినది. ఆపిల్లకున్న

పాపమల్లా...మధ్యతరగతి ఇంట్లో ఆడపిల్లలు పుట్టటమే। ముందూ వెనుక అక్కచెల్లెళ్ళు వుండటమే। అందుకే ఇంతకాలంగా ఎల్లలులేని ఎడారిలా... గుర్తింపులేని పచ్చిక బయలులా నిర్జీవంగా మగ్గిపోయింది ఇన్నాళ్ళకి ఆ తప్పు మన్నించి ఆమె చేయి అందు కుందుకు ఓ దివ్య పురుషుడు ఆదర్శమూర్తిగా సాక్షాత్తు అవతారమెత్తినట్టు ప్రత్యక్ష మయ్యాడు.

వసంత జీవితం వసంతమే కాబోతోంది అనుకుంది అరుణ రాజీ, పద్మ, రేవతీ, కృష్ణవేణీ వసంతని ఏవో జోక్సువేసి ఆటలు పట్టిస్తున్నారు. గదంతా నవ్వులతో నిండిపోయింది. కాంటిన్‌లో లేడీస్‌రూమ్ అంటు ఒకటి వుందిగనుక వాళ్ళ అల్లరికీ స్వేచ్ఛకీ అడ్డు లేదు.

లంచ్‌టైమ్ అయిపోయేవరకు ఆ సంతోషపు పొంగులు ఆ గదిలో ఎగిరెగిరి పడ్డాయి.

సాయంత్రం ఇంటికి వస్తున్న వసంతకి రోజుమాదిరిగా నీర్సం నిరుత్సాహం ఆవరించలేదు. కొద్దిరోజుల్లో తను ఎంతో ఎత్తుగా ఆనందశిఖరం ఎక్కబోతున్న అనుభూతి... దివ్యలోకాల్లో అడుగు పెట్టబోతున్నప్పటి మధురస్మృతి...గుండెల్లో నిండిపోతోంది.

అంతకు మించి ఇంట్లో అంతా తనని ప్రత్యేక శ్రద్ధతో చూడటం కొంత ఇబ్బందిగా వున్నా ఈగొప్పంతా కాబోతున్న ఆ వరుడివల్ల కలుగుతున్నదే కదా అని అతనిమీద గౌరవం పెరిగి ఆ మహానీయునికి మనసులోనే కృతజ్ఞతలు తెల్పుకుంటోంది.

కాళ్ళూ చేతులు కడుక్కుని అమ్మ అందించిన కాఫీగ్లాసు తీసు కుని గదిలో కిటికీదగ్గర నిలబడింది.

ఎదురింటి వరండాలో సావిత్రి చంకలో పసిపిల్లాడిని ఎత్తు కుని నిల్చుంది. ఆ కళ్ళలో తెల్లగా మెరిసే మెరుపులు, వెలుగు, ఏదో చల్లనిగాలి పీలుస్తున్నటు ఎంత రిలీఫ్‌గా వున్న ఆ ముఖం?

భర్త కేంప్‌కి వెళ్ళి నట్టున్నాడు ఇంక ఈ రెండు రోజులు సావిత్రికి స్వేచ్ఛగా హాయిగా వుంటుంది వాడు ఒట్టి అనుమానాల గొడ్డు. సావిత్రి నవ్వితే అనుమానం ఏదైనా అనుమానం! పెరట్లో పంపుదగ్గర ఆలస్యం చేస్తే...ఇంట్లోకి రాగానే గొంతు చించుకుంటాట్ట వీధుల్లోకి వచ్చి అలా ఫ్రీగా చూడటమేం? వీపు చీరేయడూ?

సావిత్రి చేస్తున్నది సంసారం కాదనీ సర్కస్‌లో చూపె సింహంనోట్లో తలదూర్చే ఫీట్ అనీ ప్రతిరోజు కత్తులమీద నడుస్తున్నట్టే ఉంటుందని అమ్మ దగ్గర చెప్పుకుని ఏడుస్తుంది. ప్రాణం విసిగి చచ్చి పోదామన్నా ఇదిగో ఈ కుర్రవెధవ కోసం ఆ పని చేయలేకపోతున్నానని చెప్తుంది.

వసంతకి ఒళ్ళు మండి 'పోనీ వదిలేసి వెళ్ళిపోరాదుటండీ?' అంది ఓసారి. అప్పుడు సావిత్రి ఎలా నవ్వేదీ?

ఎక్కడికి పోవాలి? పుట్టింటికా? అక్కడ నీతి సూత్రాలన్నీ చెప్పినవాళ్ళు మళ్ళీ ఇక్కడికి తీసుకువచ్చి ఈయన కాళ్ళమీద పడేస్తారు.

ఉద్యోగం చేసుకుని స్వశక్తి మీద బ్రతకాలా! గ్రాడ్యుయేట్స్‌కే దొరకని జాబులు టెన్తక్లాసు పాసుకి ఎక్కడ దొరుకుతుంది. పోనీ వంటలు చేసుకునో, అంట్లు తోముకునో బ్రతుకుదామంటే.. ఒక్కమాలిన పరువు ఒకటిగొంతు పట్టుకుంటుంది. పైగా 'పరువం' అందరి కళ్ళకి అలుసు అవుతుంది.

అమ్మా వసంతా! చెప్పినంత తేలికకాదు సంసారం వదిలేసి పోడం దయామూర్తులైన వారి అసరా లేనిదే నా బోటి ఇల్లాలు ఇల్లు విడిచి బయట సమాజంలో బతకలేదమ్మా ఇదంతా సావిత్రి చెప్ప లేదు ఆమె నవ్విన నవ్వులో దాగివున్న అర్థం. వివేకంతో నెమ్మదిగా ఆలోచించేక వసంతకే అర్థమైంది ఆ నవ్వులోని అంతరార్థం ఆ తర్వాత అలాంటి సలహా మరెప్పుడూ చెప్పలేదు.

సావిత్రిని అలా చూస్తున్నప్పుడు 'పావం' అనుకుంటుంది. సావిత్రి మీద అలా సానుభూతి చూపిస్తూ కాఫీ తాగుతూ.. తనకి కాబోయే శ్రీవారి గుణాల్ని పదే పదే తల్చుకుంటు...నిలబడింది.

ఎంత మంచివారు? పెళ్ళి చూపుల్లో అసలేమీ అడగలేదే? తనకి అలాంటి తంతు ఇష్టం లేదన్నారు. కట్నం ప్రసక్తే లేదన్నారు. పెద్దగా అంద చందాలు లేకపోయినా ఇన్నేసి సుగుణాలున్న అతను మన్మధుడిలా కళ్ళలో మెదులుతున్నారు. తనేంత పుణ్యం చేసుకుందో.

ఇంటిముందు ఆటో ఆగింది. రామం అన్నయ్య బియ్యం బస్తాలు దింపిస్తున్నాడు. వారం రోజులనుంచి పెళ్ళిసరుకులు తేవడమే సరిపోతోంది. అన్నయ్యకు ఐనా ఇదేమిటీ? అక్క పెళ్ళికి ఇన్నేసి సామాన్లు తెచ్చినట్టులేదు. ఇప్పుడు ఇంత భారీగా తెస్తున్నారేమిటీ? ఎందుకు ఇంత ఆర్భాటం? తను వారించబోయినా వినిపించుకోటం లేదు. ఏమిటో పిచ్చివాళ్ళు

వారు కట్నం వద్దన్నారని పెళ్ళి బాగా డాబుగా చేయాలనుకుంటున్నారులా వుంది. కానీ ఇవన్నీ ఆయనకి తెలిస్తే ఊరుకుంటారా ఈ హడావిడంతా నా కిష్టంలేదని చెప్పేయారూ? ఊ! అలా అల్లుడుగారు చెప్తే కానీ ఈ అమ్మా నాన్నలు వినిపించుకోరు. కూతురిమాటలు ఎక్కడ తలకెక్కుతాయి!

కానీ ఆయనగార్కి ఎలా తెలియాలి!

పోనీ తనే తెలియచేస్తేనో!

అంటే నారితో తను మాట్లాడాలి! ఎలా! ఎక్కడ। ఎప్పుడు!.. ఓహ్। ఆఫీసునుంచి ఫోనులో మాట్లాడితే। అబ్బ థ్రిల్లింగ్‌గా ఉంటుది. కానీ తన చుట్టూ తన పరివారం ఉంటారే ఎలా! అయినా సెక్షన్ ఫోను రిపేర్‌లో ఉంది గదా। ఏం చేయాలీ। ..

ఆలోచనలో పడింది.

''యస్! అలా చేయాలి!'' అనుకుని ఓడిరెవేసింది హుషారుగా మరోమారు సావిత్రిని జాలిగా చూసి, కాఫీ పూర్తిగా తాగేసి కిటికీ దగ్గరనుండి కదిలింది వసంత.

మర్నాడు ఆఫీసులో వసంతకి-అతనికి ఫోనుచేసి మాట్లాడాలనే తన ప్రయత్నం తల్చుకుంటే గుండె దడదడ లాడింది. అతను ఏమైనా అనుకుంటాడేమో! పోనీ మానేస్తే! అనుకుంది. కానీ రాత్రి నాన్న అలిసిపోయి ఇంటికి వచ్చి అరగంటదాకా— వాలు కుర్చీలో కూర్చుండిపోయేరు. ఈ వారం రోజులుగా వేళకి తినక, నిద్రపోక, సెలవుపెట్టి ఎంతలా తిరుగుతున్నారో! అలసట తగ్గేక గ్లాసుడు మజ్జిగ తాగి, అమ్మకి ఒక్కొక్కటే వివరిస్తున్నారు.

'బ్యాండ్‌వాళ్ళు, సన్నాయివాళ్ళు దొరికేరు. వంటవాళ్ళు పురోహితుడు కుదిరేరు. ఒక్క కళ్యాణమండపమే ఇంకా తేలలేదు. అన్నీ బుక్ అయిపోయాయి. అయినా ఒక్కటి వుంది. దానికి రేపు వెయ్యి రూపాయలు అడ్వాన్సు ఇస్తే దొరుకుతుంది' అంటున్నారు.

వెయ్యి రూపాయలు అడ్వాన్సుగా ఇచ్చి ఆ మండపమెందుకట వీళ్ళకి ఏదో వెర్రిగా ఉందే, ఇంక ఈ ప్రయత్నాలు అవకపోతే లాభంలేదు. ఈ క్షణంలోనే ఆయనగారితో మాట్లాడాలి' అని రాత్రే అనుకుంది. కానీ అంతలోనే అది రాత్రి అని గుర్తు తెచ్చుకుని నవ్వు కుంది.

ఇక ఇప్పుడు ధైర్యం తెచ్చుకుని అతనితో ఫోనులో చెప్పా ల్సిందే. గట్టిగా ఊపిరి పీల్చుకుని మెల్లగా సీటుమీదనుంచి లేచి, అటు ఇటు చూసి, రాజీ పద్మవాళ్ళు తనని గమనించకుండా, నెమ్మ దిగా బయటికి నడిచింది.

వరండా చివర బెంచిమీద కూర్చుని సిగరెట్ తాగుతూ స్వీపర్ రంగమ్మతో బాతాఖానీ వేస్తున్న సైదులు-వసంత పిలుపు విని లేచి సిగరెట్ కిందపడేసి బూటుకాలితో నలిపి (అటెండర్ అయినా ఆఫీసర్‌కి మొగుళ్లా ఉంటాడు) ''ఏంటమ్మా,'' అని అడిగేడు.

''ఇదిగో సైదులు, నాకో చిన్న సహాయం చేసిపెట్టాలి'' తటపటాయిస్తూ చెప్పింది.

కిసకిస నవ్వేడు. ఆ వెధవ వంకర నవ్వు వసంతకి అసహ్యం అయినా అవసరం తనది గనుక...ఆ నవ్వేమీ పట్టించుకోకుండా. 'మరేంలేదు. నేను లోపల సీటుమీద ఉండగా పెద్దయ్యగారు ఎప్పుడు బయటికి వెళతారో గమనించి, నా దగ్గరికి వచ్చి 'అమ్మా, మీకు ఫోను వచ్చిం'దని చెప్పాలి. అంటే అయ్యగారు రూములో లేరన్న సంగతి మనవాళ్ళకి తెలియకూడదు అంతే...''

''అదేలేంటమ్మా—అర్థమైపోయింది, మీరు సీక్రెటుగా ఎవరికో ఫోను చేసుకోవాల. అది అయ్యగారు లేనప్పుడేగదా జరిగేదీ, అట్లా చేస్తున్నట్టుగా మిగతా అమ్మాయిలకి తెలియకూడదు. తెల్సినా ఫర్వా లేదనుకుంటే, బేఫికర్‌గా చేయాలనుకుంటే-అయ్యగారు బయటికి వెళ్ళారని చెప్తే చాలుగదా-కానీ ఏ అమ్మాయిగారో మీతోపాటు లేచి వస్తారు. అదే అయ్యగారుంటే రారు. అందుకని అయ్యగారు లేరన్న సంగతి తెలియకుండా మీకు ఫోను వచ్చిందని చిన్న అబద్ధం చెప్తే మీరు ఒక్కరు లేచి రావచ్చును. నాకు తెలుసులెండి, ఇటువంటి ఎవ్వారాలు నాకు ఓ లెక్క...'' సైదులు ఇంకా చెపుతూనే ఉన్నాడు

వెధవ అవులిస్తే పేగులు లెక్కపెడతాడు. వీడితో తను అసలు ఏ పనీ చేయించదు. కానీ ఇవాళ తనకి చాలా అవసరం. సెక్షన్ ఫోను ఎటూ చెడిపోయిందిగనుక ఎవరూ దొంగచాటుగా వినే యోగం కూడా కలగదు కనుక ఈ ప్లాను వేసుకుంది. ఖర్మ ఇవాళ ఈ సైదులుగాడ్ని ఆశ్రయించాల్సి వచ్చింది. వీడంటేనే తనకి ఒళ్లుమంట వాడిమీద కలుగుతున్న కంపరాన్ని అతి బలవంతంగా నిగ్రహించు కుంటోంది.

అయితే సైదులు అదేం గమనించటంలేదు.

ఎప్పుడూ గంభీరంగా ముఖం తిప్పుకునే వసంత ఇవాళ తనకై తాను వచ్చి హెల్ప్ చేయ్యమంది. నా గొప్పేమిటో తెల్సినట్టుంది- అనుకుని హుషారుగా కాలరెత్తుకుని మరీ చెప్పేస్తున్నాడు-

''మొన్న ఆ అయ్యగారెవరో కాస్త రంగు తక్కువగా, పొడుగ్గా వంకీల జుట్టుతో మన ఆఫీసుకొచ్చారు. అంటే అదే ఒకనెల రోజుల కిందటలెండి. ఇలాగే నాకో సహాయం కావాలన్నారు. ఇక్కడేదన్నా ఉద్యోగం కోసమేమో అనుకున్నా, కానీ కాదుట...ఇక్కడున్న అమ్మాయిల వివరాలు కావాలన్నాడు. ప్రత్యేకించి మీ గురించి అడిగేరు. 'మిగతావాళ్ళ సంగతేమోకానీ వసంతమ్మన్నా, నిప్పన్నా ఒకటే అర్థం' అని చెప్పేను ఇంతకీ ఆ బాబు ఎక్కడుంటాడో, ఏం చేస్తాడో చెప్పలేదండి. వాళ్ళ సుట్టాలబ్బాయికి సంబంధం సూడాలని చెప్పేడు. మరి ఎవరైనా మీ ఇంటికి వచ్చేరాండి...?''

సైదులు చివర ప్రశ్న వేసేటప్పటికే వసంత అక్కడనుంచి కదలి వెళ్ళిపోయింది. అంత పొడుగు వరండా ఎలా నడిచిందో... సెక్షన్‌లోకి వెళ్లి సీటుమీద ఎలా కూర్చుందో తనకే తెలియదు.

టైపు చేయాల్సిన కాగితంమీద అక్షరాలు కనిపించటంలేదు. అవని రూపులు సంతరించుకుని మనుష్యుల్లా కనబడుతున్నారు.

కాస రంగు తక్కువగా పొడుగ్గా వంకీల జుట్టుతో ఎవరూ? అతనే కాబోయే శ్రీవారు ఆ పక్కన...కారా ఖిళ్ళీతో, పంచరనవ్వుతో సైదులుగాడు...సిగరెట్ పొగ వదులుతూ...ఏం చెబుతున్నాడూ?

వసంత కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి, ఆకారాలు అల్లుకుపోతున్నాయి. చెవుల్లో హోరు తన నరాలు అదిరిపోతున్నాయి. పెదాలు కంపిస్తున్నాయి. చెంపలు ఎర్రగా కందిపోతున్నాయి. రెండు చేతుల్లో తల పట్టుకుని ఎంతసేపుందో।

'ఏమైందీ! అరే జ్వరమా। కళ్లేమిటి అంత ఎర్రగా! లేలే ఇంటికి వెళ్లు సెలవు పెట్టు...' రాజి వచ్చి లేపి బయటికి తీసుకువచ్చి ఆటో ఎక్కించింది.

ఇంటికి వచ్చేసరికి కొద్దిగా తనని తను కంట్రోలు చేసుకుంది.

'ఏమే వచ్చేసేవూ!'

"ఒంట్లో బాగా లేదమ్మా! చాలా తలనొప్పిగా వుంది."

''అయ్యో అలాగా! జ్వరం రాలేదుగదా! అసలు ఈ వారం నుంచే సెలవు పెట్టమంటే నువ్వు వినవు...'' ఆవిడ గాభరాగా నుదురు తాకి చూసి జ్వరంలేదని తెల్సేక కుదుటపడి, 'టాబ్లెట్ వేసుకో కాఫీ ఇస్తాను తాగి పడుకో" అంది.

వసంత పడుకుంది. కానీ నిద్ర పడుతుందా!

బుర్రలో-పురుగులేవో తిరుగుతున్నట్టుంది. శరీరంమీద చీమలు దోమలు పాకుతున్నంత చిరాకు కళ్ళు మూసుకుంటే వలయాలు తిరుగుతున్న ఆకారాలు మనసంతా శూన్యంగా, ఆలోచించలేనంత నీరసంతో మంచంమీద పడివుంది.

'ఏమిటీ! అమ్మాయికి బాగాలేదా!' అప్పుడే వచ్చిన తండ్రి అడుగుతున్నాడు. తల్లి ఏదో నర్ది చెప్తోంది.

కొద్దిసేపటి తర్వాత తండ్రి చెబుతున్నాడు—

'ఎలాగైతేనేం! అన్నీ కుదిరినట్టే...ఆ కళ్యాణమంటపం కూడా బుక్ చేయించేను. మొత్తానికి వియ్యంకుడు కోరినవన్నీ చేసేను పైగా అల్లుడుగారి సుముఖత్వం కూడా వుంది కదా! కట్నం లేకపోయినా పెళ్ళితంతులు బాగా ఆర్భాటంగా జరిపించమనీ, తన ఆదర్శం తనకే పరిమితంకానీ, తల్లిదండ్రులకీ, అక్క చెల్లెళ్ళకీ వుండే సరదాలు తృప్తిగా తీరాలనీ...మరీమరీ చెప్పేడుగదా!'

'అవునుమరి! అదీ న్యాయమే! అందుకే చేయగలినంత బాగా చేద్దాం. ఇక మీరు లేచి భోజనానికి రండి. అమ్మాయికి నిద్రపట్టినట్లు వుంది. సాయంత్రం ఒకసారి డాక్టర్‌గారికి చూపిస్తే మంచిదేమో' అంది తల్లి.

'అలాగే'

వసంత నీరసం ఎగిరిపోయింది. దిగ్గున లేచి కూర్చుంది మంచంమీద ఏమిటి తను విన్నదీ! ఆదర్శవంతుడైన అల్లుడుగారు చెప్పినవేనా ఈ ఆర్భాటాలన్నీ! ఇంకా ఏమి విన్నదో మననం చేసుకునేంత సహనం చచ్చిపోయింది.

ఆఫీసులోనుండి బిగబట్టుకుంటున్న కోపం, పౌరుషం, ఉక్రోషం ఉప్పెనలా పొంగేయి.

గబగబా చెప్పులేసుకుని గది బయటికి వచ్చింది.

'అమ్మా ఆఫీసులో డ్రాయర్‌లో చాలా అర్జెంటు కాగితం మర్చిపోయేనమ్మా. ఆఫీసరుగార్కి ఇవ్వాలి" అంటూనే వీధిలోకి నడిచింది

తల్లి వెనకాల ఏదో అంటున్నా మరింక వినిపించుకోలేదు. గబగబా నాల్గు అడుగులువేసి ఆటో పిలిచి కూర్చుని 'అతను' పని చేస్తున్న ఆపీసుముందు దిగింది.

'ఫలానా' వారు వున్నారా! చాలా అర్జెంటుగా మాట్లాడాలి' అంటూ లోపలికి కబురు పంపింది.

పావుగంట తర్వాత 'అతను' బయటికి వచ్చి దూరంగా కాంపౌండులో చెట్టుకింద నించున్న వసంతనిచూసి ఆశ్చర్యపోయి గబగబా అటు నడిచేడు.

అతన్ని ఒకసారి పైనుంచి కిందదాకా పరీక్షగా చూసింది ఎంతో ప్రయత్నంమీద తనలో రగులుకుపోతున్న కోపాగ్నిని దిగమింగుకుని...సౌమ్యంగానే మొదలుపెట్టింది.

'చూడండి! నేను ఇలా రావడం మీకెంతో విచిత్రంగా వుంది. కదూ! సహజమే! రావాల్సి వస్తుందని కూడా నేను అనుకోలేదు, కాని వచ్చాను. ఎందుకో తెలుసా! మీ వ్యక్తిత్వం ఎంత గొప్పగా

ఉంది స్వయంగా చెప్పాలని. ఉద్యోగం చేస్తున్న ఆడపిల్లని గురించి తెలుసుకోవాలంటే...ఆ ఆఫీసులో పనిచేసే అటెండర్నే అడుగుతారా.

'వాడి సాక్ష్యంతో కాబోయే భార్య క్యారెక్టర్ నమ్మి వివాహం చేసుకుంటే...రేపు అదే ఆఫీసులో ఆ అమ్మాయి పనిచేయాలంటే... వాడికెంత ఎగతాళిగా వుంటుందీ. వాడిముందు ఎంత చులకనై పోతుందో ఆలోచించలేక పోయారా.

'మీరు డైరెక్టుగా నన్నేమి అడగక్కర్లేదంటే నేను నిజంగా చాలా గర్వపడ్డాను. కానీ ఇలా చాటుగా నా గురించి...మా ఆఫీసులో పనిచేసే అటెండర్ని వాకబు చేయడం, ఛ. ఛ. ఎంత సిగ్గుచేటు. ఈ సంగతి ఈ రోజే తెల్సింది నాకు. చాలా ఆలస్యమైపోయిందని విచారించటంలేదు. ఆ మూడుముళ్ళు వేయక మునుపే మీ వ్యక్తిత్వం ఎంత గొప్పగా ఉందో తెల్సుకోగల్గేనని సంతోషిస్తున్నాను.

'పౌరుషం ఉన్న ఏ ఆడపిల్లయినా ఈ అవమానం భరించలేదు పైగా కట్నం తీసుకోటంలేదు కనుక పెళ్ళి బాగా ఘారీగా జరిపించాలని కూడా కోరేరుట! ఆ సంగతి ఇవాళే తెల్సింది. ఫర్వాలేదు... ఇప్పటికే మా నాన్న ఎంతో ఖర్చుచేసినా...ఇక ఇంతటితో ఆ ప్రయత్నాలన్నీ ఆపించి...నా లోనుతో ఆ అప్పులన్నీ తీరుస్తాను.

'చూడండీ! ఇలా నేను మీ ఆఫీసుకి వచ్చి మిమ్మల్ని ముఖం మీదే ఇలా అడిగేయడం సభ్యతగా లేదనుకుంటున్నారా? కాని మీకన్నా ఎన్నోరెట్లు వివేకంగా ప్రవర్తిస్తున్నానని తెల్సుకోండి. ఇదే ఇప్పుడు మిమ్మల్ని పిలవకుండా...మీ ఆఫీసు ప్యూన్ని పిలిచి మీ గురించి తెల్సుకుంటే ఎలా ఫీలవుతారూ?

'ఆడపిల్ల అలాంటి పొగరు పనికిరాదనో...ఆ హక్కు లేదనో ఉపన్యాసం ఇస్తారా! కానీ సమానంగా ఉద్యోగం చేయాలి. సంపాదించి సంసార భారం పంచుకోవాలి ఇదేమి న్యాయమండీ।

'హూ కట్నం తీసుకోకపోవడం ఒక్కటే ఆదర్శమనుకోకండి.

సంకుచితమైన మీలాంటి వాళ్ళని చేసుకుంటే...రేపు నా జీవితమంతా అడుగు అడుగునా నిఘావేసి చూడరని నమ్మకం ఏమిటీ।

'సంస్కారం లేని ఆదర్శం.. వేదికమీద ఉపన్యాసాలకీ, పది మంది ముందు మెప్పులు పొందటానికే పనికివస్తుంది తప్ప నిజ జీవితంలో సుఖాన్ని చేకూర్చదు.

'మీలాంటి సగటు పెద్దమనుష్యులు నిజమైన ఆదర్శానికి అడుగు దూరంలో ఉంటారు తప్ప!...ఆ అడుగు ముందుకు వేసే ప్రయత్నం చేయరు. ఈ సత్యం తెలిసేక ఇక మీతో నా జీవితాన్ని పంచుకోలేను ఆ మాట చెప్పడానికే వచ్చాను. ఇంటికి వెళ్ళి మీ పెద్దలకి చెప్పండి. చివరగా ఒక్కమాట। ఆడపిల్లని అలుసుగా చూడకండి. గుడ్‌బై' అనేసి గిర్రున వెనక్కితిరిగి చరచరా ముందుకు సాగింది వసంత.

బుసకొడుతున్న నల్లత్రాచులాంటి ఆమె జడ, ఆడపులిలా పడుతున్న ఆ అడుగుల తీరు చూస్తూ...నోట మాటరాక దిగ్భ్రాంతితో నిలబడిపోయాడా మానవుడు.

